విజయవంతంగా ప్రదర్శింపబడుతున్న చిత్రం

శ్రీ సారథీ స్టూడియోస్

AVM productions'





# శిక్ష

నరసింహారావు రేలంగి

కె. శశిభూషణ్

గోపాలరెడ్డి ఆత్రేయ మహదేవన్

నవయుగ






ముఖచిత్రం : కృ. షకాళీయం

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

## అగష్టు నెల భావపరిచయ పోటీ

## బహుమానం రూ. 25-00




ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

*గమనిక :* వ్యాఖ్యలు పోస్టుకార్డుపై వ్రాసి అగస్టు 6వ తేదిలోగా పంపాలి

---

## జూలై నెల భావపరిచయ పోటీ

## రు. 25-00 బహుమతి పొందిన వ్యాఖ్య

ఎండకు ఎదురు లేదు

మావటికి బెదురు లేదు

—యం. నాగచందర్

హైదరాబాదు.

## నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంతో మీ కుటుంబంలోని
వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యిక దృఢంగా,
ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే,
వారికది యివ్వడం అందుకే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారి, కోల్గేట్ యొక్క నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో.



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్నీ, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్నీ తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోపాటు దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారి మీ కుటుంబంలో వారంతా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి. వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




B84 55 Tel

*దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!*

# యువ

## 1985 దీపావళి ప్రత్యేక సంచిక

ఈ దీపావళికి వెలువడే ప్రత్యేక సంచికలో ప్రచురణార్థం రచయితలు, రచయిత్రులు, చిత్రకారులు తమ రచనలను, కార్టూన్లను మా కార్యాలయానికి సెప్టెంబరు 15 తారీకులోగా పంపగోరుచున్నాము. వారు ఈ క్రింద అంశాలను గమనించ ప్రార్థన.

1. రచన ఫుల్‌స్కేప్ సైజులో 10 పేజీలు మించరాదు.
2. కాగితానికి ఒక ప్రక్కనే వ్రాయాలి.
3. కవరు మీద 'దీపావళి ప్రత్యేక సంచిక కోసం' అని వ్రాయాలి.
4. ప్రచురణకు అంగీకరించబడని వాటిని త్రిప్పి పంపగోరేవారు తగు పోస్టేజీతో గల స్వంత చిరునామా కవరు జతపరచి పంపాలి.
5. రచన తమ సొంతమేననీ, దేనికీ అనుకరణ అనువాదం కాదనీ హామీ పత్రం వ్రాయాలి.
6. దీపావళి సంచిక కోసం పంపినా, స్థలాభావంవల్ల అందులో ప్రచురించక పోతే, తరువాత సంచికలలో ప్రచురించే హక్కు మాకు ఉన్నది.

—సంపాదకుడు

# చందమామ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 53 | అగస్టు 1985 | సంచిక 2


టెర్రరిజం లేదా హింసాత్మకం—ప్రపంచంలో ఏ దేశమూ, ఏ ప్రజలూ క్షమించరాని దుశ్చర్య. అయితే ఇటీవల ప్రపంచవ్యాప్తంగా ఈ టెర్రరిజమ్ కరాళదంష్ట్రాగ్నులతో వ్యాపిస్తూన్నది. దీనిని అరికట్టడానికి అభివృద్ధిచెందిన, చెందుతూన్న దేశాలు కలవరపడుతున్నాయి; చర్యలు తీసుకుంటున్నాయి; పథకాలు ప్రవేశ పెడుతున్నాయి.

ఈ టెర్రరిజమ్ ప్రత్యేకంగా జూన్ మాసంలో స్వైరవిహారం చేయసాగి నట్లు కనబడుతూన్నది. ఏథెన్స్‌నుంచి ట్రాన్స్‌వరల్డ్ ఎయిర్‌లైన్స్ విమానాన్ని హైజాక్‌చేసి బీరూట్‌లో ప్రయాణీకుల్ని నిలిపివేయడం, టోక్యో ఎయిర్‌పోర్ట్‌లో బాంబుప్రేలుడు, అట్లాంటిక్ సముద్రంలో ఎయిర్ ఇండియా విమానం 'ఎంపరర్ కనిష్క'ను కూల్చివేయడం— ఇవన్నీ టెర్రరిస్టుల చర్యలకు ప్రత్యక్ష నిదర్శనాలుగా భావించబడుతున్నాయి. గతంలో ఎయిర్ ఇండియా విమానాలు కొన్ని కూలిపోయినమాట వాస్తవమే. 1978లో 'ఎంపరర్ అశోకా' 1955లో 'కాశ్మీర్ ప్రిన్సెస్', 1966లో 'కాంచనజంగ' కూలిపోయాయి. అన్నింటిలో 'కనిష్క' కూలిపోవడం మహా దారుణమైన విషాదం. 329మంది ప్రయాణీకులు మరణిం

వారు డాక్టర్ వై. నాయుడమ్మ ఆ ప్రయాణీకుల్లో చనిపోవడం ఆంధ్రప్రదేశ్‌కే కాకుండా, అంతర్జాతీయంగా తీరని లోటు ఏర్పడింది. 1922లో తెనాలి తాలూకా యలవర్రులో జన్మించిన డా. నాయుడమ్మ చర్మపరిశోధనలో, పరిశోధన నిర్వహణలో, సాంకేతికనైపుణ్యం మార్పిడిలో అంతర్జాతీయ ఖ్యాతి గడించారు. మన రాష్ట్రప్రభుత్వానికి సాంకేతిక సలహాదారుగా ఉండేవారు.

గత మూడేళ్ళనుంచీ హింసావాదుల చర్యలు వివిధ రూపాల్లో బహిర్గతమవుతున్నాయని చెప్పవచ్చు. బహిరంగ ప్రదేశాల్లో హత్యలు, గృహదహనాలు, ట్రాన్సిస్టర్ బాంబులు, విమానాల్ని మళ్ళించడం, మోటారుసైకిళ్ళమీద పోతూ చేతి బాంబులు విసరడం ఈ విధంగా దేశంలో పలుచోట్ల భయానకాన్ని సృష్టించడం జరుగుతూన్నది. శ్రీమతి ఇందిరాగాంధీ మరణానికి వాళ్ళే కారకులని కూడా పత్రికలు ప్రకటించాయి.

టెర్రరిస్టుల సంఖ్య అతి స్వల్పం. కాని వాళ్ళు సృష్టించే భయానక దృశ్యాలు చరిత్ర పుటలపై నెత్తురు మరకల్లా నిల్చిపోతాయి. పాటియాలా దగ్గర ఒక గ్రామంలో అకాలీదళ్‌వారు మూడేళ్ళక్రితం ఆందోళన ప్రారంభించినప్పుడు, ఆ ఉద్యమం టెర్రరిస్టుల కైవశమవుతుందనీ, అమృతసర్ స్వర్ణదేవాలయంపై సైనికచర్య తీసుకోవాల్సి ఉంటుందనీ, అప్పటి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ హత్య చేయబడుతుందనీ, పలు పట్టణాల్లో దోపిడీలు, దౌర్జన్యాలు, మరణకాండ చెలరేగుతుందనీ ఎవరు ఊహించారు? కొంతమంది వ్యక్తులు టెర్రరిస్టులుగా ఎందుకు మారుతారో, దాన్ని ఉద్యమంగా ఎందుకు వ్యాపింప జేయాలనుకుంటారో, ప్రజల్ని భయపెట్టి వాళ్ళు సాధించదల్చుకుంది ఏమిటో, రాజకీయ కారణాలేమిటో- పరిశోధన చేయటానికి ఎంతో సబ్జక్టు కాగలదు దేశంలో అక్కడక్కడా తలెత్తుతున్నా టెర్రరిస్టు ఉద్యమాన్ని అణచడానికి తీసుకొన్న చర్యలకు ఈ పరిశోధన ఉపయోగపడుతుంది. టెర్రరిస్టుల డిమాండ్లు అతి భయంకరమైనవి. ఏ ప్రజా ప్రభుత్వమూ ప్రజల శ్రేయస్సు దృష్ట్యా వాటిని మన్నించజాలదు. టెర్రరిస్టులను అణచివేయడానికి, ప్రజలకు శాంతి భద్రతల్ని సమకూర్చడానికి ప్రభుత్వం కట్టుదిట్టమైన, నిర్మాణాత్మకమైన, వ్యూహాజనిత చర్యల్ని తీసుకోవాలి. ఇందులో ఏ మాత్రం అశ్రద్ధ వహించినా దేశానికి ముప్పు వాటిల్లుతుంది.




# వైశ్యాబ్యాంకులో పొదుపుచెయ్యడం అంటే మరింత ఇష్టం!"

ఎందుకో తెలుసా? డాక్టరు కావాలి అనే నా ఆశను నెరవేర్చడానికి, మా నాన్న వైశ్యాబ్యాంకులో పొదుపు చేస్తున్నారు'

మీ చిన్నారి ఆశయాలను మీరూ నెరవేర్చొచ్చు వైశ్యాబ్యాంకులో క్యుములేటివ్ మరియు అక్షయా డిపాజిట్ల ద్వారా

ప్రజా సేవలో 50 సంవత్సరాలకు పైగా అనుభవ-మున్న వైశ్యాబ్యాంకు మీ ప్రతి అవసరానికి తగిన అనువైన పథకాలను రూపొందించింది

వివరాలకు మీ దగ్గరలో యున్న మా బ్రాంచిని సంప్రదించండి




మా క్యుములేటివ్ మరియు అక్షయా పథకాలతో మీ పొదుపు ఎలా అభివృద్ధి చెందుతుందో మీరే చూడండి

| క్యుములేటివ్ డిపాజిట్ | | | | అక్షయా డిపాజిట్ | | |
|---|---|---|---|---|---|---|
| నెలసరి డిపాజిట్ | డిపాజిట్ కాలం | మీ పొదుపు మొత్తం | మేము తిరిగి ఇచ్చే మొత్తం | మీరు తిరిగి పొదుపు చేసే మొత్తం | డిపాజిట్ కాలం | మేము తిరిగి ఇచ్చే రొఖ్ఖం |
| రూ 160/ | నెలలు 120 | రూ 19 200/ | రూ పై 34 835-20 | రూ 33 790/ | నెలలు 120 | రూ (ఒకలక్ష) 1 00 000 |



## ది వైశ్యా బ్యాంక్ లిమిటెడ్

రిజిష్టర్డ్ ఆఫీసు
అవెన్యూరోడ్ బెంగుళూరు 560 002
అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసు
72 సెయింట్ మార్క్సురోడ్ బెంగుళూరు 560 001
ఛైర్మన్ రమేశ్‌గెల్లి

KIRON/VBL/85

గోవిందరావూ, గోపాల్రావూ-ఇద్దరూ ఒకవూరి వాళ్లే. వీధి బడినుంచి హైస్కూలుదాకా ఒకేచోట చదువుకున్నారు. ఒకే బెంచిపై కూర్చున్నారు. ఇద్దరిదీ చిన్ననాటి స్నేహం. వయస్సు పెరిగినకొద్దీ ఆ స్నేహం కొమ్మలూ రెమ్మలూ లాగా అభివృద్ధి చెందింది,

అయితే గోపాల్రావు చదువు స్కూలుఫైనల్‌తో భరతవాక్యం పలకాల్సి వచ్చింది. తండ్రి మరణంతో నెత్తిమీద మోయలేని బాధ్యతలు పడ్డాయి. గోవిందరావు కాలేజీలో చేరాడు. బి.ఏ. దాకా చదివాడు. ఆ తర్వాత రాజకీయాల్లోకి దిగాడు. తండ్రి ఎరువుల వ్యాపారం చేస్తూ వుండేవాడు. అంతకంటే రాజకీయాల్లో ఎక్కువ లాభసాటి వ్యాపారం చేయొచ్చని గోవిందరావు గ్రామ రాజకీయాల్లో ప్రవేశించాడు. పంచాయతీ బోర్డు మెంబరయ్యాడు. ప్రెసిడెంటుకు పోటీ చేశాడు. అవతలవ్యక్తి మూడుసార్లనుంచీ ప్రెసిడెంటు. అంగబలం, అర్థబలం జాస్తిగా గలవాడు, గోవిందరావుకు చావుబ్రతుకు సమస్య అయింది. నెగ్గితే రాజకీయాల్లో రాణించవచ్చు. ఓడిపోతే నేలకు కర్చుకున్నట్లే! అట్లాంటి సంక్షోభ సమయంలో గోపాల్రావు జన్మలో మర్చిపోలేని సాయం చేశాడు. అతని బావమర్ది ఒక మెంబరు, అతనికి నయానా భయానా చెప్పి, గోవిందరావుకు వోటువేసేటట్టు చేశాడు. గోవిందరావు ఆ ఒక్క వోటుతోనే పంచాయతీబోర్డు ప్రెసిడెంటు అయ్యాడు. గోపాలరావును అమాంతంగా కౌగిలించుకొని స్నేహ ధర్మంగా, ఆప్యాయ పూర్వకంగా, కృతజ్ఞతల వర్షం కురిపించి, ఆజన్మాంతం ఋణపడి వుంటానన్నాడు. గోపాల్రావు ఏమాత్రం పొంగిపోలేదు. గోవిందరావు అంత గొప్పగా కృతజ్ఞతలు చెప్పినా, సాధారణమైన చిరునవ్వు ద్వారానే వాటిని స్వీకరించాడు.

గోవిందరావు రాజకీయ జీవితానికి పంచాయితీబోర్డు ప్రెసిడెంటుగా తొలిసారిగానే విజయాన్ని సాధించడం శుభోదయంగా పరిణమించింది. ఆ తర్వాత అంటిపుచ్చుకున్నట్టు పదవుల నిచ్చెనమెట్లు ఎక్కిపోయాడు సునాయాసంగా.

సమితికి వైస్ ప్రెసిడెంట్ అయ్యాడు.

ప్రెసిడెంట్ గుండెపోటుతో పోయాక సమితికి ప్రెసిడెంట్ అయ్యాడు.

కోఆపరేటివ్ బ్యాంకుకు ఛైర్మన్ అయ్యాడు.

అయిదేళ్ళ తర్వాత అఫిషియల్ అభ్యర్థిగా నిలబడి, ఆ నియోజకవర్గం నుంచి ఎం.ఎల్.ఏ అయ్యాడు.

నూతన మంత్రివర్గంలో గోవిందరావుకు స్థానం లభించింది – అదృష్ట దేవత ఆలింగనం చేసుకున్నట్టు. పంచాయితీరాజ్ పోర్టుఫోలియో లభించింది.

మిత్రుడు గోవిందరావు రాజకీయంగా అవ్వాయి చువ్వలాగా పదవిపై పదవి సంపాయిస్తూ ఎంత పైకిపోయినా గోపాల్రావు కనబడినప్పుడల్లా 'కంగ్రాచ్యులేషన్స్' చెబుతూనే వచ్చాడు. రవ్వంత అసూయ పడలేదు. పని గట్టుకుని అతని దగ్గరకు వెళ్ళలేదు.

మంత్రి అయ్యాక గోవిందరావు మనస్తత్వంలో, మాట తీరులో, ఆర్థిక హోదాలో ఎంతో మార్పు వొచ్చింది. తాను జీవితంలో కోరుకున్న పదవిని ఇంత స్వల్పకాలంలో పొందగలనని అతడు ఊహించలేదు. ఊహించని సంఘటనలు జీవితంలో యదార్థంగా తటస్థపడినప్పుడు ఆనందంలో ఉండటం అద్భుతమేమీలేదు.

గోవిందరావు పదవుల సోపానంలో అంత పైకిపోయినా, గోపాల్రావు ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అనే సామెతను నిరూపిస్తూ అట్లాగే వున్నాడు– ఆ పల్లెటూళ్ళో.

అయితే గోపాల్రావు బావమర్ది ఆ వూరికి ప్రెసిడెంట్ అయ్యాడు కొన్ని విచిత్రమైన పరిస్థితులల్లో. ఇరు వర్గాలవారికీ పూర్తి మెజారిటీ రాకపోవడంతో రాజీ అభ్యర్థిగా గోపాల్రావు బావమర్దిని ఎన్నుకున్నారు.

సంవత్సరంన్నరలో గోపాల్రావు బావమర్ది చిక్కుల్లో పడాల్సివచ్చింది. కాంట్రాక్టుల్లో అతనికి పర్సెంటేజ్ లాభాలున్నాయనీ, ఇళ్ళకు పన్నులు పెంచటంలో ఆఫీసర్లతో కుమ్మక్కు అయ్యాడనీ, ఒక వర్గంవారిని అభిమానిస్తూ, మరో వర్గంవారిని అణగదొక్కటానికి ప్రయత్నిస్తున్నాడనీ ఎన్నో ఆరోపణలు, విమర్శలు వెలువడ్డాయి. దాంతో అతన్ని గద్దె దించాలని ఒక వర్గంవారు తీవ్ర ప్రయత్నాలు చేయసాగారు. ఆ ప్రయత్నాల్లో ఒక భాగంగా పంచాయితీ మినిస్టర్ గోవిందరావు దగ్గరకు వెళ్లారు. వాళ్ళకు మంత్రిగారు హామీ ఇచ్చారట – గోపాల్రావు బావమర్దిని పదవినుంచి తొలిగించేందుకు.

ఆ సంగతి తెలిసి గోపాల్రావు బావమర్ది గోపాల్రావు దగ్గరకొచ్చి వేడుకున్నాడు మినిస్టర్ గోవిందరావుతో చెప్పి తనని గండంనుంచి గట్టెక్కించమని.

ఎట్టకేలకు గోపాల్రావు ఒప్పుకున్నాడు. హైదరాబాద్ వెళ్ళేందుకు బావమర్ది కారు తీసుకురాగా అందులో హైదరాబాద్ వెళ్లాడు గోపాల్రావు. అదే మొదటిసారి మిత్రుడు గోవిందరావును 'ఫేవర్' అడగబోవడం.

గోపాల్రావూ, అతని బావమర్ది ద్వారకా హోటల్లో దిగారు. ఎప్పుడు రమ్మంటారని టెలిఫోన్‌లో అడిగాడు గోపాల్రావు మినిస్టర్‌గార్ని. తాను కేబినెట్ సమావేశానికి వెళుతున్నాననీ, సాయంత్రం రమ్మనమనీ, తన ఇంట్లోనే భోజనం చేయమనీ గోవిందరావు చెప్పాడు. 'అట్లాగే' అన్నాడు గోపాల్రావు.

సాయంత్రం ఆరుగంటలకు కారులో బేగంపేటలో వున్న మినిస్టర్ గారింటికి వెళ్లారు గోపాల్రావూ, అతని బావమర్దీ.

అప్పుడు మినిస్టర్ ఇంట్లో లేడు. ఎవరో సన్మాన సభకు అధ్యక్షత వహించడానికి వెళ్లారట. ఓ గంటలో వస్తారని పి ఏ. చెప్పాడు.

వరండాలో ప్రేం కుర్చీలో రెండు గంటలసేపు నిరీక్షించిన తర్వాత మినిస్టర్ గోవిందరావు వచ్చాడు అయితే ఆయన మరో ద్వారంనుంచి ఆఫీసు గదిలోకి వెళ్ళడంచేత గోపాల్రావును చూడలేదు.

గోపాల్రావు తన పేరును చీటీమీద వ్రాసి ప్యూనుకిచ్చి పంపించాడు.

అర్ధగంటైంది.

గంటైంది.

మినిస్టర్‌గారి గదిలోంచి పిలుపు రాలేదు.

ఈ లోపల పాతికమంది దాకా వచ్చి మినిస్టర్‌గారితో మాట్లాడి వెళ్ళిపోయారు.

గోపాల్రావుకు చిరాకేసింది. చేతి గడియారం చూసుకున్నాడు. తొమ్మిదీ ఇరవై అయింది.

గోపాల్రావూ, అతని బావమర్దీ ఒకళ్ళ మొహాలొకరు చూసుకున్నారు.

మళ్ళీ చేతిమీద తనపేరు వ్రాసి తాను ఎన్ని గంటలనుంచీ బయట వెయిట్ చేస్తున్నదీ కూడా వ్రాసి పంపించాడు ప్యూన్‌చేత అ ప్యూన్ చేతిలో అయిదు రూపాయలు పెట్టాడు గోపాల్రావు బావమర్ది వెంటనే చీటీని మినిష్టరుగారి కివ్వమని. అ ప్యూన్ తల ఆడించాడు.

తొమ్మిదీ యాభై నిముషాలైంది మినిస్టర్‌గారి దగ్గర్నుంచి పిలుపు రాలేదు.

గోపాల్రావుకు అపాదమస్తకమూ ఆగ్రహం వచ్చింది. అయినా ఏం చేయగలడు?

పదిగంటల అయిదు నిముషాలకు అ ప్యూన్ కనబడితే – "మినిస్టర్‌గారు

ఏమన్నారు?" అని అదుర్దాగా అడిగాడు గోపాలరావు బావమర్ది.

"ఏమనలేదు సార్. ఆ చీటి తీసుకున్నారు. చూసుకున్నారు. పేపర్ వెయిట్ కింద పెట్టారు. ఇహ ఇవాళ లాభంలేదండీ రేపొద్దునగాని దర్శనభాగ్యం కలగదు" అన్నాడు ప్యూన్.

"ఏం?" అన్నాడు గోపాలరావు బావమర్ది ఆశ్చర్యంతో.

"అయ్యగారు అంతఃపురంలోకి వెళ్ళి 'మందు' సేవిస్తున్నారు. మందు సేవించేటప్పుడు మామూలు మనుషులకు ఇంటర్వ్యూ ఇవ్వరు." అన్నాడు ప్యూను.

చివుక్కున కుర్చీలోంచి లేచాడు గోపాలరావు వొళ్ళంతా కుతకుతలాడగా. బావమర్దికూడా బరువుగా కుర్చీని ఖాళీచేశాడు.

కారులో హోటల్‌కి వస్తూండగా, "ఆనాడు నువ్వు బలవంతం చేయకపోతే నేను వోటు వేసేవాణ్ని కాదు. గోవిందరావు ఇంతగా గొప్పవాడు అయ్యేవాడు కాదు."

"ఏం చేస్తాం? అప్పటి గోవిందరావుకి ఇప్పటి గోవిందరావుకీ యింత తేడా వుంటుందనుకోలేదు." అన్నాడు గోపాలరావు ముక్తసరిగా.

*పదవిలో ఉన్నప్పుడుగాని మనిషి ప్రవర్తన బయటపడదు.*



*ఇది పెరిగే ప్రాయం గదా! నా కర్థమవుతుందిగా, వయసులోని ఆడపిల్లకి ఎంత ఇబ్బందో — తల్లిని గదా మరి.*

# "మా అమ్మాయి కోసం కేర్‌ఫ్రీ ఎందుకు ఎంచుకున్నానంటే"

నిజానికి ప్రతి తల్లికీ తెలుసు అసలు, వయసొచ్చిన కొత్తల్లో, ఆ తరుణంలో, ఆడపిల్లకు ఎలా వుంటుందీ అన్న సంగతి— బాల్యం నుంచి యవ్వనంలోకి అడుగెట్టే ఆ తరుణంలో పడే తొట్రుపాటు, ఏదోలా అనిపించే ఆ ఇబ్బందీను.

తల్లిని గదా, నేనూ ఒకప్పుడు ఆ వయసులో వున్నదాన్నే గదా, తెలుసును నాకంటుకే. మరందుకే తెలుసును నాకు నెలలోని ఆ అయిదు రోజులూ పడే ఇబ్బందీ, తొట్రుపాటూను.

**నేనైతే ఎప్పుడూ ఆ అయిదు రోజులకోసం ఇంట్లో తయారు చేసుకున్నదే వాడేదాన్ని. ఎంత ఎబ్బెట్టో చెప్పలేనిక— అదంతా చితకడం, ఆరెయ్యడమూను.**

అప్పటి సంగతి, ఇన్నేళ్ళబట్టీ ఇంట్లో తయారుచేసిన దాన్నే వాడేదాన్ని, ఎంతో ఎబ్బెట్టుగా వుండేది— అదంతా చితకడం, ఆరెయ్యడమూను.' ఆ 5 రోజులూ మళ్ళీ వచ్చాయిందోయ్ అని చుట్టుపక్కల వాళ్ళందరికి తెలిసేలా

# ఫూర్ ఫెలో

నేనొక అమ్మాయి వెనకపడ్డా
అమ్మాయి వాళ్ళన్నయ్య నన్నిలా
చేశాడ్సార్ ఎల్లాగైనాసరే
మీరు వాడి భరతం పట్టాలి!




ఓసి అదెంతపని వాడ్ని
నాకు చూపెట్టు కీళ్ళు
విరగ్గొట్టేస్తా!!



[redacted]

అరె మా అబ్బాయిని
చూపెడ్తున్నాడేంటి?
ఓహో.. వీడే
అదన్నమాట సంగతి!





విరగ్గొట్టారా! కీళ్ళే
విరగ్గొట్టా!! కానీ వాడివి
కావు నీవి!!



నవల

# విపులాచపృథ్వీ



రాజ్యలక్ష్మి

కాఫీ తాగటం పూర్తిచేసి - సిగరెట్ వెల్గించి పొగ వదులుతూ - కుర్చీలో వెనక్కి వాలి అక్కడికి కొత్త దూరంలో ముందుకు ఉరుకుతూ-వెనక్కి జరుగుతున్న కెరటాల్ని చూడసాగాడు బదరీనాథ్.

వెలుగు అస్తమిస్తున్న ఆకాశంనిండా ఎర్రటి మబ్బుకెరటాలు.

దూరంగా నీటిలో నిలిచిపోయిన ఓడలో లైట్లు.

రామకృష్ణా బీచ్‌నిండా రకరకాల మనుషులు ...రంగులు.... పొంగులు- కమ్మల పండుగ్గా-యువజనుల హృదయాలు రంజిల్లేలా!

కెరటాలు అంచున నిలబడి-పాప చెయ్యి పట్టుకుని ఆడుతూ-నవ్వుతూన్న ప్రేమమూర్తిమీద పడింది బదిరి దృష్టి.

తల వెనక్కి వంచి హాయిగా నవ్వుతూన్న ఆమెను ఎక్కడో చూసినట్లు అన్పించింది-లేచి మెట్లుదిగి అటువైపు అడుగులు వేశాడు.

పాపను తీసుకుని వెనక్కి మరలివస్తూన్న ఆమె ఎంతో సుపరిచిత

రాలిలా తోచింది. హఠాత్తుగా మెరుపు కొట్టినట్లుగా ఆమె జ్ఞాపకాల తెరమీద మెరిసింది.

ఆమె.... ఆమె విపుల!

నిశ్చేష్టుడిలా అక్కడే నిలబడిపోయాడు బదరి.

అక్కడికి కొంచెం దూరంలో ఇసుకలో కూర్చుని వున్న యువకుడి దగ్గరకెళ్ళి - నవ్వుతూ ఏదో చెప్తూ ప్రక్కన కూర్చుంది ఆమె. అతను పాపను ఒళ్ళోకి తీసుకుని ముద్దుపెట్టుకుంటున్నాడు.

ఆ దృశ్యాన్ని చూసి బదరి మనసు ఒక్క క్షణం ఈర్ష్యతో భగ్గుమంది. దగ్గరకెళ్ళి పలకరిద్దామా.... అన్న ఆలోచనతో రెండడుగులు వేశాడు.

'నిన్ను చూస్తుంటే నావాళ్ళ అసహ్యంతో—సిగ్గుతో జలదరించిపోతోంది.. మనుషుల్లో మృగం ఎవరో ఇప్పుడర్థమైంది, నీ ముఖం ఈ జన్మలో నాకు చూపించకు!' విపుల గొంతు చెవుల్లో మార్మోగినట్లనిపించింది. అతని నరనరానా ఏదో ఉద్రేకం .... వేటకు సిద్ధమౌతున్న పులిలా-అతని సహజ ప్రవృత్తి మేలొక్కని వొళ్లు విరుచుకుంది.

ఉన్నపాటున వెళ్ళి చనువుగా పలకరిస్తే.... ఆమె ముఖంలో కదలాడే భావాల్ని... కళ్ళల్లో మెదిలే భయాల్ని.... మొగుడివైపు కంగారుగా చూసే.... చూపుల్ని....తను ఎంజాయ్ చేయొచ్చు. చేతిలోని సిగరెట్ ఆఖరుసారిగా పీల్చి-దూరంగా విసరేసి ఆటువైపు వడివడిగా అడుగులు వేశాడు బదరీనాథ్.

"హలో!... విపులా! నేను గుర్తున్నానా?" అనడిగాడు నవ్వుతూ. అతని వైపు చూసింది. ఏదో భయంకర దృశ్యం చూస్తున్నట్లు అట్లాగే కళ్ళప్పజెప్పింది విపుల.

"నేనే విపులా! బదరీని! మర్చిపోయావా? అవున్లే.... దాదాపు పదేళ్ళు యిందిగా మనం కల్సుకుని!"

విపుల చటుక్కున కదిలి—తనలోని భావాల్ని లోలోపల అణిచివేసి.... "నువ్వా! చాలా మారిపోయావు సుమా! అందుకే గుర్తుపట్టలేకపోయాను! ఈ వూళ్లో వుంటున్నావా నువ్వు! ఏం చేస్తున్నావు?" అంది గబగబా.

"ఉద్యోగాలు నా వంటికి పడవు. అందుకే బిజినెస్‌లోకి దిగాను. మెయిన్ రోడ్డులో వున్న 'వాసవీ క్లాత్ షోరూం' మాది. అంతా నా భార్యతో వచ్చిన ఆస్తి అన్నమాట!" అన్నాడు.

"అట్లాగా! ఇతను నా భర్త. మిస్టర్ గౌరి. ఇతను బదరీనాథ్ అని.... బి.ఏ.లో నా క్లాస్‌మేట్...." అంటూ భర్తకు పరిచయంచేసింది.

సైడ్ బర్న్స్‌తో-కమల్‌హాసన్ మీసకట్టుతో - ఉత్సాహంగా తిరుగుతూ ప్రతీ ఆడపిల్లనీ ఆకర్షించే బదరీలో ఎంత మార్పు కన్పించింది విపులకు. జుట్టంతా పలచబడి - మీసంలేని నున్నటి గడ్డంతో - నల్లకళ్ళద్దాలతో కొంచెం పెద్దమనిషి తరహాగా కన్పించాడు. "నిలబడే వున్నారేం? కూర్చోండి. మీ ఫ్యామిలీ కూడా వచ్చిందా!" అని అడిగాడు గౌరి.

"లేదండీ! ఒక్కడ్నే వచ్చాను." అన్నాడు. తండ్రి వడిలో కూర్చుని తనవంక కొత్తగా చూస్తున్న పాపని పిలిచాడు బదరి. పాప తండ్రిని మరింత అతుక్కుపోయి రానని తెలిపింది.

"వెళ్ళమ్మా! ఆయన మన అంకుల్." అన్నాడు గౌరి.

"పోన్లెండి.... కొత్త కదా! పాపా నీ పేరు?" అన్నాడు.

"పింకీ!" అంది ముద్దుగా.

"పాప పేరు సౌందర్య. మేం ముద్దుగా 'పింకీ' అని పిలుస్తాం." అన్నాడు గౌరి. నల్లటి వత్తయిన జుట్టు బాబ్‌చేయబడింది. విశాలమైన కళ్ళు. సొట్టబుగ్గ నవ్వు అంతా తల్లిపోలికే.

ఒక్క క్షణం బదరీ మనసు బాధగా మూలిగింది.

'ఎంత ముద్దుగా వుంది పాప! సుదతి రెండుసార్లు పిల్లలంటే ఇష్టంలేదు. రెండుసార్లు ఎబార్షను చేయించుకుంది- తను వద్దంటున్నా వినకుండా. పిల్లలవల్ల తన అందం చెడిపోతుందన్న భయం.... 'స్వేచ్ఛగా-హాయిగా తిరగాలంటే పిల్లలుండకూడదు' అంటుంది.

'మరి.... బిడ్డతల్లి అయిన విపులలో ఏ మార్పూ లేదే! చదువుకునే రోజుల్లో ఎంత ఆకర్షణీయంగా వుండేదో .... ఇప్పుడూ అదే గ్లామర్. శరీరాకృతిలో గానీ - ముఖంలో గానీ - బాగుగా వుండే ఆ జుట్టులో గానీ ఏ మార్పు లేదు. అనుకున్నాడు బదరి

'అవునూ ... నువ్వు ఎమ్.ఏ. చేశావని విన్నాను. ఎక్కడైనా జాబ్ చేస్తున్నావా?' అనడిగాడు బదరి విపులని.

"కొన్నాళ్లు లెక్చరర్‌గా పనిచేశాను. పాప పుట్టాక రిజైన్ చేశాను" అని "ఎక్కడ మీ ఇల్లు? ఎంతమంది పిల్లలు నీకు?" అని ప్రశ్నించింది.

'తను ఆశించిన బంగారు, అందోళన మచ్చుకైనా లేవు ఆమెలో. తామిద్దరి మధ్య ఏం జరగనట్లే ఎంతో సహజంగా ప్రవర్తిస్తోంది. అవును మరి... మొగుడికి అనుమానం రాకూడదు కదా' అనుకున్నాడు బదరి.

చామనఛాయ రంగులో ఒడ్డూ-పొడుగుతో కళ్ళకు జోడు పెట్టుకుని హుందాగా వున్నాడు శౌరి. విపులా-శౌరి ఈడూజోడుగా - చూసేవాళ్ళని ఆకర్షించేంత మంచి జంటగా వున్నారని గమనించిన బదరి మనసు ఈర్ష్యతో విలవిలలాడింది.

విపులకి సమాధానం చెప్పాల్సిన అవసరాన్ని గుర్తించి - "మేమూ అప్లాండ్స్‌లో వుంటున్నాం. పిల్లలు.... అప్పుడే ఇష్టంలేక...." అని నవ్వాడు.

"మేం ద్వారకా నగర్‌లో వుంటున్నాం. మావారు పనిచేసే బ్యాంక్ అక్కడికి దగ్గరే!" అంది విపుల ఆతను అడక్కుండానే.

కావాలని ప్రసంగాన్ని - తాము చదువుకునే రోజుల్లోకి మళ్ళించాడు బదరి.

"కిట్టు నీకు గుర్తున్నాడా!"

విపుల ఒక క్షణం ఆగి - "గుర్తులేకేం? ఎక్కడుంటున్నాడిప్పుడు?" అనడిగింది.

"బందర్లోనే. ఇంకా వాడి బి.ఏ. పూర్తికాలేదనుకుంటా. అదే రూంలో వుంటున్నాడట!" అన్నాడు ఆమె కళ్ళలోకి గుచ్చిచూస్తూ.

"ఆ రూం వదలితేగానీ, ఆతని అదృష్టం మారదేమో!" అంది ఏ భావాన్నీ కనిపించనీయక.

ఆ మాటలోని శ్లేష అర్థమైంది బదరికి.

"నీతో ఎప్పుడూ వుండే వరలక్ష్మి ఎక్కడుంది" అనడిగాడు.

గుర్తుచేసుకుంటున్నట్లు ఆగి - "బొంబేలో అనుకుంటాను. ఉత్తరాలు రాసుకోవటం మానేసి చాలా రోజులైంది. లైఫ్‌లో సెటిలయాక - బంధుత్వాన్ని పెంచుకోక ఉత్తరాలు రాసేది చాలా కొద్దిమంది మాత్రమే. అది చాలా బద్ధకస్తురాలు." అని నవ్వి- "నీ భార్య రాలేదేం? ఏమిటి ఆవిడకు ఇంట్లో కాలక్షేపం!" అని ప్రశ్నించింది.

చాలా తెలివిగా సంభాషణ తప్పించిందని గ్రహించాడు బదరి.

"ఆవిడకు కాలక్షేపాలు చాలా వున్నాయి. క్లబ్బులో మెంబరు. తరచు ఆ కార్యకలాపాల్లో పాల్గొంటూ వుంటుంది."



అమ్మ తనని పట్టించుకోక కబుర్లలో పడటం పింకీకి నచ్చలేదు. ఇంటికి పోదామని మారాం చేయటం మొదలెట్టింది. 'ఇంక వస్తా'నంటూ అయిష్టంగానే లేచాడు బదరి.

అతన్ని రాబోయే ఆదివారం తమ ఇంటికి రమ్మని ఆహ్వానించాడు శౌరి. అడ్రసు తీసుకున్నాడు బదరి. చూస్తూ వూరుకుంది విపుల. బదరి వెళ్ళిపోయాడు.

స్కూటర్ స్టార్ట్ చేస్తూ - "నీ కింత మంచి ఫ్రెండ్ వున్నాడని ఎప్పుడూ చెప్పలేదేం?" అడిగాడు శౌరి.

"గుర్తుంచుకుని చెప్పేంత గొప్ప స్నేహితుడు కాడు". అంది విపుల కొంచెం ఆగి.

డైనింగ్ టేబుల్ పై కంచాలు అమర్చి - వడ్డిస్తున్న విపులవైపు చూస్తూ- "విన్ను ... నువ్వు అనేంత చనువు వున్నదంటే...." అని, విపుల తలెత్తి తన వైపు కొత్త ఆశ్చర్యంతో చూడటంతో ఆగి నవ్వాడు.

"వింత ఏముంది? మూడేళ్ళు కలిసి చదువుకున్నాం "

"'అడ-మగ' అని మా మధ్య గిరిగీసుకుని కూర్చోక క్లోజ్‌గా వుండే వాళ్ళం. కాకపోతే అతను ఇంకా అప్పటి విపులననుకుని 'నువ్వు' అంటున్నాడు.

పోసింది." అంది తుంచేస్తూ.

అతన్ని గురించి ఎక్కువగా మాట్లాడటం విపులకి ఇష్టంలేదని గ్రహించాడు శౌరి.

భోజనాలు అయినాక - పింకీని నిద్రబుచ్చి - తన దగ్గరకు వచ్చి కమల పాకులు చిలకలు చుట్టిఇస్తూ-ఏవేవో విషయాలు మాట్లాడటం విపుల కలవాటు. ఆమెకోసం ఎదురుచూస్తూ శౌరి పుస్తకాలు తిరిగేస్తూ వుంటాడు వచ్చేదాకా.

రోజులా పింకీ నిద్రపోయినా అక్కడ్నించి కదలక ఏదో ఆలోచిస్తూ వుండిపోయింది విపుల. ఉత్సాహమేదో కొరవడినట్లు మనసు చికాగ్గా వుంది. రోజులా భర్తతో కబుర్లుచెప్పే మూడ్ లేదు. మనసుని ఎంత మరలిద్దామన్నా- బదరీపైపుకే పరుగులు పెడ్తోంది.

జీవితంలో ఎప్పుడో ముగిసిపోయిందనుకున్న అధ్యాయం, సమాధినుండి బైటపడినట్లు.... దుమ్ముదులుపుకుని తిరిగి తన కళ్లముందు నిలిచినట్లనిపించింది.

ఉత్సాహమే ఊపిరిగా - సుఖం, సంతోషం జంటగా తమ ఇంట కాపురం చేస్తున్నాయి అన్నాళ్లూ. ఇప్పుడీ బదరీ కనిపించటం.... ఏదో అపశ్రుతిగా తోస్తోంది మనసు. చాలా సేపటి తర్వాత - లేచి తను గదిలోకెళ్లింది విపుల. విపులని చూస్తూనే పుస్తకం మూసి- "ఏం? పింకీ పడుకోలేదా?" అనడిగాడు శౌరి- ఆమె ఆలస్యానికి కారణం వూహిస్తూ.

"లేదు. పడుకుంది." అని "లైటు ఆర్పనా?" అడిగింది

"అలా వున్నావేం?" అనడిగాడు ఆమెను పరీక్షగా చూస్తూ.

"ఎలా?"

"ఏదో చిరాకుగా........ అసౌఖ్యంగా...."

"నిద్రవస్తోంది." అంది ఆవులింతటానికి ప్రయత్నిస్తూ.

"సరే.... లైటార్పి పడుకో.... అలసినట్లున్నావు" అన్నాడు.

గోడవైపు తిరిగి పడుకున్న విపులకి నిద్రరాలేదు. ఏదో అశాంతిగా వుంది. ఎందుకిట్లా అయిపోతున్నాను? బదరీ కన్పించినందుకా? ఆనాడు రాకముందు చాలా చిన్న వుత్సాహం అతన్ని చూడగానే ఎందు కావిరైపోయింది? తన మనసులోంచి తన స్మృతులు చెరిపివేసుకుని కొత్త వలపులు, మమతలు నింపుకుని ఎన్నేళ్లైనా? ఇంకా అతని తలపు తనలో నిగూఢమై వుందా?

బదరీ!

ఒకప్పుడు ఈ పేరు వింటూనే మనసు పులకించేది.

శరీరం అణువణువునా రక్తం పరుగులు వేసేది. వేణునాదం వింటున్నంత మధురంగా పరవశించిపోయేది.

విపుల మనోనేత్రంముందు అనేక దృశ్యాలు ఒకటొకటిగా మెదల సాగాయి.

## 2

కాలేజీ వెళ్ళే రోడ్డుపై నడుస్తున్నారు విపులా, వరలక్ష్మి.

"నిన్న నీ బర్త్‌డే అయితే కాలేజీకి ఎందుకు మానటం?" అనడిగింది వరలక్ష్మి.

"ఏం రాకపోతే? మన క్లాసుకేదైనా నష్టమా?" అంది విపుల.

"క్లాసుక్కాదే. పాపం.... నీ ఆరాధకుడు.... మన బాడీగార్డు నిన్నంతా నిరుత్సాహంగా వున్నాడు."

"అట్లాగా ఉత్సాహం కూడా మరీ ఎక్కువైతే ఒంటికి మంచిది కాదులే! అతనికి మధ్యమధ్య ఇల్లాంటి షాక్‌ట్రీట్‌మెంట్ ఇవ్వాలనే రాలేదు." అంది నవ్వుతూ.

"అతనిపై నీకెందుకే మరీ ఇంత చిన్నచూపు? పాపం...."

"ఏవిటి మరీ ఇన్నిసార్లు 'పాపం'లు వాలకపోస్తూ తెగ సానుభూతి చూపిస్తున్నావు? అతను నీకేం చుట్టంకాదే!"

"నాది దయార్ద్ర హృదయం మరి!" అని నవ్వి "ఇదిగో.... ఇది నీకివ్వమని నన్ను రిక్వెస్టు చేశాడు నిన్న." అంటూ తన పుస్తకాల నించి ఓ లావుపుస్తకం తీసింది వరలక్ష్మి.

"ఏవిటీ బృహత్ గ్రంథం? కొంపతీసి రోజుకో ప్రేమలేఖ చొప్పున రాసి బైండుచేయించాడా ఏం?" అంటూ తీసుకుని పేజీ తిప్పింది.

ఒక్క నిమిషం రెప్పవేయడం మర్చిపోయింది.

పొడుగాటి వాలుజడని వయ్యారంగా ముందుకేసుకుని...చిరునవ్వుతో... కళ్ళనిండా విరిసిన నవ్వుని నింపుకుని .... జీవకళ ఉట్టిపడుతోన్న ఆ చిత్రం ముమ్మూర్తులా తనదే! తను ఇంత అందంగా వుంటుందా?

అతను బొమ్మలు గీస్తాడని తెలుసు. పత్రికలలో అడపాదడపా అతని కార్టూన్లు చూస్తూనే వుంది. కార్టూన్లు గీసిన ఆ చేతిలో ఇంత సౌందర్య పిపాస

వుందని అనుకోలేదు.

"ఏమిటి అట్లా చూస్తుండిపోయావు? నీకు నువ్వే దిష్టిపెట్టుకోకు. అతను మంచి చిత్రకారుడని ఇప్పుడైనా ఒప్పుకుంటావా?" అంది వరలక్ష్మి.

అతని కార్టూన్ల గురించి ఎన్నోసార్లు వరలక్ష్మితో హేళనగా విపుల మాట్లాడింది. వరలక్ష్మి 'అదీ ఒక కళే' అంటూ సమర్థించేది అతన్ని.

"ఆ పేజీ మాత్రం ఇప్పుడు తిప్పకు. ఈ రోడ్డుమీద నువ్వు మూర్ఛపోయినా ఆశ్చర్యం లేదు" అంది వరలక్ష్మి.

"నీ మొహం.. అంత అద్భుతం ఏముందీమిటి?" అంటూ పేజీ తిప్పిన విపుల కళ్లప్పజెప్పి అట్లాగే నిలబడిపోయింది.

మనసునిండా విభ్రమం, ఉత్సాహం కెరటంలా ఎగసింది.

ఎదురుగా సమ్మోహనంగా నవ్వుతూ కమల్‌హాసన్ చిత్రం.

అరుదుగా – ఎప్పుడూ పత్రికలలో చూడనిది. మంచి పోజులో ఆకర్షణీయంగా ... ....

గబగబా పేజీలన్నీ తిప్పింది విపుల. అన్నీ కమల్‌వే. అనేక చిత్రాల నుండి రకరకాల దుస్తులలో–పోజులలో.

ఆఖరి పేజీలో – 'అందమే ఆనందం. ఆ ఆనందంకోసం జీవించే.... నీ వేణు.' అని వుంది.

"ఈ ఆల్బం ... నా కిమ్మన్నాడా!" అంది ఆశ్చర్యంగా విపుల.

"ఔను. నిన్న నీ బర్త్‌డే అని తెలుసుకున్నాడట. కాలేజీకి నువ్వు వచ్చి వుంటే శుభాకాంక్షలు చెప్పి ఇవ్వాలనుకున్నాడు కాబోలు.

నిరుత్సాహపడి .. "ఎట్లాగైనా సాయంత్రంలోగా విపులగారి కివ్వండి అని నన్ను బతిమాలాడు." అంది వరలక్ష్మి.

"ఇడియట్ .. మరి ఇప్పుడిచ్చావేమిటి?" అని కోప్పడింది.

"కావాలనే . 'ఈ రాయబారాలెప్పుడు మొదలెట్టావ్?' అంటూ నన్ను తన్ని గొడవ చేస్తావని భయపడ్డాను. ఇప్పుడైనా ... రోడ్డుమీద నన్నేం చెయ్యలేవన్న ధైర్యంతో.." అంటూ భయం నటించింది.

"ఏప్పుడైనా ఎందుకు తంతాను? కమల్ నా ప్రాణమని నీకు తెలీదా" అంటూ ఆ ఆల్బంని పుస్తకాల్లో వుంచుకుంది.

తన ఇష్టాయిష్టాలను తెలుసుకుని ఇంత చక్కగా తనతో పరిచయం చేసుకోవటం గుర్తొచ్చింది విపులకు.




కాలేజీ యానివర్సరీ ఫంక్షన్‌లో తన వీణ కచేరీ ఏర్పాటు చేశాడు.

ఇంటిదగ్గిర హాబీగా వాయించటం తప్ప ఎక్కడా ప్రోగ్రాం లివ్వలేదు అంతమటుకు. స్టేజీమీద ప్రోగ్రామివ్వటం అదే మొదలు.

అద్భుతంగా వుందంటూ అంతా అభినందించారు. ప్రోగ్రాములన్నీ అయ్యాక తను ఇంటికి రాబోయేముందు- పుష్పగుచ్ఛంతో అతను ఎదురొచ్చాడు.

"చాలా బావుందనీ - అద్భుతంగా వుందనీ, మధురమైన రసజగతిని సృష్టించారని అనను. ఎందుకంటే అవి చాలా చిన్న మాటలు. మీలో వున్న సంగీత నైపుణ్యానికి కొత్త మాటలు వెదకాలి!" అన్నాడు కళ్లలోకి చూస్తూ.

"థాంక్స్" చెప్పి - పుష్పగుచ్ఛం తీసుకుని ఇంటికొచ్చేసిందే గానీ అతని గడుసైన మాటలు చాలాసేపు మర్చిపోలేకపోయింది. ఎంతోమంది పొగిడినా - అతని ప్రత్యేక అభినందన గుర్తుండిపోయింది.

తను కాలేజీలో చేరిన ఆ నాలుగేళ్ళలో - తనపట్ల ఆకర్షితులై వెంటబడి వేధించిన స్టూడెంట్లు లేకపోలేదు. వెకిలిచేష్టలు, వెర్రిమాటలతో వాళ్లపట్ల అసహ్యం పెరిగేలా ప్రవర్తించేవాళ్లు తప్ప సభ్యత లేదు. వాళ్లనంతగా పట్టించుకునేది కాదు. ఇతన్ని బి.ఎ. ఫస్టియర్‌లో చూసింది. పసిమఛాయతో సన్నగా- పొడుగ్గా - అందమైన మీసకట్టుతో చూడగానే స్మార్ట్‌గా వున్నాడనిపించింది. స్పోర్ట్సులో పాల్గొంటాడనిపించింది. అంతే. అతని గురించి మరో భావం లేదు. తనపట్ల ఆకర్షితుడై - ఆరాధన పెంచుకున్నాడని సెకండియర్‌లో కొచ్చాక

కాలేజీలో మిగతా అందరి దృష్టిలో అతనికో ప్రత్యేకత వుందని తర్వాత గమనించింది. అతని పరిచయంకోసం, స్నేహంకోసం చాలామంది ఆడపిల్లలు ఆసక్తి చూపేవాళ్లు. అతని కార్టూన్లు పడినప్పుడల్లా తన క్లాసులోని వాళ్లంతా అతనిచుట్టూ చేరి దాని గురించి వాదించటం, తర్కించటం అనేకసార్లు చూసింది.

అయితే తనెప్పుడూ అభినందించనూ లేదు. విమర్శించనూ లేదు. మౌనంగా గమనిస్తూ వుండేది. అంతే!

బదరీ తనను ప్రత్యేకంగా అభినందిస్తూ – తన ఇష్టాయిష్టాల్ని గురించి తెలుసుకుని ఇల్లాంటి ప్రజంటేషన్ ఇస్తాడని ఎప్పుడూ వూహించలేదు.

కాలేజీకి వెళ్లి క్లాసులు జరుగుతున్నా – విపుల పరధ్యానంగానే వుండి పోయింది. రెండుమూడుసార్లు వరలక్ష్మి హెచ్చరించింది. 'ఏమిటే ఆ పరధ్యాన్నం? ఏ లోకంలో వున్నావు?' అంటూ. బదరీ లెక్చరర్ చెప్పే పాఠాన్ని శ్రద్ధగా వింటూ విపులవైపు కన్నెత్తి అయినా చూడకపోవటం గమనించింది విపుల. సాయంత్రం కాలేజీ అయినాక – క్లాసునించి బయటకు పోతున్న బదరీని ఉద్దేశించి – "ఒక్క నిమిషం ఆగండి మీతో మాట్లాడాలి!" అంది విపుల – అతన్ని గొప్ప ఏడిపించాలని. అతను ఆగిపోయాడు. అంతా బైటకి వెళ్లిపోయి వాళ్లిద్దరే మిగిలారు.

విపుల ఏం మాట్లాడుతుందా అన్నట్లు చూస్తున్నాడు.

"బదరీనాథ్‌గారూ? ఈ వూళ్లో కమల్ అభిమానసంఘాలేమైనా వున్నాయా?" అనడిగింది విపుల.

"వున్నాయి."

"మీకు తెలుసా?"

ఉత్సాహంగా చూసి "తెలుసు" అన్నాడు.

"అయితే... ఇదిగో.... ఈ ఆల్బం వాళ్లకివ్వండి, సంతోషంతో – మీకు పాదాభివందనం చేస్తారు." అంది అతని ఆల్బం అందిస్తూ.

బదరీ కెంపుపెదవి పంటితో నొక్కిపెడుతూ మౌనంగా చూశాడో క్షణం. ఆ కళ్లల్లో కోపం, గాయపడిన అతని మనసు–

"నిజంగా ఇవ్వనా? అందులో వున్న ఈ చిత్రంతో సహా?" వెటకారంగా అనేలా చేసింది – ఆల్బం తీసుకున్నాడు.

తన చిత్రం అందులో వుందన్న సంగతి గుర్తొచ్చి- నాలిక్కొరుచుకుని- "ఓ .. అది వుంది కదూ!" అంటూ తిరిగి ఆల్బం తీసుకోబోయింది.

ఆమె కందనివ్వక వెనక దాచుకుని- "వుండనివ్వండి. ఆల్బంకే అలం కారమైనది మీ చిత్రం!" అన్నాడు నవ్వుతూ.

"నా పర్మిషన్ లేకుండా ఆ చిత్రం ఎందుకు గీశారు!" అంది కొంత కోపంగా.

"అందం సర్వజనీనమైనదట. అది ఎక్కడున్నా ఆరాధ్యనీయమే. పర్మిషన్లు, నిబంధనలు దానికి వర్తించవు- ముఖ్యంగా కళాకారులకు."

"మీ రన్నది ప్రకృతి కి సంబంధించినంతవరకు. మనుషులకు వర్తించదు."

"ప్రకృతి, మనిషి వేరని నేననుకోను. ఇద్దరికీ అవినాభావ సంబంధం వుంది. నాలోని కళని రెచ్చగొట్టే అందం మీకు వుండటం నా తప్పుకాదు."

"ఏమిటి మీరనేది? నాకు తెలియకుండా నా చిత్రం వేయటమే కాక పైగా సమర్థించుకుంటున్నారా!" అంది కొంత కటువుగా.

"మిస్ విపులా! మీ అభియోగం అర్థంలేనిది. ఎంతో కష్టపడి ఎన్నో కోణాల్నుంచి మిమ్మల్ని గమనించి - ఏకాగ్రతతో మీ బొమ్మ గీశాను. మీకే ప్రజెంట్ చేద్దామనుకున్నాను. మిమ్మల్నేదో న్యూడ్‌గా చిత్రించినట్లు ఎందుకిలా చిరుబురు లాడతారు? మన కాలేజీలో ఎంతోమంది ఆడపిల్లలున్నారు. వాళ్లందరిలో లేని ఏదో ప్రత్యేకత మీలో నాకు కన్పించింది. ఆ ప్రేరణతో గీశాను. గొప్ప కళా ఖండం కాకపోయినా బాగానే వేశాననుకుంటున్నాను. అందాన్ని ఆరాధించటమే మీ దృష్టిలో నేరమైతే శుంతవ్యుడ్ని. మిమ్మల్ని బాధించాలనే ఉద్దేశం నాకు లేదు. మీరు ఎప్పుడూ ఆనందంగా - సంతోషంగా వుండాలనేదే నా ఆకాంక్ష. అందుకే అందుకే ఎంతో ప్రియమైన కమల్ చిత్రాల్ని ఎంతో శ్రమపడి సేకరించి ఈ ఆల్బం తయారుచేశాను. మీరు థ్యాంక్స్ చెప్పకపోగా నిందవేస్తున్నారా!" అన్నాడు బదరీనాథ్.

అతనట్లా నిలదీసి మాట్లాడడంతో కొంత కంగుతింది విపుల 'తప్పయి పోయింది క్షమించండి.' అంటూ పీక్కు నమలు జాడనుకుంది.

అయినా ఓటమిని అంగీకరించలేక—

"ఈ విశాలయితే మీరు మొదట్లోనే చూపిస్తే గొడవుండేది." అంటూ విసురుగా అక్కడ్నించి కదిలి వెళ్ళబోయింది.

"ఒక్క నిముషం... ఇదిగో అల్బం తీసుకోండి. మీ మనసులో కమల్ పట్ల కొండంత అభిమానం గూడుకట్టుకుని వుందని నాకు తెలుసు. ఇది మీ దగ్గరే వుండతగ్గది." అంటూ అందించాడు

తిరస్కరించలేక— తిరస్కరించటానికి కారణం కన్పించక తీసుకొంది విపుల.

"నా పట్ల ఇంత శ్రద్ధ ఎందుకు మీకు?" అంది.

"ఎందుకంటే.... నేను చెప్పలేను. మీరు ఒంటరిగా—ప్రశాంతంగా ఆలోచించండి. సమాధానం దొరకవచ్చు!"

ఆ రాత్రంతా ఆలోచించింది విపుల.

'తనని అభిమానిస్తున్నాడా? ఆరాధిస్తున్నాడా?'

ఏదైనా.... ఇదా పద్ధతి?

కానీ.... ఈ పద్ధతిలో తనని అల్లరిపెట్టడం, అగౌరవపర్చటం లాంటివేం లేవు. అతని చర్యలద్వారా మెత్తగా అతని ఇష్టాన్ని తెలియబరుస్తున్నాడు.

కానీ.... ఇంతటితో ఆగుతాడా?

ఆగకపోతే?

ఎందుకనో అతనిపట్ల వైముఖ్యం విసుగులాంటివేం లేవు తనలో.

అతని మాటలు— చర్యలు సంస్కారంగా – వినయంగా అన్పిస్తున్నాయి. స్నేహంగా— ప్రేమగా చూసే ఆ చూపులు.... నవ్వుతున్నప్పుడు మెరిసే ఆ కళ్ళు, తనపట్ల కనపరిచే ఆ అభిమానం ఎట్లా కాదనటం? ఇదంతా తనకు ఇష్టంగానే అన్పిస్తోంది. ఇది ఆకర్షణా? ప్రేమా?

'లవ్ ఎట్ ఫస్ట్ సైట్' అంటారు. మొదటిచూపులోనే గాఢమైన ప్రేమ అనుభూతికి లోనై — అతనికోసమే తను ఇన్నాళ్ళు వేచిచూసిందనీ — అతను తప్ప తనకు వేరే జీవితం వద్దనీ— అతనితో కలిసివుండని జీవితం వ్యర్థమని ... తనకు అన్పించలేదు. అతనట్లా ఫీలయ్యాడేమో! ఇంకా కొన్నాళ్ళు అతన్ని పరిశీలించాక కానీ ఏ నిర్ణయానికి రాకూడదు.' అనుకుంది.

సెకండియర్ ఎగ్జామ్స్ అయాయి. ఈలోగా మౌనంగా ఆరాధనగా మాడటంతప్ప బదరీ విపులతో మాట్లాడానికూడా ప్రయత్నించలేదు.

ఆఖరి పరీక్ష రాసి బైటపడ్డాక అప్పుడు పలకరించాడు బదరి.

"ఎట్లా రాశారు?"

"ఫర్వాలేదు. మీరు?"

"బాగానే రాశాను."

వరలక్ష్మిని కూడా అడిగాడు.

ముగ్గురూ మాట్లాడుకుంటూ నడవసాగారు.

చౌరస్తా దగ్గర ఆగారు.

విపుల, వరలక్ష్మి అతనితో వస్తామని చెప్పి తమ ఇంటిసందులోకి తిరిగారు

"మిస్ విపులా! ఒక్క నిముషం!" అంటూ ఆపాడు బదరి.

ఏమిటన్నట్లు చూసింది.

"మీతో కాస్త....మాట్లాడాలి!"

"చెప్పండి!"

ఏం చెప్పబోతాడా అన్న ఆత్రుతతో గుండె స్పందన పెరిగింది.

"ఇక్కడ కాదు!"

అతడు వరలక్ష్మివైపు కాస్త ఇబ్బందిగా చూస్తూ అన్నాడు.

"ఎక్కడ?" అంది విపుల.

"నాతో కాస్త అట్లా నడుస్తారా!"

"పద వరం..." అంది విపుల.

"మీరొక్కరే....ఒంటరిగా....నాతో నడవటం భయమా?"

"భయమెందుకు!" అని వరలక్ష్మితో వస్తానని చెప్పి అతన్ని అనుసరించింది.

పదినిమిషాలు మౌనంగా నడిచాక—

"ఏదో మాట్లాడాలన్నారు?" అంది విపుల.

"రేపటినుంచి హాలీడేస్ కదా! ఇక మీరు కనిపించరు. నా మనసు విప్పి చెప్పే అవకాశం ఇవాళ పోగొట్టుకుంటే మళ్ళీ ఎప్పటికో.... అందుకే...."

విపుల మౌనంగా వుంది.

"విపులా! మీరు తెలివైనవారు. నేనేం మాట్లాడాలనుకుంటున్నానో మీకు తెలుసు." అన్నాడు.

"నా కెలా తెలుస్తుంది?"

"ఇన్నాళ్ళ నా ప్రవర్తన - మీపట్ల నాలో నిండివున్న ఆరాధన అర్థం చేసుకోలేనంత పసివారు కారనుకుంటాను?"

"ప్లెయిన్‌గా చెప్పండి!"

"ఆల్‌రైట్! విపులా! మిమ్మల్ని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. మీ




అంగీకారంకోసం అర్థిస్తున్నాను. నా గురించి మీ అభిప్రాయం ఏమిటో చెప్పండి!"

విపుల మాట్లాడలేదు.

"ప్లీజ్.... మీ మౌనంతో నన్ను బాధించవద్దు."

"నాకు కొంచెం టైమివ్వండి. ఆలోచించుకోవాలి."

"సరే... నాలుగురోజుల తర్వాత...."

మధ్యలో అడ్డుపడి— "రేపు నేను వూరెళ్తున్నాను, శలవులు గడపటానికి. మళ్ళీ కాలేజీ తెరిచాక కలుద్దాం! అప్పుడు చెప్తాను!" అంది.

"ఈ రెండునెలలూ నన్నిట్లా సందిగ్ధావస్థలో వుంచుతారా!"

"తొందరపడటం వివేకం కాదు. ఈ నిర్ణయంమీదే నా భవిష్యత్ ఆధారపడి వుంది. ఆలోచించుకోవటానికి ఈమాత్రం టైం వుండాలి." అంది తన చేతి గోళ్ళవంక చూసుకుంటూ.

బదరి మౌనంగా ఆమెవైపే చూస్తున్నాడు.

విపుల తలెత్తి అతని కళ్ళల్లోకి చూడలేనట్లు అట్లాగే బిడియంగా వుండిపోయింది.

అతను నిట్టూరుస్తూ — "సరే. మీ ఇష్టప్రకారమే కానివ్వండి, మిమ్మల్ని తొందరపెట్టటం దేనికి! కాలేజీ రీఓపెనింగ్ రోజుకోసం ఎదురుచూస్తూంటాను. ఆ రోజుకి తప్పనిసరిగా మీరు ఇక్కడ వుండాలి, ఓ.కే!"

తల వూపింది అంగీకారంగా.

హఠాత్తుగా ఆమె కుడిచేతిని తన చేతిలోకి తీసుకుని — మృదువుగా చుంబించి వదిలాడు.

"మీ నిర్ణయం నాకు అనుకూలంగా వుంటుందని ఆశిస్తున్నాను. వస్తాను.

గుడ్‌బై." అతను వెళ్ళిపోయాడు

విపుల ఇంటికొచ్చినా అతని మాటల్ని మర్చిపోలేకపోయింది. తన చెయ్యి పట్టుకుని ముద్దుపెట్టుకున్నప్పుడు ప్రవహించిన విద్యుత్ ఇంకా అట్లాగే వున్నట్లు అనుభూతి. చేతిని తన పెదవుల కానించుకుంది.

## 3

విపుల తన తల్లితో రాజమండ్రి వచ్చి వారంరోజులైంది. అక్కగారింట్లో కాలక్షేపానికేం కొదువలేదు. విపుల అక్క కపిలకు ఇద్దరు కొడుకులు. సెవంత్ సిక్స్ చదువుతున్నారు. వాళ్ళతో క్యారమ్స్-షటిల్ ఆడుతూ- వాళ్ళతో సమానంగా అల్లరిచేస్తూ- సెలవుల్ని ఎంజాయ్‌చెయ్యటం విపులకు అలవాటే.

కపిల భర్త త్రిగుణ్ ఆ వూళ్ళోని జాతీయం చేయబడిన ఓ బ్యాంకు మేనేజర్.

విపుల తల్లి జానకమ్మకు ఈ ఇద్దరే కూతుళ్లు. భర్తతో మనస్పర్థలువచ్చి చాలా ఏళ్ళక్రితమే విడిపోయింది జానకమ్మ. కొన్నాళ్లు స్కూలుటీచరుగా పని చేసి-ఆరోగ్యం అనుకూలించకపోవడంతో ఆ ఉద్యోగం మానుకుంది. పుట్టింటి కామె ఒక్కతే కూతురవటంతో- కొంత ఆస్తి - ఉండటానికి ఇల్లు దక్కాయి. పిల్లలిద్దర్నీ ప్రాణంలా చూసుకుంటూ వాళ్ళకోసమే తన బ్రతుకును ఈడుస్తోంది.

తల్లిపడ్డ బాధలు, మానసిక వ్యధ కూతుళ్ళిద్దరికీ తెలుసు. అందుకే ఆమె మనసుకు కష్టంకలగకుండా ప్రవర్తిస్తూ తల్లిని ఎప్పుడూ సంతోషంగా వుండేలా చూసుకుంటారు. కపిల భర్త త్రిగుణ్ కూడా ఎంతో యోగ్యుడు. అత్తగారిని తల్లిగా భావిస్తూ ఆమెకు చేదోడువాదోడుగా వుంటాడు. విపుల ఎప్పటిలా చలాకీగా లేక కాస్త పరధ్యానంగా వుండటం గమనించి-త్రిగుణ్-

"ఏం మరదలుగారూ! ఎందుకలా దివాలాముఖం వేశారు! ఏ కష్టం వచ్చిందేమిటో నాకు చెప్పు. చిటికెలో సాల్వ్ చేసేస్తాను. కొంపతీసి ఎగ్జామ్స్ సరిగ్గా రాయలేదా ఏం!" అడిగాడు నవ్వుతూ - విపులకి త్రిగుణ్ దగ్గర బాగా చనువు వుంది.

"నాది దివాలాముఖం కాదు. నువ్వే.... ఎక్కడ పిక్చర్ చూపించాల్సి వస్తుందో అని ముఖం చాటేస్తున్నావ్!" అంది నిష్ఠూరంగా.

"హరిహరీ! ఇదొక అపనిందా? ప్రొద్దున్నే ఎవరిముఖం చూశానబ్బా?"

"అద్దంలో నీ ముఖం చూసుకొందామనుకొంటే కోతి ముఖం కన్పించి వుంటుంది.... పాపం!" అంది నవ్వు బిగపట్టుకుని.

"నీ సోదరి వరించి మాలవేసిన నాడి కోతిముఖమా! పేరులో కోతిని దాచుకున్న ఓ అర్ధాంగి నీ చెల్లెలి ప్రేలాపన విన్నావా?"

"విన్నానులెండి.... దానికి తనువచ్చి పదిరోజులైనా సినిమాకి తీసుకెళ్ళలేదని కోపం." అంది నవ్వుతూ కపిల.

"కమల్ నటించిన పిక్చర్స్ ఏమీ లేవే!" అన్నాడు.

"అదిగో.... చూడక్కా. ఎట్లా తప్పించుకోవాలని చూస్తున్నారో.... నేను వచ్చినప్పుడల్లా కమల్ పిక్చర్స్ మాత్రమే చూపిస్తున్నట్లు... పెద్ద ఫోజు!" అంది కినుకగా.

"ఓ.కె. ఇవాళ రెడీగా వుండండి. తొందరగా వచ్చేస్తాను. ఫస్టుషో, సెకండ్‌షో, ఇంకా స్పెషల్‌షో లేమైనా వుంటే అవికూడా చూసేద్దాం. సరేనా?" అన్నాడు త్రిగుణ్.

"అంత శ్రమ నీ కెందుకులే బావా! మేమంతా వెళ్తాం. నువ్వు ఇంటికి కాపలా కాస్తే చాలు. అసలే రోజులు బాలేదు. ఇంటికి తాళంపెట్టి వెళితే ప్రమాదం!" అంది నవ్వుతూ విపుల.

"గడుగ్గాయి!" అంటూ అతనూ నవ్వేశాడు. ఆ సాయంత్రం అంతా సినిమాకెళ్ళారు. అందులోని హీరోని చూస్తుంటే బదరి గుర్తుకొచ్చాడు. తను అతనికిచ్చినమాట గుర్తుకొచ్చింది. ఆ తర్వాత సరిగ్గా సినిమా చూడలేకపోయింది. ఇంటికొచ్చాక చూసిన సినిమా గురించి కాస్సేపు చర్చ జరపటం అలవాటు విపులకు. త్రిగుణ్ విపులని రెచ్చగొట్టటానికి కావాలని విపులకి విరుద్ధంగా మాట్లాడాడు.

వాళ్ళిద్దరి వాదన అంతా సరదాగా వింటారు. ఈరోజు మాత్రం విపుల తల్లితోపాటు తనూ శ్రోతగా మిగిలిపోయింది.

కపిల_త్రిగుణ్ వాదనలు వింటూ మౌనంగా వుండిపోయింది.

"ఏం విపులా! నువ్వు మాట్లాడవేం?" అన్నాడు త్రిగుణ్.

"పోనిద్దూ బావా! వ్యాపారంకోసం వాళ్ళు సినిమాలు తీస్తుంటే అదేదో మన జీవిత సమస్యలా తర్జనభర్జన లెందుకు?" అంది తేలిగ్గా.

"ఆహా!. మరదలుపిల్లకు ఇప్పటికి జ్ఞానోదయం అయిందన్నమాట," అన్నాడు నవ్వుతూ.

ఆ రాత్రి నిద్రపట్టలేదు విపులకు. బదరి గురించే ఆలోచిస్తూ చాలా రాత్రి గడిపింది.

మరో వారం గడిచింది.

రెండ్రోజులు వరలక్ష్మితో పడతెగని కబుర్లతో గడిచిపోయింది విపులకు. ఆ మరునాడు టౌన్‌హాల్లో బాలమురళీ కచేరీ వుందని తెలిసి - జానకమ్మగార్ని తీసుకు వెళ్ళింది విపుల. వరలక్ష్మి కూడా వచ్చింది. వీళ్ళు వెళ్ళేసరికే ప్రారంభమైంది.

మూడు గంటలపాటు సాగిన ఆ మధుర సంగీతవాహినిలో బాహ్యజగత్తును మరచి ఏదో దివ్యలోకంలో సంచరించినట్లు ఫీలయ్యారు. తిరిగి వస్తున్నప్పుడు -

"విపూ.... అదుగో నేవ్.... మన రక్షకభటుడు!" అంది వరలక్ష్మి.

విపుల ఆత్రుతగా - "ఎక్కడా?" అంది చుట్టూ చూస్తూ.

"అదుగో... అక్కడ! పక్కన ఎవరో వయ్యారిభామ కూడా వుంది!"

బదరీ సైకిల్ పట్టుకుని - ప్రక్కనున్న ఇరవైఏళ్ళ అమ్మాయితో ఏదో మాట్లాడుతున్నాడు. ఇద్దరూ నవ్వుతున్నారు.

బదరి తనను చూస్తే బాగుండుననుకుంది విపుల.

తను వూరినుంచి వచ్చేసిందని - అతనికోసమే తొందరపడి వచ్చేసిందని అతనికి తెలియజెప్పాలనుకుంది. బదరీ ఎటూ చూడక ఆమెతో కలిసి కొంచెం దూరం నడిచాక మధ్యలోనే మరో సందులోకి తిరిగిపోయాడు. కొంచెం ఆశాభంగం కలిగింది విపులకు.

నాల్గురోజుల తర్వాత మళ్ళీ బజార్లో కన్పించాడు.

విపుల గాజులు తీసుకుంటోంది షాపులో. బదరీ ఎవరికో ఏదో ప్రజంటేషన్ తీసుకుంటున్నాడు. అతని కంఠం గుర్తించి ఆవైపు తలతిప్పిన విపులకు ప్రజంటేషన్ అందంగా ప్యాక్ చేయిస్తూ అతను కనబడ్డాడు. విపుల మనసు ఉత్సాహంతో ఉరకలు వేసింది. అతనితో మాట్లాడాలని ఉబలాటపడింది. తనని చూడగానే అతని కళ్ళల్లో మెరిసే ఆనందం, విస్మయం వూహించుకుంది. అతను కనుక చూసి పలకరించాలని అతని ముందునుంచే నడిచి కేష్ కౌంటర్ దగ్గర నిలిచి - "ఇదిగోండి బిల్లు!" అంది కొంచెం పెద్దగా. అతను చూడలేదు. ఉక్రోషంతో మిగతా చిల్లర తీసుకుని బైటకొచ్చేసింది. అతనిపై కోపం. మళ్ళీ అతనెప్పుడు కన్పిస్తాడోనన్న బెంగ. నెమ్మదిగా అడుగులు వేస్తోంది.

"ఎప్పుడొచ్చారు?" అన్న ప్రశ్న విన్పించి చివ్వున తల త్రిప్పింది. నవ్వుతూ బదరి.

అన్నీ మర్చిపోయి - "వారం అవుతోంది!" అంది.

"ఎట్లా గడిచినయ్ శలవులు?" అన్నాడు కళ్ళల్లోకి చూస్తూ.

"బాగానే గడిచాయి."

"నాకు మాత్రం భారంగా...."

"కవితలూ-కార్టూన్లు రాస్తూ కలలు కనేవాళ్లకి కాలం గడవక పోవటమూ!" అని నవ్వింది.

"కాలం గడవకే వాటిని ఆశ్రయించేది!"

"కలవల్లోనూ ఇంటికి వెళ్ళ లేదేం?"

"నా కిక్కడే బావుంటుంది. నా భవిష్యత్, నా జీవితం అంతా ఇక్కడే. నా కీవూరు విడిచిపోవా లనిపించదు!"

వాళ్ళ కెదురుగా కూల్‌డ్రింక్ షాపు కన్పించింది. "రండి! ఏదైనా కూల్ డ్రింక్ తీసుకుందాం!" అంటూ బదరీ షాపులోకి దారితీశాడు. లోపలికెళ్లి బాదంఫీర్ తీసుకున్నారు.

అతని చేతిలోని ప్యాకెట్టును చూస్తూ - "ఏదైనా ఫంక్షనుందా?" అనడిగింది విపుల.

"ఓ ఫ్రెండ్‌కి సెండాఫ్ ఇవ్వాలి!"

"మొన్న టౌన్‌హాల్లో కన్పించారు: మీతో ఎవరో...."

"ఓ మీరూ వచ్చారా? ఆమె నా కజిన్." అన్నాడు.

ఇంకా ఆమె గురించి ఏదన్నా చెప్తాడేమో అని చూసింది. అతనామాట అక్కడితో తుంచేశాడు. సినిమాల గురించి - తను చదివిన పుస్తకాల గురించి చెప్తున్నాడు.

అవేవీ బుర్రకెక్కటం లేదు విపులకు. 'విపులా.... మీ నిశ్చయం ఏమిటి?' అని అడుగుతాడని ఎదురుచూస్తోంది.

అతనా ప్రసక్తి తేనేలేదు. 'అతడు అడగనప్పుడు - తనెందుకు బయట పడటం?' అనుకుని వూరుకుంది విపుల.

బిల్లు అతనే ఇచ్చాడు. ఇద్దరూ బైటకొచ్చారు.

"మళ్లీ ఎప్పుడు?" అన్నాడు నవ్వుతూ.

"కాలేజీ తెరుస్తారుగా!" అంది తనూ నవ్వుతూ.

ఇద్దరూ విడిపోయారు.

## 4

కాలేజీ తెరిచారు.

మొదటిరోజు కాలేజీకి వెళ్ళగానే బదరీకోసం చూసింది విపుల. అతను కన్పించాడు. దూరంగానే వుండిపోయేడు గాని విపుల దగ్గరికొచ్చి-'నా ప్రశ్నకు




బదులేది!' అని అడగలేదు. అతను అడిగితే - 'బదరీ మీ ప్రేమను అంగీకరిస్తున్నాను. మీరంటే నాకూ ఇష్టమే!" అని చెప్పాలనుకుంది. ఈ రోజుకోసం తను రెండునెలల నుంచీ ఎదురుచూస్తున్నది. అతని రూపం - మాటలు తనని సదా వెన్నంటి పక్కనుండా నిలవనీయకుండా చేశాయని.. ఇంకా ఎన్నెన్నో చెప్పాలని తహతహగా వుంది. రెండ్రోజులు గడిచినా బదరి దూరంగా వుండి ఆమెవంక చూడటం - నవ్వటం తప్ప - దగ్గరకొచ్చి పలకరించలేదు.

విపులకు కోపం వచ్చింది. అతను తనని పలకరించి ప్రతిమాలేదాకా మాట్లాడకూడ దనుకుంది. వరుసగా బదరి రెండ్రోజులు కాలేజీకి రాకపోయేసరికి విపుల బింకం జారిపోయింది. అతనెందుకని రాలేదు! అన్న చింత, అతని లేని కాలేజీ చప్పగా తోచింది.

ఆ సాయంత్రం కిట్టూ ఆమె దగ్గరికొచ్చి - "బదరి మీ కివ్వమన్నాడు!" అంటూ ఓ కాగితం మడత ఇచ్చి వెళ్లాడు. పుస్తకాల్లో దాచుకుని ఇంటికొచ్చాక - వణికే చేతులతో విప్పి చూసింది.

"మిస్ విపులా!

"నా ప్రేమని ఓ కేనాడో తెలియపర్చాను. కాలేజీ తెరిచాక మీ నిర్ణయం తెలియపరుస్తా నన్నారు. ఈ నాలుగు రోజులూ మాట్లాడతారేమో అని ఎదురు చూశాను. మీ మౌనం నన్ను బాధిస్తోంది. ఇక, ఈ సందిగ్ధావస్థని భరించలేను. కాలేజీలో ఎన్నో జతల కళ్లు మనని పరిశీలిస్తాయని మిమ్మల్ని ప్రశ్నించలేదు.

రేపు సాయంత్రం నా రూంకి మీరొస్తే - అన్ని విషయాలు మాట్లాడుకోవచ్చు. రాకపోతే....

ఇదే నా చివరి వీడ్కోలు"

అతనుండే రూం అడ్రస్ వుంది కింద.

మరోసారి ఉత్తరమంతా చదివి ఆలోచనలో పడింది.

*　　　*　　　*

ఎప్పటిదో పాతకాలంనాటి పెంకుటిల్లు అది. ఇరుగ్గా వున్న సందులో రోడ్డుపైకి వున్నది ఆ గది. పెంకుటి వరండా నానుకుని వున్న ఆ గది ఇంటితో సంబంధం లేకుండా వీధివైపు తలుపు. చిన్న అరుగు.

గది తలుపు దగ్గరగా వేసివుంది.

తలుపుమీద చిన్నగా తట్టింది విపుల.

"యస్.... కమిన్"

తలుపుల్ని నెట్టి లోపలికి అడుగుపెట్టింది.

విశాలమైన గది. సందులోకి కిటికీ వుంది. కిటికి దగ్గరగా టేబుల్, కుర్చీ. కుర్చీలో వెనక్కివాలి సిగరెట్ కాలుస్తున్న బదరి విపులను చూసి-చటుక్కున లేచి -

"వెల్‌కం.... మిస్ విపులా!" అన్నాడు.

క్షణంపాటు అతడి కళ్ళల్లో తొంగిచూసిన విస్మయం ఆమె దృష్టి దాటిపోలేదు.

అతను కుర్చీ ఆమె దగ్గరకు జరిపి - తను ఓ ప్రక్కగా ఎత్తి పెట్టివున్న మంచం వాల్చుకుని కూర్చున్నాడు.

"ఇక్కడుంటున్నారా మీరు?" అంది విపుల.

"ఇది కిట్టూ గది.... వాడికి నేను పేయింగ్ గెస్టుని" అన్నాడు నవ్వుతూ.

ఆమె కొంచెం [illegible] ఎర్రబడ్డ కళ్ళతో - నలిగినట్లున్న అతన్ని పరిశీలనగా చూస్తూ -

"[illegible]రేం?" [illegible]డిగింది.

"[illegible] తెలుసు!"

"[illegible] తె[illegible] [illegible]వేదు?"

"[illegible]"

"నేను వస్తానని వూహిం[illegible]చారా?"

"ఊహించాను,.... లేదు!"

"అంటే?"

"అది అంతే!" అని నవ్వాడు.

విపుల ఏదో ఆలోచిస్తున్నట్లుండిపోయింది.

అతనూ మాట్లాడకుండా ఆమెను చూస్తూ కూర్చున్నాడు.

"నా నిర్ణయం ఏమిటని అడగరేం?" అంది కాస్త ఆగి.

"మీ నిర్ణయం నాకు తెలిసింది!"

"తెలిసిందా?"

అవునన్నట్లు చూశాడు.

విపులకు అతను రాసిన ఉత్తరం గుర్తొచ్చి - క్షణం ముఖం ఎర్రబడింది.

"మొత్తానికి.... మీరు తెలివైనవారు!" అంది తలవంచుకుని.

"థాంక్స్. ఈ ప్రశంసాపత్రం కోసమే.... తపస్సు చేస్తున్నాను!"

"మిమ్మల్ని.... నువ్వు అనొచ్చా?"

"మీ ఇష్టం."

అతను లేచి తీసివున్న తలుపుల్ని మూశాడు.

ఆమె కొంచెం బెదురుగా చూడటం గమనించి - "ఇంటివాళ్లు ఇటే తిరుగుతూ వుంటారు. వాళ్ల దృష్టి ఇటు పడటం ఇష్టంలేక.... ఊఁ.... ఏం తీసుకుంటావు విపులా? కాఫీనా, టీనా?" అనడిగాడు.

"ఇప్పుడవేం వొద్దు. నేను వెళ్లిపోవాలి!"

"అప్పుడేనా!.... నా ఆతిథ్యం స్వీకరించవూ?"

అతనన్న తీరుకు నవ్వుతూ- "మీ కెందుకు శ్రమ!" అంది.

"శ్రమేముంది? నాకూ ఇప్పుడు టీ కావాలి." అంటూ స్టౌ వెలిగించాడు.

"కిట్టూ ఏడీ?" అనడిగింది గోడపైవున్న అతని ఫోటో చూసి.

"మళ్ళెళ్లాక వస్తాడు. మనిద్దరి మధ్య.... వుండటం ఎందుకని!" అని నవ్వాడు.

టీ చేసి ఆమెకో కప్పు ఇచ్చి - తను తీసుకుని సిప్ చేయసాగాడు.

"నో.... మీకు టీ కలపటం వచ్చన్నమాట?" అంది తాగుతూ.

"ఎప్పుడైనా.... అవసరార్థం!"

"వంటకూడానా?"

"వంట వచ్చిన మగాడ్ని - స్త్రీ ఇష్టపడదంటారు. అందుకని దాని జోలికి పోలేదు!"

"స్త్రీల గురించి చాలా తెలుసే మీకు?" అంది నవ్వుతూ.

"ఈ దేవత ప్రసన్నంకోసం.. ఎన్నో తెల్సుకోవల్సి వచ్చింది!" అన్నాడు ఆమె కళ్ళల్లోకి గుచ్చి చూస్తూ.

"దేవత ప్రసన్నమైతే చాలా?"

"చాలు. ఇదక్కడ అనే వరాలిచ్చే దేవత మరి!"

కాళీకప్పు కింద పెడుతూ - "మీ మొదటి వరం ఏమిటో?" అంది.

"రోజూ సాయంత్రాలిట్లా కల్సుకోవటం!"

"కాలేజీలో కలుస్తూనే వుంటాంగా!"

"అట్లా కాదు. ప్రైవసీ వుండాలి!"

విపుల మాట్లాడలేదు.

"కోరకూడని వరమా?"

"రోజూ అంటే... కష్టమే మరి!"

"ప్లీజ్ విపులా! ఎట్లాగైనా సరే....ఎక్కడైనా సరే....కాస్సేపు ఒంటరిగా కలుసుకోవటం, మాట్లాడుకోవడటం... నువ్వు తల్చుకుంటే.... సమయం దొరక్కపోదు."

విపుల కాస్సేపు మౌనం. తరువాత - "మన కింకా ఈ సంవత్సరం చదువుంది. చదువు పూర్తయాక ఏదో ఒక ఉద్యోగం దొరకాలి. అప్పటిదాకా ... నలుగురి దృష్టిలో పడటం బాగుండదు" అంది.

"నలుగురు దృష్టిలో పడకుండా పరులకు దూరంగా...."

"అదెట్లా?"

"మనసుంటే మార్గం వుంటుంది!"

"అదేదో.... మీరే చెప్పండి."

"నన్ను నువ్వు అను. అట్లా పిలుపించుకోవటమే ఇష్టం."

"సరే!"

"ప్రతి రోజూ సాయంత్రం కాలేజీ అవగానే ఈ రూంకి వచ్చేద్దాం."

"ఇక్కడా? ఇంటివాళ్లు ఏం అనుకుంటారు? కిట్టూకూడా ఏదైనా అనుకో వచ్చు."

"వాళ్ల సంగతి నాకొదిలెయ్ నీ సంగతి చెప్పు!"

"రోజూ అంటే ఎట్లా కుదురుతుంది? పోనీ ప్రతి ఆదివారం కలుసుకుందాం. ఈ రూమ్‌లో కాదు. వేరే ఎక్కడైనా!"

బదరీ కాస్సేపు ఆలోచించి—

"సరే!... ఆదివారం – ఆదివారం కలవాలి. మాట తప్పకూడదు. ఎక్కడో.... ఎప్పుడో.... నేనే నీకు చెప్తాను!"

"సరే!"

"థ్యాంక్స్ విపులా!...."

"ఇంక నే వెళ్ళిరానా?"

"అప్పుడేనా?"

"ఇంటిదగ్గర అమ్మ ఎదురుచూస్తూంటుంది. కాలేజీ వదిలాక నేరుగా ఇంటికెళ్ళే అలవాటు నాకు!"

"ఏదో ఒకటి చెప్పేద్దూ!"

"అబద్ధాలా"

"నా కోసం!"

"నీ కోసమైనా అబద్ధాలాడటం నా కిష్టం వుండదు."

అతని ముఖం వెల్లబడింది.

"ఆల్‌రైట్....నీ కెలా తోస్తే అలా చెప్పు!" అన్నాడు.

బయట అడుగుల చప్పుడైంది.

"వస్తానింక. కిట్టూ వచ్చినట్లున్నాడు!" అని లేచింది.

* * *

"విపూ!"

"ఊఁ."

"ఇది కలా – నిజమా అన్పిస్తోంది!"

"కవికి నిజంకంటే – కలే బావుంటుందేమో!"

"కొంత ఊహ – కొంత నిజం బావుంటుంది."

"ఊఁ అయితే.... ఇప్పుడు నా మీద ఓ కవిత చెప్పు చూద్దాం!"

బదరి తనకు కాస్త ఎండలో కూర్చున్న విపులకేసి దీక్షగా చూచాడు. విశాలమైన కళ్ళు, చక్కటి ముక్కు, లేత గులాబీరంగు చెక్కిళ్ళు. లేత ఎరుపు పెదాలు.... తలంటుకున్న కెరటాలలాంటి జుట్టు, లేత పీలం చీరె, జాకెట్టు. పసిమిఛాయ. 'నిజంగా విపుల ఎంతో అందమైనది!' అనుకున్నాడు.

“ఏమిటట్లా చూస్తున్నావు?” అంది,

“ఏం లేదు. కవిత చెప్పమన్నావుగా ఆలోచిస్తున్నాను.”

“అంతేనా? లేక మరో బొమ్మ గీయటానికి – మనసులో రేఖాచిత్రం గీసుకుంటున్నావా?” అంది నవ్వుతూ.

“ఈసారి బొమ్మగీయ తల్చుకుంటే – నిన్ను మోడల్‌గా ఎదురుగా వుంచుకునే గీస్తాను.”

“బొమ్మ సరే. కవిత సంగతేమిటి?”

“వుండు మరి. నన్ను ఆలోచించనీయి?” మళ్లీ విపుల వంటికేసి చూశాడు. ఎదురుగా వున్న సముద్రంకేసి చూశాడు. ఎండపడి మెరుస్తున్న ఇసుకవైపు చూశాడు. నింగి – నీళ్లూ కలిసిన నీలిమవైపు చూశాడు.

“ఊఁహుం.... నా మనసు మూగపోయింది. ఏ భావన రావటం లేదు.” అన్నాడు.

“ఎందుకని?”

“నువ్వు నాకు దూరం వుండటంవల్ల కావొచ్చు!”

“దూరంగా వున్నానా? నీ ఎదుటే వున్నాగా?”

“ఈ దగ్గర చాలదు!”

“అంటే?”

“ఇంతేనా?” అంటూ చటుక్కున ఆమె ముఖంమీదికి వంగాడు.

విపుల ముఖాన్ని వెనక్కి తీసుకునేలోగా, రెండు చేతులతో అదిమిపట్టి ముద్దుపెట్టుకున్నాడు.

“ఏమిటిది? ఇలా అయితే మనం కలుసుకోవటం కుదరదు!” అంది కాస్త కోపంగా.

“కవిత కావాలన్నావుగా? ఏ అనుభూతి, స్పందనా లేనిది ఎట్లా వస్తుందనుకున్నావు?”

విపుల తల వంచుకుంది – మాట్లాడకుండా.

“కోపమా?.... ఇదిగో.... ఇప్పుడు విను.... “నీ అరుణాధర అమృతం తాకి.... అమరుడనైతి.... ఈ నింగీ–నేలా సాక్షి.

“ఛీ....” అంది కాస్త దూరంగా జరుగుతూ.

పైకి అట్లా అన్నదేగానీ–విపుల మనసు పులకించింది. ఏదో మధురమైన వేణువు వింటున్నంత మైమరపు.




తను కూడా విషలకు దగ్గరగా జరిగి – ఆమె చెయ్యి నందుకుని – వేళ్ళని నిమురుస్తూ – "విషూ! గోళ్ళెందుకు పెంచుతున్నావు?" అనడిగాడు.

"రక్షణకు!" అంది నవ్వుతూ.

చటుక్కున చెయ్యి వదిలేసి "ఎవర్ని?" అన్నాడు.

"సమాజంలో రకరకాల మనుషుల మధ్య తిరిగేటప్పుడు – అత్యవసర పరిస్థితిలో – ఆత్మ సంరక్షణకోసం – కొన్ని వుపాయాలు ఆడపిల్ల నేర్చుకుని వుండటం మంచిదట! అందులో ఇదొక ఆయుధం!"

"ఎవరన్నారు?"

"మా అమ్మ!"

"మీ అమ్మగారు ఇలాంటి సలహా లిస్తారా?"

"జీవితంలో ఆమె పడ్డ బాధలు, కష్టాలనుంచి – నేర్చుకున్న అనుభవం ఇట్లాంటి జాగ్రత్తల్ని నేర్పమంటోంది మరి!"

"సో ... మీ అమ్మగారి వెనక ఏదో 'గతం' వుందన్నమాట!"

"బాధాకరం! చెప్పనా?"

"ఇప్పుడొద్దులే!... మన మూడ్ చెడిపోతుందేమో!... అయినా విషూ! నీ గోళ్ళు ఇంత పొడుగ్గా... పెంచుకోవటం నాకేం బాగాలేదు!"

"నాకు బావుంది.... నా గోళ్లు.... నా ఇష్టం!" అంది పెంకిగా.

"ప్లీజ్ విభూ! వాటిని చూస్తుంటే పులిగోళ్లు.... రక్తం మరకలు.... మనిషి కళేబరం గుర్తొస్తున్నాయి. నాలోని అందమైన భావాల్ని హత్య చేస్తున్నాయి!"

"ఇవాళ కొత్తగా పెంచలేదే! నీతో పరిచయం అయినప్పుడే వున్నాయిగా!"

"నీ ముఖాన్ని — దాని వెనక నీ మనసుని చూశానిన్నాళ్లూ."

"గోళ్లను చూడలేదంటావు!" అంటూ పకపక నవ్వింది.

"ఇప్పుడూ ఆ మనసునే చూస్తే సరిపోతుందిగా!" అంది.

"ఇంత దగ్గరగా వున్నప్పుడు.... కనీసం నీ చెయ్యికూడా తాకటానికి లేకుండా.... ప్లీజ్ విభూ! గోళ్లను తీసెయ్యమ్మా!"

"చూద్దాం!"

"విభూ!"

"మళ్లీ ఏవిఁటీ!"

"ఒక్కసారి నీ ఒడిలో తలపెట్టుకుని.... పడుకోనీయవూ!"

"కోరికలు పెరిగిపోతున్నాయి. ఇంక వెళ్లిపోదాం బాబూ!"

"వాడెవడు!" అంటూ చుట్టూ చూశాడు.

"వచ్చుణోకు!" అంది ముఖం చిట్లించి.

బదరి కోపంగా చూసి ముఖం తిప్పుకున్నాడు.

రెండుక్షణాలాగి — "కోపం వచ్చిందా!" అనడిగింది.

అతను పలుకలేదు.

"నవ్వు రాకపోయినా నవ్వాలి కాబోలు!" అంది అలుకగా.

అతను అప్పటికీ మాట్లాడకపోయేసరికి – "సారీ బదరీ! ఇంత నొచ్చుకుంటావనుకోలేదు!" అంది.

అతనట్లాగే బిగుసుకుని కూర్చున్నాడు.

"సరే.... నేను మూడు అంకెలు పలికేలోగా-నువ్వు మాట్లాడకపోతే.... నా ఒళ్లో తలపెట్టి పడుకొనే ఛాన్సు పోగొట్టుకుంటావు. ఒకటి...."

చటుక్కున చూసి - నవ్వి- "థాంక్స్....విభూ!" అంటూ ఆమె ఒడిలో తలవాల్చి వెల్లికిలా పడుకున్నాడు!

• • •

విపుల భుజంచుట్టూ చెయ్యివేసి — సగం ఆమెమీదికి వాలి "ఈ ఏడు రోజుల నుండీ.... ఎంత కఠినమైన తపస్సో...." అన్నాడు బదరి.

"సరిగ్గా కూర్చో బదరీ! ఇది గుడి. ఎవరైనా చూస్తే బావుండదు!" అంది విపుల.

"పొద్దుటిపూట దేవుడు ఎవరికి గుర్తొస్తాడు లెద్దూ. వండుకోటం, తినటం అలో పడి కొట్టుకు ఛస్తుంటారు — పాపపు జీవులు!"

"పాపం వాళ్ళకు ప్రేమ తినటం చాతకాదు మరి!" అంది నవ్వి.

"కరెక్ట్." అంటూ ఆమెచెయ్యి తన చెంపకద్దుకుంటూ — "గుడ్ గర్ల్" అని మెచ్చుకున్నాడు.

"ఎందుకట?"

"గోళ్ళు తీసేశావుగా!"

".... నీ కోసం .... ఎంతో ప్రాణంగా పెంచుకున్నాను." అంది దిగులుగా.

"వెధవగోళ్ళు. పోనిద్దూ."

చటుక్కున చెయ్యిలాక్కుని — "నావేం వెధవగోళ్ళు కాదు ...." అంది కోపంగా.

"సారీ.... వెరీసారీ. మా విపులగోళ్ళు బంగారువి."

"ఏం పొగడ నక్కర్లేదు!"

"పొగిడినా తప్పేనా!"

"పొగిడేవాళ్ళెప్పుడూ ఎదుటివాళ్ళని బోల్తాకొట్టించాలని చూస్తుంటారు!"

"నిన్ను బోల్తా కొట్టిస్తే — నాకేం వొరుగుతుందంటావు!"

"ఏమో....ఏం ఆశిస్తున్నావో....నాకేం తెలుస్తుంది!" అంది ఓరగా చూస్తూ.

"అన్నీ తెలుసు నీకు. నటించకు." అన్నాడు చెంపను ముద్దు పెట్టుకుంటూ.

"ఇది మరీ బావుంది...." ఇంకా ఏదో అనబోయింది.

"నిజంగానా!" అంటూ మళ్లీ ముద్దుపెట్టుకోబోయాడు.

"ఛ.... ఏమిటిది బదరీ! ఎవరైనా చూస్తే బావుండదు. సరిగ్గా కూర్చో" అంది దూరంగా జరుగుతూ.

"ప్రేమికులన్న తర్వాత.... ఇట్లాంటివి సర్వసాధారణం. నేనేదో తప్పు చేస్తున్నట్లు.... వూరికే పిలవకు."

"నా కిట్లాంటివి ఇష్టం వుండవు బదరీ!...."

"ఎట్లాంటివి!" అన్నాడు చిలిపిగా చూస్తూ.

"పద.... టైం పదకొండున్నరయింది. అమ్మ నాకోసం చూస్తుంటుంది." అంటూ మాట మార్చివేస్తూ.

తప్పనిసరిగా అతనూ లేచాడు.

* * *

"ఏయ్ విపూ! విన్నే!"

"ఊఁ...."

"ఏవిఁటంత పరధ్యానం?"

"నీ గురించే!"

"నీ ప్రక్కనే వున్నాగా!"

"అందుకే! ఈ థియేటర్లో ఎవరైనా తెలిసినవాళ్లు మనల్ని చూస్తే?"

"ముచ్చటపడ్తారు!"

"మనం ఇట్లా.... తిరగటం...."

"అబ్బ విపూ! నువ్వు నిజంగా ఎంతో పిరికిదానివి! ఒకసారి చుట్టూ చూడు. మనలాంటివాళ్ళు ఎంతోమంది వున్నారు వీళ్ళల్లో. జీవితంలో ఇట్లాంటి అనుభవాలు పోగొట్టుకుంటే మళ్ళీ రమ్మన్నా రావు!" అన్నాడు నచ్చచెప్తున్నట్టు.

విపుల వూరుకుంది.

సినిమా మొదలైంది.

'మన్మథలీలలు' ఇదివరకోసారి చూసింది విపుల. మళ్ళీ తన అభిమాన నటుడు కమల్‌హాసన్‌కోసం బదరీ రమ్మనగానే ఒప్పుకుంది. మార్నింగ్‌షో అయినా హౌస్‌ఫుల్ అయింది.

ఎంతో ఇంటరెస్టుగా సినిమా చూస్తున్న విపుల – బదరి తనకు మరింత దగ్గరగా జరగటం, భుజంచుట్టూ చెయ్యివేయటం తెలుస్తున్నా – ఆ చీకట్లో.... చూస్తున్న సినిమా ప్రభావం .... మనసుని మత్తుగాచేసి ఆదోరకం అనుభూతిని కలిగించగా వూరుకుంది.

ఇంటర్వెల్‌లో బదరి బయటకు వెళ్ళాడు.

కుర్చీలో ఒదిగి కూర్చుని – ఏదో ఆలోచిస్తున్న విపులకు తను కూర్చున్న వరుసకు రెండు వరుసలు ముందువరుసలో వెనక్కి తిరిగి తనవంకే చూస్తున్న ఓ ముఖం పరిచితంగా తోచింది. అతను.... వరలక్ష్మి అన్నయ్య .... ప్రక్కన

ఎవరో ఫ్రెండ్స్ కూడా వున్నట్టున్నాడు। విపుల గుండె ఆగి కొట్టుకోవటం ప్రారంభించింది. 'అతను తనని గుర్తుపట్టి వుంటాడా? .... గుర్తుపడితే.... వర లక్ష్మిని తనను గురించి ప్రశ్నిస్తాడేమో। వరలక్ష్మి చెప్పేస్తుందా?.... ఛ, వరం అట్లాంటిది కాదు.' అనుకుంది.

'ఒకవేళ వరం చెప్తేమాత్రం ఏమైంది? ఎందుకిట్లా భయపడుతోంది తను? ప్రేమించటం నేరం, పాపం కాదుగదా। ఇప్పుడు కాకపోయినా — ఈ ఏడాది గడిచాక అయినా – బదరీని తను పెళ్ళిచేసుకుంటుంది. అప్పుడైనా అందరికీ తెలియాల్సిందేగా? కానీ.... ఈ ఏడాదికాలం తమ ప్రేమ రహస్యంగానే వుంటే బాగుంటుంది.... చదువు సవ్యంగా సాగుతుంది. మరే ఇతర సమస్యలు తలెత్తకూడదనుకుంటే....'

బదరీ కూల్‌డ్రింక్స్ తీసుకొచ్చాడు.

విపుల కళ్లు మళ్ళీ ముందువరుసలోకి ఆ 'ముఖం' కోసం చూశాయి. కన్పించలేదు. అన్యమనస్కంగానే కూల్‌డ్రింక్ తాగింది.

మళ్ళీ సినిమా మొదలైంది.

బదరీ చెయ్యి ఆమె భుజాన్ని చుట్టబోయింది.

వారిస్తూ— "ప్లీజ్" అంది విపుల.

పదినిమిషాలాగి మళ్ళీ చెయ్యివేసి ఆమె చెంపలు పెదవులతో స్పృశిం చాడు.

విపులకు కోపం—చిరాకు కలిగాయి.

చటుక్కున లేచి— "వెళ్ళిపోదాం!" అంది.

తెల్లబోయాడు బదిరి. "కూర్చో. సినిమా అయాక వెళదాం!" అన్నాడు మెల్లగా.

"వెళ్ళిపోదాం." అంది మళ్ళీ.

"కూర్చో విపూ...." అన్నాడు ప్రతిమాలుతూ.

"నువ్వు వస్తావా? నేను వెళ్ళిపోనా?" అంది కఠినంగా.

అతనికి కోపం వచ్చింది. విసురుగా లేచాడు. ఇద్దరూ బైటకొచ్చారు. రిక్షా మాట్లాడి ఆమె కూర్చున్నాక 'వస్తా' అనైనా చెప్పకుండా వెళ్ళిపోయాడు బదరి.

## 5

నాలుగు వారాలు గడిచినయ్.

ఈ నాలుగువారాలు బదరి విపులను కన్నెత్తి అయినా చూడలేదు. ఎప్పట్లా తనని ఫలానాచోట కలుసుకోమని అడగలేదు. విపుల ఎవరో తెలీనివ్యక్తిలా ప్రవర్తించసాగాడు. విపుల కది సహింపరానిదిగా వుంది. ఏదో తప్పుచేసినట్లు బెంగగా వుంది. వెలితిగా వుంది.

కాలేజీలో మామూలు పరిచితుల్లాగా వుండాలని, ప్రేమ అన్నది మనసులో వుండే చాలని ఇన్నాళ్ళూ తనని తాను నమ్మించుకుంది. బదరీని కూడా నమ్మిం చాలని చూసింది. తీరా అతను కన్నెత్తి అయినా చూడక— మౌనం వహించట ం బాధనీ, దుఃఖాన్నీ కల్గిస్తోంది.

ఆ రోజు సినిమానించి అట్లా వచ్చివుండాల్సింది కాదని తనని తాను తిట్టుకుంది.

'అతనన్నట్లు తను పిరిగ్గొడ్డు. ప్రతిదానికీ భయం.... భయం - బ్రతుకే భయంగా తల్చుకుని వణికిపోవడం తప్ప.... అనుభూతుల్ని పొందటం చేతకాదు. తనని గాఢంగా ప్రేమించి— తన మాటకోసం — చూపుకోసం తహతహలాడే బదరిని నొప్పించింది తన ప్రవర్తనకు క్షమాపణ చెప్పుకోవాలి,' అనుకుంది.

ఆమె పశ్చాత్తాపం అతనికి తెలుపాలనుకునేంతలో అతను కాలేజీలో కన పడటం మానేశాడు. రెండురోజులు చూసి ఇక ఆగలేక కిట్టూని అడిగింది.

"బదరీ రావటంలేదేం?"

"జ్వరం."

"ఎప్పట్నించి?" అడిగింది ఆదుర్దాగా.

"మొన్నటినుంచి."

"ఎట్లావున్నాడు?"

"మీరు చూడాలనుకుంటున్నారా?"

"అవును."

ఆ సాయంత్రం కాలేజీ అవగానే కిట్టూ రూంకెళ్ళింది విపుల. గది అంతా చీకటిగా వుంది. లైటు వేసింది. మంచంమీద ముసుగుపెట్టుకుని వున్నాడు బదరి. వీధివైపున్న తలుపు మూసి— కిటికీ రెక్కలు తెరిచింది. అతని మంచందగ్గరకు కుర్చీ లాక్కుని కూర్చుంది.

"బదరీ!" నెమ్మదిగా పిల్చింది.

అతను బదులు పలక్కపోవటంతో దుప్పటి పక్కకు లాగింది. అప్పుడే నిద్రలోంచి లేచినట్లు కళ్ళు చిట్లించి చూస్తూ— "ఎవరు? ఓ నువ్వా." అన్నాడు




"ఎట్లా వుంది వంట్లో?" అంటూ అతని నుదుటిమీద చెయ్యి వేసింది. చల్లగా తాకింది. అతని వళ్ళంతా చెమటతో ముద్దగా వుంది.

దుప్పటి పూర్తిగా తీసివేస్తూ — "జ్వరం జారినట్లుంది. చమటలు పోస్తు న్నాయి" అంది విపుల.

"ఎందుకొచ్చావు? వెళ్ళిపో. ఎవరైనా చూస్తే బాగుండదు." అన్నాడు ముఖం చిట్లించి.

"కోపం పోలేదన్నమాట! అరోజు అట్లా చేయటం తప్పే—క్షమించు!" అంది.

"నా క్షమతో—ప్రేమతో నీకేం సంబంధం? వెళ్ళిపో విపూ!"

"నువ్వెన్నిసార్లు పొమ్మన్నా మరో గంటదాకా కదలను." అంది నవ్వుతూ.

"నన్ను చూస్తే నీకు నవ్వుగా వుంది కదూ?" అన్నాడు కోపంగా.

"అదేం లేదు." అంది నవ్వు ఆపి.

"ప్రేమించిన వాళ్ళకే ప్రేమ విలువ తెలుస్తుందంటారు. నా తపనను ఆవేదనను నువ్వు అర్థంచేసుకోలేదంటే.... నువ్వు నన్ను ప్రేమించటంలేదేమో అన్పిస్తోంది. నీ మనసు పూర్తిగా తెలుసుకోక గుడ్డిగా ప్రవర్తించాను. సారీ విపులా! వెళ్ళిపో. నా ఖర్మానికి నన్నిట్లా వదిలెయ్." నుదురు వత్తుకుంటూ అశాంతిని సూచిస్తూ కళ్ళు మూసుకున్నాడు.

అతని మాటలకు విపుల మనసు విలవిలలాడింది. నేత్రాలు సజలం మయ్యాయి. అప్రయత్నంగా లేచి మంచంమీద అతనికి చేరువగా కూర్చుని - నుదుటిమీద చెయ్యివేసి అతన్ని నిమురుతూ -

"అట్లా అనకు బదరీ! నువ్వు అక్కర్లేదని - నిన్ను కాదనుకునే దాన్నయితే ఇట్లా వస్తానా?.... ఇకనుంచీ నీ ఇష్టమే నా యిష్టం!" అంది మృదువుగా.

"నిజంగా?"

"ప్రామిస్."

నుదుటిమీద వున్న ఆమె చెయ్యి తీసి తనమీదకు లాక్కున్నాడు. అతని ఛాతీమీదకు వొరిగిపోయిన విపుల ప్రతిఘటించలేదు. ఆమె ముఖాన్ని పైకెత్తి ముద్దుపెట్టుకున్నాడు. ఆమెను చేతులతో చుట్టేస్తూ - తనకు మరింత దగ్గరగా అదుముకున్నాడు.ఏదో మధురమైన స్వప్నంలో వున్నట్లు తనమతాను మరిచి అతని ఎదపై విశ్రమించిన విపుల- అతను మరింత చనువు తీసుకోబోవటంతో ఉలిక్కి పడింది. అతని చేతుల్ని తోసివేసి లేవబోయింది. ఆమె పమిటచెంగు దొరక పుచ్చుకుని ఆపాడతను. అతని కళ్ళల్లోకి చూసి - ప్రశ్నిస్తున్న ఆ కళ్ళవంక చూడలేనట్టు ముఖం తిప్పుకుని - "వదులు!" అంది.

"వదలను. ఇప్పుడేగా మాట ఇచ్చావు!"

"అందుకని.... ఇట్లాగా ప్రవర్తించటం?"

"నిజమే! నీతో ప్రవర్తించే తీరు ఇదికాదు!" అంటూ తమకంతో చూస్తూ తనవైపు ఒక్కసారి గుంజాడు.

"ప్లీజ్ బదరీ....ఆవేశంలో నువ్వేంచేస్తున్నావో తెలుస్తోందా?" అప్పటికే విపులచీరె సగంవూడి అతని చేతుల్లో వుంది.

"ఆవేశం ఈ వయసుకుండే లక్షణమేగా!"

"అందుకని వివేకాన్ని కోల్పోతావా?"

"గొడవ చెయ్యకు విపులా! ఇట్లా రా. ఇంతలో ఏం కాదు" విపులకు కోపం తీవ్రమైంది. అర్థంగాని భయం పెనవేసుకుంది.

"ఇది తగని పని. జ్వరం పడ్డావని చూసిపోదామని వస్తే.... ఇదేనా మర్యాద? ఇట్లా అయితే జన్మలో నీ ముఖం చూడను!" అంది తీవ్రంగా.

"నా ముఖం చూడవా! సరే.... ఇదిగో.... నీ చీరెతో.... నీ ఎదుటే వురివిగించుకుని ప్రాణత్యాగం చేస్తాను. నువ్వు కాదన్నాక నేను బ్రతికుండి

లాభం ఏమిటి?" అంటూ ఆమె చీరతో మెడచుట్టూ బిగించుకుని - గట్టిగా వొత్తుకోసాగాడు.

ఆ దృశ్యం చూసి మతిపోయినంత పనయింది విపులకు.

భయమో - ప్రేమో అర్థంగాని భావంతో అతనికి చేరువై -

"బదరీ.... ఒద్దు. ఆగు." అంటూ అతని చేతుల్లోంచి బలవంతంగా చీరె తీసుకుని దూరంగా విసిరేసి అతన్ని అల్లుకుపోయింది. "నా కోసం.... నీ ప్రాణాన్ని త్యాగం చేస్తావా?" అంది ప్రేమతో - కరుణతో. ఆమెను హృదని పట్టుకుని విజయసూచకంగా నవ్వుతున్నాడు బదరి.

* * *

ఆ తర్వాత కిట్టూ రూంకి చాలాసార్లు వెళ్ళింది.

వరలక్ష్మి అందో రోజు. "విపులా! నిన్ను చూస్తుంటే నాకు భయ మేస్తోందే!"

"ఎందుకు?"

"నువ్వు చాలా మారిపోతున్నావు. బదరీతో అంత చనువుగా వుండటం..."

"ఒకప్పుడు అతనితో నా ప్రేమని నువ్వేకదే ప్రోత్సహించావు? అప్పు డేమయినయ్ ఈ నీతులు?"

"ప్రేమద్వేషిని కానే నేను. ప్రేమ కావాలి. కానీ....ఇట్లా హద్దులు మీరటం కాదు!"

"ప్రేమకి హద్దులేమిటి పిచ్చిదానా? నువ్వు ప్రేమించి అందులోని లోతుల్ని తరచిచూచాక అప్పుడు మాట్లాడు, వింటాను!"

"ప్రతిదీ అనుభవిస్తేనేనా తెల్సేది? ఇతరుల అనుభవాల్లోంచి తెలుసుకో కూడదా?"

"ఎందుకు కూడదు? నా అనుభవంలోంచి ఏం తెల్సుకున్నావని హెచ్చ రిస్తున్నావు?"

"నువ్వు చదువుని అశ్రద్ధ చేస్తున్నావు. కాలేజీకి సరిగ్గా రావటంలేదు. మీ గురించి అంతా ఏమనుకుంటున్నారో తెలుసా?"

"ఏమనుకుంటే నా కెందుకు? నేను తప్పుచేస్తున్నాననే భావం నాకు లేదు. బదరీ-నేను పెళ్ళి చేసుకున్నాక - వీళ్ళంతా ఏం చేస్తారో?"

"పెళ్ళి చేసుకుంటే మంచిదే. అట్లా జరగాలనే నా కోరిక. అందుకని....

నువ్విట్లా కిట్టూ గదికి వెళ్ళటం.... మీ ఇద్దరిమధ్య ప్రేమతప్ప ఇంకేమీ లేదని అనుకోమంటావా?"

విపుల కొంచెం ఆగి అంది. "నువ్వు పూహిస్తున్నది నిజమే వరం. బదరీని కాదనలేను. అది నా బలహీనతేమో?.... ఈ అర్నెల్లు గడిస్తే మా పెళ్ళి జరుగుతుంది.... ఆ నమ్మకం వుంది అతనిమీద.... 'ఆడదాని జీవితం ఆరిటాకు లాంటిదని' సామెతల్ని-పితుర్ని గుర్తుచేసి నాలో పిరికిమందు పోయకు?" అంది.

వరలక్ష్మి మరి మాట్లాడలేదు.

పైకి వరలక్ష్మితో అట్లా వాదించినా - తను లోకవిరుద్ధంగా ప్రవర్తిస్తున్నదేమో అన్న అనుమానం మొదలైంది విపులలో.

'ఒకవేళ.... తమ ప్రేమకు ఏదైనా విఘ్నం వాటిల్లితే?' అన్న భయం కూడా కలిగింది. 'బదరీ మోసం చేస్తాడా?' అన్న భావం మెదిలి వణికిపోసాగింది.

'అతను మోసం చేస్తాడేమో-' అన్న భయం ఎందుకు ఇట్లా అంతరాంతరాల్లో తారట్లాడుతోంది? తను స్త్రీగా జన్మించటం వల్లనా? శీలం అర్పించటం తొందరపాటు అన్న భావన తనలో నిలిచివుండటం వల్లనా? తన తల్లి ఇచ్చిన స్వేచ్ఛను దుర్వినియోగం చేసుకోలేదు కదా.... అన్న అనుమానంవల్లనా? ఈ భయాలు - ఇట్లాంటి భావాల్తో - ఆధునిక స్త్రీనని - చదువు - విజ్ఞానం వున్న వివేకవంతురాలిననీ విర్రవీగే తను ఎందులో ఎక్కువ? సనాతన స్త్రీ కంటే ఎందులో ఉన్నతం?'

ఈ ఆత్మవిమర్శవల్ల భయాన్ని జయించకల్గింది విపుల.

బదిరిని కలవటం తగ్గించి - క్లాసులో పాఠాలపై శ్రద్ధ పెంచి చదువుకోవటంలో పడింది.

అప్పుడప్పుడే చదువుపై ఏకాగ్రత కుదిరి.... ఓ క్రమంలో పడిన విపుల జీవితం అనుకోని మలుపు తిరిగింది.

రెండునెలలు దాటినా రాని పీరియడ్-బ్రతుకును ముళ్ళకంపచేసి సమస్యగా నిలిచింది.

ఇన్నాళ్లూ అంతర్గతంగా దాగి.... వెవక్కి లాగిన భయానికి రూపం ఏర్పడబోతోంది.

చదువా - పెళ్లా? ఏదో ఒకటి తేల్చుకోవాల్సిన సమయం వచ్చింది.

ఇట్లాంటి అవాంతరం రాకూడదని తీసుకున్న జాగ్రత్తకి సృష్టి వెక్కిరించి నట్లయింది.

విపుల కిది చాలా షాక్. రెండ్రోజులుండాకా మామూలు మనిషి కాలేక పోయింది.

ఆ రోజు సాయంత్రం బదరీ రూంకెళ్ళింది.

ఏ కబురూ - పిలుపూ లేకుండానే వచ్చిన విపులను చూసి కన్నుగీటుతూ-"ఏవిటింత దయపుట్టుకొచ్చింది నామీద?" అన్నాడు బదరి.

"నీతో మాట్లాడాలి."

"కేవలం మాటలేనా?" అన్నాడు నడుంచుట్టూ చెయ్యివేసి.

"బదరీ! 'పిల్లికి చెలగాటం' అంటారే? అదేమిటో ఇప్పుడర్థమౌతోంది నాకు." అంది గంభీరంగా.

"ఇవాళ కొత్తగా అర్థాలు వెతుక్కోవల్సిన అవసరం ఏమొచ్చింది?"

"అది చెప్పాలనే వచ్చాను."

ఆమెని వదిలి కుర్చీలో కూర్చున్నాడు. విపుల కూడా కూర్చున్నాక సిగరెట్ వెలిగించి దమ్ములాగి వదులుతూ - "చెప్పు!" అన్నాడు. విపుల ఆలోచిస్తోంది - ఎట్లా చెప్పాలా అని!

"ఏమైంది?" అడిగాడు మళ్ళీ.

"పాత కథే.... స్త్రీ హద్దుదాటి - మగాడికి లొంగిపోతే ఏం జరుగుతుందో.... అదే!"

"అంటే....?" అర్థోక్తిగా చూశాడు.

రెండు నిమిషాలు ఆగి...."అనలెట్లా జరిగింది ఇది! ఎక్కడో పొరపాటు జరిగిందా!.... దీనికింత మూడ్ పాడుచేసుకోవాలా!" అన్నాడు.

"నేను దీన్ని సంతోషించే విషయంగా తీసుకోలేను!"

"నువ్వింత.... పిరికిగా...."

"నా పరిస్థితిలో వున్న మరో ఆడది ఇంతకంటే ధైర్యంగా వుంటుందనుకోను!" అంది వదునుగా.

"కోపమా!"

"కాదు.... బాధ."

"అనవసరం!"

తలెత్తి అతని ముఖంలోకి లోతుగా చూస్తూ -

"ఏమిటి నీ ఉద్దేశం?" అనడిగింది.

"ఇంత చిన్న విషయాన్ని నాదాకా తీసుకురావడం.... నీ తెలితనాన్ని చూపుతోంది. నా దగ్గరకు వచ్చేబదులు డాక్టర్ని కన్సల్టుచేస్తే సరిపోయేదిగా।"

సిగరెట్ పొగ రింగులుగా వదులుతూ—కుర్చీ వెనక్కి వాలి అతనంటున్న తీరులో - ఏదో నిర్లక్ష్యం తోచి.... మనసు బగ్గుమంది విపులకు. "ఆ మాత్రం ఆలోచన నాకు రాలేదనుకోకు. నా పరిస్థితికి కారణమైన నీతో చెప్పటం బాధ్యతగా తలచాను।" అంది వాడిగా.

"టేకిట్ ఈజీ.... విపులా। ఎందుకంత ఆవేశం? మంచినీళ్లు కావాలా?"

"వద్దు."

"పోనీ కాఫీ అయినా.... టీ అయినా....?"

"నో థాంక్స్."

అతను కూజాలోని నీళ్లు గ్లాసులో వంపుకుని - నిదానంగా తాగుతూ —

"ఈ పరిస్థితికి కారణం.... నువ్వుకూడానేమో। ఆలోచించు విపులా।" అన్నాడు.

అతనివంక ఆశ్చర్యంగా చూసింది. అతనికి చీమకుట్టినట్టు కూడా అనిపించక — తాపీగా తప్పొప్పుల బేరీజు వేస్తున్నందుకు అసహనంగా వుంది. ఏదో భయం వెన్నులోంచి జరజరా పాకింది.

"బదరీ।"

"ఔను. ఆడదాని సహకారంలేంది - మగవాడేం చేయలేడు. నువ్వు ఇష్టపడి— నన్ను కోరుకుని నాతో సహకరించావు. అయినా.... ఈ ప్రమాదం జరక్కుండదని జాగ్రత్తకూడా తీసుకున్నాం కదూ?"

"అంటే?" అయోమయంగా చూసింది.

"అర్థంచేసుకోగల తెలివివుంది నీకు."

ఆమె కొయ్యబారిపోయింది.

అతను సిగరెట్ వెంట సిగరెట్ తగలేస్తూ పచార్లు చేస్తున్నాడు.

కిట్టూ రెండుసార్లు గదిలోకి తొంగిచూసి మళ్ళీ వెళ్ళిపోయాడు. విపుల తేరుకుని - "ఇదే నీ సమాధానమా?" అంది.

"జీవితాన్ని ప్రమోదంగా తప్ప—ప్రమాదంగా ఎప్పుడూ తలచనివాడ్ని. నీ ఈ భారాన్ని దించేశాక.... మళ్ళీ కనపడు.... ఎంజాయ్ చేద్దాం." వన్నాడు.

అతన్లోని భయంకరమైన మనిషిని అప్పుడే చూసింది విపుల.




“బదరీ.... నువ్వు.... నువ్వేనా?” అంది విభ్రమంగా.

“నేనే. ఎందుకా అనుమానం?”

“నువ్వు ఆ బదరీవి కావు.”

“అది నీ భ్రమ.”

“ఏది భ్రమ? గతమా?”

“గతం నాస్తి అన్నారు. దాన్నెందుకు తలవటం? ఇప్పటి సంగతి చూడు.”

“చూస్తూనే వున్నాను.... నీలోని విశ్వరూపం ఇప్పుడే చూస్తున్నాను. ఇన్నాళ్లూ.... నువ్వు చెప్పిన మాటలు.... మనం కన్న కలలూ.... అన్నీ....”

“కలలని నువ్వే అంటున్నావుగా!”

అతని ఒక్కో సమాధానం ఒక్కో పిడుగు తన నెత్తిన కూలుతున్నట్టు విపుల కనిపిస్తోంది.

బదరీవైపు పరిశీలనగా చూసింది. గతమంతా గిర్రున తిరిగింది. ‘తనని ఎంత తెలివిగా తనవైపు ఆకర్షించుకుని.... ఆటబొమ్మగా మార్చి.... ఎట్లా ఆడించాడు!

అయ్యో! ఎంత మోసపోయింది తను!

ఎంతో తెలివిగా - జాగ్రత్తగా అడుగువేస్తున్నాననుకుంటూనే - ఊబిలో కాలువేసింది.

ఈ మనిషినా - తను ప్రేమించింది?

ఈ మేకవన్నె పులినా నమ్మి మనసిచ్చింది?

ఈ రాక్షసుడికా - తన శీలాన్ని అర్పించింది. ఎంత అపాత్రదానం- ఎంత అవివేకమైన పని!!

ఎంతగా నమ్మించాడు!.... స్టెప్ బై స్టెప్‌గా ప్లాన్ చేసి- తెలివిగా ట్రాప్ చేశాడు!

ఓ ఆడపిల్లకోసం ఇంత పకడ్బందీగా....నటిస్తూ.... ఓహ్! అది నటనని ఎట్లా అనుకోగలదు?

అది నటనే అయితే.... నిజమైన ప్రేమ ఎటువంటిది? ఆ గది విప్పుల గుండంగా - ఆ మనిషి విషపు భాండంగా తోచింది. అక్కడ ఇంకో క్షణంవుంటే అతన్ని హత్య చేయాల్సివస్తుందేమో అన్పించి గిర్రున వెనక్కి తిరిగి గుమ్మం వైపు నడిచింది.

"వెళ్తున్నావా విపులా? ఎట్లాగూ వచ్చావు.... ఓ గంట వుండిపోరాదు!" అది వెక్కిరింపో - చచ్చిన పాముని ఇంకా చావగొట్టటమో అర్థం కాలేదు. వెనక్కి తిరిగి అతని ముఖం చూడటానికే అసహ్యం వేసి చరచరా బైటకు నడిచింది.

ఎప్పుడూ చలాకీగా తిరుగుతూ _ గబగబా మాట్లాడే విపుల ఓ ప్రక్క మౌనంగా కూర్చోవటం జానకమ్మకు వింతగా తోచింది. రెండ్రోజులు విపులే ఏదన్నా చెప్తుందేమో అని చూసింది. విపుల కాలేజీకి కూడా పోవటం లేదు. ఇంక అట్లా చూస్తూ వూరుకోలేకపోయింది. ఆ సాయంత్రం - "బేబీ! అట్లా వున్నావేం?" అనడిగింది.

"ఏం లేదు!"

"ఏదో వుంది. కాలేజీలో ఏదైనా గొడవ జరిగిందా?"

"ఊఁహుఁ."

"మరి? ఎందుకలా వుంటున్నావు? కాలేజీకి ఎందుకు వెళ్లటం లేదు?" తల్లి నెమ్మదిగా - లాలనగా ప్రశ్నించిన తీరుకు కరిగిపోయింది విపుల. తల్లి గుండెల్లో తల దాచుకుని భోరుమన్నది.

జానకమ్మ మరి ప్రశ్నించక ఓదార్పుగా తల నిమురుతూ వుండిపోయింది.

ఆ రాత్రి భోజనం చేస్తున్నప్పుడు - "అమ్మా! నేను ఓ తప్పు చేశాను". అంది విపుల.

విపుల చెప్పబోయేది శ్రద్ధగా వింటున్నట్టు చూసింది జానకమ్మ.

"ఓ మోసగాడి మాటలు నమ్మి - ప్రేమని భ్రమపడి...." కళ్ళు నిండు కున్నాయి నీళ్ళతో.

"ఎవరతను?"

"అతని పేరు నా నోటితో చెప్పలేనంతగా అసహ్యం వేస్తోందమ్మా ప్రేమించాడని నమ్మాను...."

ప్రశ్నార్థకంగా చూసింది జానకమ్మ.

తల్లి కళ్ళల్లోకి చూడలేనట్లు - తలదించుకుని అవునన్నట్లు తల వూపింది.

ఆవిడ ఎదురుచూడని ఆఘాతం తగిలినట్లు - చేష్టలు దక్కి కూర్చున్న ఆ తీరులోనే అర్థమైంది విపులకు - తన తల్లి - అందరి తల్లుల్లా ఏడవటం - మొత్తుకోవటం చేయదని తెలుసు. కనీసం తనని పల్లెత్తి మాటకూడా అనని ఆమె సంస్కారానికి - సిగ్గుతో చితికిపోయింది. 'తన కింత స్వేచ్ఛ ఇచ్చి వ్యక్తిత్వంపై నమ్మకముంచిన అమ్మకు తీరని వ్యథను మిగిల్చింది' అన్పించి మనసు నిస్పృహలో కూరుకుపోయింది.

విపుల కంచంలోని అన్నాన్ని అటూ - ఇటూ కెలుకుతూ - కంటనీరు పెట్టుకోవటం చూస్తూ సహించలేకపోయింది జానకమ్మ.

'విపు ఎంతో ఆత్మస్థయిర్యం వున్న పిల్ల. ఇంతగా బేల అయిందంటే.... వాడు బాగా నమ్మించి వుండాలి. ఏ సమస్య అయినా తనకు తానే పరిష్కరించు కుంటుంది. తనదాకా వచ్చిందంటే .... దిక్కుతోచని పరిస్థితిలో వుండి వుంటుంది. కన్నతల్లిగా చేయూతనిచ్చి, వెన్నుతట్టటం తన బాధ్యత' అనుకుంది.

"వూరుకో బేబీ.... నీ మనసెంతగా గాయపడిందో అర్థమౌతోంది. కానీ.... నీ కంటనీరు మాత్రం సహించలేను. క్షమించలేను. నా పెంపకంలో ఏదైనా లోపం వుందేమో అని సందేహించాల్సి వస్తుంది. ఇట్లాంటి ఎదురు దెబ్బల్ని నిబ్బరంతో భరించాలి. అతన్ని నీ మనసులోంచి దూరంగా తరమేసెయ్. అదంతా పీడకల అనుకో.... ఇదేదో పెద్ద సమస్యగా చిత్రించుకుని నిన్ను నీవు భయపెట్టుకోకు. అంతా సక్రమంగా జరిగేట్టు నేను చూస్తాను." అంది మెల్లగా ధైర్యంచెప్తూ.

ఆ తర్వాత విపులతో - రాజమండ్రి వెళ్ళింది జానకమ్మ.

అక్కడ కూతురితో - అల్లుడితో ఆలోచించి - అక్కడే విపులకు అబార్షన్ చేయించింది. విపుల తనలో తాను చిన్నతనంగా ఫీలవకూడదని - అనుక్షణం

ఎవరో ఒకరు కదిపెడుతూ - ఏవేవో ఇతర విషయాల్ని గురించి మాట్లాడుతూ - విపుల నా దెబ్బనుంచి కోలుకునేటట్లు చేశారు.

ఇరవై రోజుల తర్వాత - మళ్ళీ కాలేజీకి వెళ్ళటం ప్రారంభించింది విపుల.

వరలక్ష్మి ఇదివరకులా విపులతో కలవిడిగా వుండటంలేదు. ఇంట్లో పెద్ద వాళ్ళు ఏం మందలించారో - దూరంగా తప్పుకొని పోతోంది. క్లాసులో చాలామంది తనను అదోరకంగా చూడటం - వెలివేసినట్లు ప్రవర్తించటం గమనించింది విపుల.

తన వెనుక స్టూడెంట్స్ హేళనగా జోక్స్ వేసుకోవటం కూడా వింది. అన్ని అవమానాల్ని భరించి నిర్లిప్తతతో వుంది. రోడ్డుమీద వంటరిగా కాలేజీకెళ్ళి వస్తున్నప్పుడు జరిగిన రోజులన్నీ కళ్ళముందు గిర్రున తిరిగేవి.

'ఎంత ప్రేమ నటించాడు.... ఎట్లా ప్రాధేయపడ్డాడు! తను లేకపోతే జీవితమే లేదన్నంత ఆరాధన చూపాడు. తన చూపుకోసం, మాటకోసం ఎన్నో రోజులు వేచి.... తనపై కవితలు అల్లి.... చివరికి తనను గెల్చి, పొంది.... అవసరం తీర్చుకున్నాక - మోజుపోయాక.... పుగజంతువు కంటే హీనంగా ప్రవర్తించాడు. ఇవాళ తన ప్రక్కన వరం లేదు. వెనుక బాడీగార్డులా బదరీ లేడు. వంటరిగా.... తన గమ్యం వెతుక్కుంటూ....' నిట్టూర్చింది విపుల.

ఇతర జ్ఞాపకాల్ని నొక్కివేసి - సాధ్యమైనంత వరకు మనసుని చదువుపై లగ్నంచేసి పట్టుదలగా కృషిచేయసాగింది విపుల.

బదరీ మామూలుగా కాలేజీకి వస్తున్నాడు.

అతనిప్పుడు 'ప్రేమ' సబ్జక్టుమీద కార్టూన్లు వేస్తున్నాడు. అతని చుట్టూ చేరే స్టూడెంట్లు.... ఆ నవ్వులు.... జోకులు....అంతా మామూలే.... అతని ప్రవర్తనలో ఏం తేడాలేదు!

'దీపాన్ని తాకేదాకా తెలియదు శలభాలకి అది అగ్నిగుండమని - తనని కాల్చేస్తుందని.... దీపంలోని వెలుగుకి ఆకర్షింపబడి పరుగెత్తి శలభంలా తను - ఈ నవ్వులు - మాటలు - అతి వినయంకి మురిసిపోయి మనసు పారేసుకుంది...' తనలా మళ్ళీ....మరో శలభం....'

ఫైనల్ పరీక్షలయినాక లైబ్రరీలో పుస్తకాలివ్వటానికి వెళ్ళింది విపుల. లైబ్రేరియన్‌తో మాట్లాడుతూ కన్పించాడు బదరి. లోపలికెళ్ళి పుస్తకాలు బల్లపై వుంచి - రాక్‌లోని పుస్తకాల్ని వెతుకుతూ నిలబడింది విపుల.

బదరి విపులదగ్గర కొచ్చాడు.

"హలో విపూ....బావున్నావా?"

"ఊఁ" అంది తల తిప్పకుండానే.

"నువ్వు పూర్తించి వచ్చాక మళ్ళీ నా రూంకి రానేలేదేం?"

"ఎందుకు?"

"ఎందుకేమిటి?.... ఆ రోజున అట్లా అన్నానని...."

"డోంటాక్ నాన్సెన్స్! గతం నాస్తి. ఈ రోజు నువ్వెవరో-నేవనెరో... మైండిట్." అంది నిప్పులు కురిపేలా చూస్తూ.

"నామాట నాకు వప్పచెప్తున్నావా? .... ఓ. నీకు నాపై కోపం తగ్గలే దన్నమాట! విపూ.... ఎంతైనా ఆడదానివి. నన్ను ప్రేమించినదానివి.... నీ కోపం పూర్తిగా తగ్గాక.... మళ్ళీ నా అవసరం నీకు రావచ్చు.... జరిగింది మర్చిపోయి...."

అతని మాటలు పూర్తిచేయనీయలేదు విపుల.

"షటప్. నీ అవసరం నాకి జన్మకు లేదు. విన్నా నీ పేరూ తల్చుకుంటేనే అసహ్యం. మనుషుల్లో మృగానివి. నీ ముఖం నాకు చూపించకు...." అక్కడ్నించి విసురుగా వచ్చేసింది విపుల.

* * *

ఆ తర్వాత అక్కగారి వూరు వచ్చేసింది విపుల. కలవులు అక్కడ గడిచాక- వైజాగ్‌లో ఎమ్.ఏలో సీటొచ్చింది. ఆ రెండేళ్ళూ చదువే లోకంగా గడిపింది విపుల. హాస్టలు వదిలి ఎక్కడికీ వెళ్ళేది కాదు. ఎవరితోనూ ఎక్కువగా పరిచయం పెంచుకోలేదు. స్నేహం ముసుగుతో మరో ఉపద్రవాన్ని కొనితెచ్చుకోవటం ఇష్టంలేక.

ఎమ్.ఏ అవగానే ఆదేవూళ్ళో ప్రయివేట్ కాలేజీలో ఉద్యోగం దొరికింది. తల్లీ- తనూ ఓ చిన్న ఇల్లు అద్దెకు తీసుకుని వుండేవాళ్ళు.

~~కపిల అత్తగారివైపు దూరపు బంధువు కౌరి. అతనూ వైజాగ్‌లోనే~~ బ్యాంక్‌లో పనిచేస్తున్నాడు.

త్రిగుణ్ తన మరదలు అక్కడే లెక్చరర్‌గా పనిచేస్తోందనీ- ఎప్పుడైనా వెళ్ళి యోగక్షేమాలు విచారించి రమ్మని రాశాడు. ఓ ఆదివారం వెతుక్కుంటూ వచ్చి పరిచయం చేసుకున్నాడు. మంచి సరదా మనిషి. ఎంతో రిజర్వుడుగా వుండే

విపులని కదిలించి— నవ్వించి— వాగించాడు వారానికోసారి వస్తూవోతూ అలవాటు పడ్డాడు.

బీచ్‌కి రమ్మనీ, సినిమాకి వెళ్దామని రెండుమూడుసార్లు శౌరి అడిగినా— సున్నితంగా త్రోసిపుచ్చి— అతన్ని వుంచాల్సిన దూరంలోనే వుంచింది.

ఓరోజు హఠాత్తుగా త్రిగుణ్ వూడిపడి - "శౌరిపై నీ అభిప్రాయం ఏమిటి?" అనడిగాడు విపులను.

విపుల తెల్లబోయి— "నా అభిప్రాయమా? ఎందుకు?" అనడిగింది.

అతనో ఉత్తరం ఇచ్చాడు విపులని చదవమని.

అది శౌరి త్రిగుణ్‌కి రాసిన ఉత్తరం.

అందులో తన కెంతగానో విపుల నచ్చిందనీ — ఆమె నడవడి, ప్రవర్తనా తనని ఆకర్షించాయనీ— ఆమె కిష్టమైతే పెళ్ళాడాలని వున్నట్లు రాసాడు.

"నాకు.... పెళ్లా?" అంది విపుల నమ్మలేనట్లు.

"నీకేం తక్కువని అంత ఆశ్చర్యపోతున్నావు? శౌరి మంచివాడు. ఏరి కోరి నిన్ను చేసుకోవాలనుకుంటున్నాడు అతను. నీ కిష్టమైతే చెప్పు!" అన్నాడు త్రిగుణ్.

తన సంగతి తెల్సిన ఏ మగాడూ- తనని పెళ్ళిచేసుకోడని — జీవితాంతం తనిట్లా వుద్యోగం చేసుకుంటూ వంటరిగా వుండాల్సివస్తుందని అనుకుంది విపుల. అందుకే.... అనుమానంగా - "కానీ.... నేను...." అంటూ ఏదో అనబోయి ఆగింది.

"చూడు! నీలోని ఆ ఆత్మన్యూనతాభావాన్ని పోగొట్టుకోనిదే సుఖంగా బ్రతకలేవు విపులా! ఆ సంఘటన నీ జీవితంలో జరగనేలేదని అనుకుని మర్చిపో. అతనికి తెలియాల్సిన పనిలేదు."

"దాచటం.... అన్యాయం కాదా బావా?"

"ఎన్నటికీ కాదు. చిన్నతనంలో ఎన్నో పొరపాట్లు చేస్తుంటాము. తప్పని తెలిసాక దిద్దుకుని మరోసారి అట్లాంటి పొరపాట్లు చెయ్యం. ఇదీ అంతే. నువ్వే దాన్ని ఓ పెద్ద అగాధంగా వూహించుకుని మర్చిపోలేకపోవటం.... నీ బలహీనతని తెలుసుకో."

ఆలోచిస్తే ఆ మాటల్లో ఎంతో నిజం వుందనిపించింది. చిన్న చేదుఅనుభవం ఎదురైందని — నిండు నూరేళ్ళ జీవితాన్ని నిర్లిప్తంగా - నిరర్థకంగా గడిపేయాలనుకోవటం అర్థంలేని పని. తోడుగా—నీడగా ఎవరో ఒకరి సాన్నిహిత్యం




లేనిదే బ్రతుకుబాటలో ఒంటరితనం వీడదు. నీడలా వెన్నంటి జీవితంపై మబ్బులు ముసిరేలా చేసిన గతం నీలిఛాయల్ని చీల్చి చెండాడే రవికిరణంలా– తనకొక జీవనసహచరుడు కావాలి.'

శౌరిని మొదటిసారిగా ఆ దృష్టితో చూసి ఆలోచించింది విపుల. చామన ఛాయ.... కళ్ళజోడు, విశాలమైన ఫాలం. సదా నవ్వే కళ్లు. సౌమ్యత–సహృదయత మూర్తీభవించిన.... ఆ రూపం.... అతని మనసులో తను స్థానం సంపాదించుకోగలగటం గర్వకారణమే. ఆతను నేరుగా తనతో ఈ విషయాన్ని ప్రస్తావించకుండా–త్రిగుణ్ ద్వారా తన వుద్దేశాల్ని బైటపెట్టటం – పెద్దమనిషి తరహాని సూచిస్తోంది.

అభ్యంతరపెట్టే కారణమేదీ దొరకక– మనసు అతనివైపు వొగ్గినా 'సరే' అని త్రిగుణ్ తో అనలేకపోయింది విపుల.

ఆ తర్వాత తల్లి, అక్క వరుసగా నచ్చచెప్పారు.

మరో అనుమానానికి– ఆలోచనకు తావుఇవ్వక శుభకార్యం జరిపించారు.

విపుల మనసులో పేరుకుపోయిన స్తబ్దతనుంచి – చైతన్యంలోకి తీసుకొచ్చి ప్రేమకు కొత్త రూపం, అనుబంధానికి కొత్త అర్థంచెప్పాడు శౌరి.

మూడేళ్ళ అన్యోన్య దాంపత్యానికి చిహ్నంగా 'పింకీ'.

ఆతనికి ప్రమోషన్.... పింకీ సంరక్షణకోసం తను ఉద్యోగానికి రిజైన్ చేయటం వరుసగా వచ్చిన పరిణామాలు.

జీవితం హాయిగా– సాఫీగా సాగిపోతున్న తరుణంలో....

బదరీ భయంకరమైన పీడకలలా....

7

నిట్టూర్చింది విపుల.

'కాలం ఎట్లాంటివాళ్ళలోనయినా పరివర్తన తెస్తుందంటారు. అతనికి పెళ్ళయింది. బాధ్యతలు– బరువులు తెలిసివుండాలి. ఈ పదేళ్ళకాలం అతనిలో మార్పుతెచ్చి– అతనిలోని బలహీనతల్ని – తప్పుల్ని దిద్దుకొనేలా చేసిందేమో! ఇంకా అతనిలో వెనుకటి భయంకర మనస్తత్వం వుండే వుంటుందనుకుంటూ.. తనెందుకిట్లా బెదిరిపోవటం? పిరికివాళ్ళను మరింత తరుముకొచ్చే లోకమిది. ఆత్మస్థయిర్యం నిండుగా వుంటే ఎవరైనా ఏంచేయగలుగుతారు? 'జీవితమంటే అంతులేని ఒక పోరాటం' అని ఎవరో కవి అననే అన్నాడు. గెలుపు – ఓటమిలను సమానదృష్టితో తీసుకుంటూ ముందుకు సాగిపోవాలి.' విపుల మనసు అదుపులో పెట్టుకుని నిద్రపోవటానికి ప్రయత్నించింది.

తిరిగి విపులకు మెలకువ వచ్చేసరికి చాలా పొద్దెక్కింది.

ముందురూంలో పేపరుచూస్తూ కాఫీ తాగుతున్నాడు శౌరి.

అప్పటికే 'పింకీ' లేచి–తండ్రి పాలుకలిపి ఇస్తే తాగి బుద్ధిగా హోంవర్క్ చేసుకొంటూంది.

బాత్‌రూంలో కెళ్తున్న విపులను చూసి– 'గుడ్‌మార్నింగ్' అన్నాడు శౌరి. అతని ముఖంలో చిరునవ్వు చూసి మనసు తేటపడింది విపులకు.

వంట అయాక – పింకీని స్కూలుకు పంపి – శౌరికి వడ్డించి దగ్గర కూర్చుంది విపుల.

"ఏమిటంత బద్ధకంగా వున్నావు? రాత్రి సరిగ్గా నిద్రపట్టలేదా?" అడిగాడు శౌరి.

"ఎందుకు పట్టలేదు.... పదిగంటలకే విపరీతమైన నిద్ర వచ్చింది!"

"కళ్ళు ఎర్రగా వుంటే___"

"వేడిచేసి."

"అటూ–ఇటూ మసలుతూనే వున్నావు పక్కలో."

"నిద్రలోనేమో!"

తడుముకోకుండా తన నోటినుంచి వస్తున్న అబద్ధాల్ని చూసి తనే విస్తుపోయింది. ఒక్క నిజంతో సమసిపోయే సందేహానికి.... ఎన్ని అబద్ధాలు ఆడాల్సి వస్తోంది!! అనుకుంది.

"అం.... ఏవిటా వరాకు? ఎంత నెయ్యి వంపేశావో...."

వ్సృహలోకొచ్చి చూసింది. చేతిగిన్నెలో నెయ్యి సగానికి పైగా అతని కంచంలో వంపేసింది.

"సారీ...." అంది కాస్త సిగ్గుపడి.

అతడు ఆమె ముఖంలోకి ఓ క్షణం చూసి మరి మాట్లాడక భోజనం పూర్తిచేశాడు. కంచం తీసి అక్కడ శుభ్రంచేసి సింకి విడిచినబట్టలు పబ్బులో పెట్టింది.

"విపూ .. ఈ షర్టుకు గుండీ కుట్టనేలేదా?"

"మర్చిపోయాను. వుండండి ఒక్క నిమిషం." అంటూ దారపువుండ తీసుకుంది.

"వద్దులే! నాకు టైం అయిపోయింది." అంటూ హడావుడిగా స్కూటర్ బైటకుతీసి విపులకోసం చూశాడు.

ఎప్పట్లా విపుల గుమ్మంలోకి రాలేదు.

అతని భ్రుకుటి ముడిపడింది. స్కూటర్ స్టాండ్‌వేసి గబగబా లోపలి కొచ్చాడు.

చేతిలోంచి జారిపడి చిక్కుపడిన దారాన్ని - చిక్కు విడదీసి వుండకు చుట్టాలని ప్రయత్నిస్తోంది విపుల.

అతను లోపలకు రావటం చూసి- "ఏం మర్చిపోయారు?" అనడిగింది.

"నేనా? నువ్వా? మర్చిపోయింది?"

అర్థంకానట్టు చూసింది.

"గుమ్మందాకా వచ్చి.... రోజూ నువ్వు...."

నొచ్చుకుంటూ.... "సారీ" అంటూ లేచింది. ఆమెని దగ్గరకు తీసుకుని మృదువుగా నుదురు చుంబించి- "ఇవాళ ఎన్నిసార్లు సారీ చెప్పావో తెలుసా?" అన్నాడు.

ఆమె అతని మెడవంపులో ముఖాన్ని దాచి జవాబివ్వలేదు.

"వంటో బాగోలేదా?"

'వంటోకాదు మనసులో.... అహ మనసులోనూ కాదు. ఎక్కడో.... ఏవిటో.... ఎందుకో ఈ అస్థిమితం నాకుమాత్రం తెలిస్తేగా?' అనుకుంది.

శౌరి కేదోవొక జవాబివ్వాలి. లేకపోతే వదలడని తెలుసు.

"ఏవిటో.... బద్ధకంగావుంది. మీరెళ్ళండి. మళ్ళీ పడుకుంటాను" అంది.

ఆమె నుదుటిమీద చెంప ఆన్చి-"టెంపరేచరేం లేదే. ఎందుకి బద్ధకం!" అన్నాడు.

"స్నానంచేస్తే పోతుందిలెండి. నాకేంకాదు. ముందు మీరెళ్ళండి. టైం అయిపోయింది." అంటూ అతన్ని బలవంతపెట్టి పంపి— తలుపేసి వచ్చి మంచం మీద వాలిపోయింది.

'తనిట్లా వుండకూడదని తెలుసు. వుండాలనీ లేదు. ఎంత ప్రయత్నిం చినా- ఉత్సాహాన్ని తెచ్చుకోలేకపోతోంది. ఏం జరిగిందని ఈ విరిక్తత! శౌరి ఏమనుకుంటాడు! ఎన్నింటికని ఆతనికి సర్ది చెప్తుంది! ఇన్నాళ్ళూ తనెంతో ధీరో దాత్తురాలనీ— సాధారణ స్త్రీలా ప్రతిదానికి చలించే మనస్తత్వం కాదని అనుకుంది. చిగురాకు రెపరెపలాడినా చలించిపోయేంత బలహీన మనస్సు అని ఇప్పుడర్థ మౌతోంది. అర్థంలేని భయాల్ని వూహించుకుని – లేని సమస్యల్ని సృష్టించు కోవటం- చేజేతులా నరకాన్ని ఆహ్వానించటమే!'

విపుల మామూలు ఉత్సాహం తెచ్చుకుని లేచింది.

సాయంత్రం శౌరి వచ్చేసరికి – పింకీతో సమానంగా పరిగెత్తుతూ బంతి ఆడుతోంది విపుల.

* * *

పింకీ పుట్టినరోజు దగ్గరవడటంతో – ఆ సాయంత్రం షాపింగ్‌కు బయ ల్దేరారు శౌరీ, విపులలు. రెండుమూడు రెడీమేడ్ షాపులు గాలించి చివరికి వచ్చిన గౌను తీసుకున్నారు.

తిరిగివస్తున్నప్పుడు దారిలో 'వాసవీ క్లాత్ షోరూం' దగ్గరపడగానే ఏదో గుర్తొచ్చి— స్కూటరాపాడు శౌరి.

"విపులా! ఇదేకదూ.... నీ ఫ్రెండ్ షాపు? లోపలికెళ్ళి ఓసారి చూసొ ద్దామా!" అనడిగాడు.

"వూరికే చూడటం ఎందుకు! ఏదైనా కొనాలనుకున్నప్పుడు వద్దాం. ఇప్పుడింటికెళ్ళిపోదామండీ!" అంది.

"కొనాలని ఏముంది! ఓసారి చూసి అతనుంటే పలకరించి వద్దాం. పద." అన్నాడు స్కూటర్ స్టాండ్ వేస్తూ.

అయిష్టంగానే అతనివెనుక నడిచింది విపుల.

విశాలమైన హాలు. వాటినిండా రకరకాల బట్టలు, సేల్స్‌మెన్స్, గరల్స్... రంగురంగుల డిజైన్లలో వున్న చీరెల్ని గుట్టలుగా కస్టమర్సుముందు పడేస్తు న్నారు. అంతా రద్దీగా వుంది. షాపు బాగానే రన్ అవుతోందని అర్థమౌతోంది.

"ఏం కావాలి సార్?" అడిగాడు సేల్స్‌మాన్.

"మీ ప్రొప్రయిటర్ ఏడీ?"

"లేరు సార్."

"ఎప్పుడొస్తారు?"

"తెలీదు సార్."

"సరే. పోదాం పద విపులా!" అన్నాడు శౌరి కాస్త నిరుత్సాహంగా.

"చీరలేం వద్దా సార్!"

"వద్దు."

"ఆయనకేమన్నా చెప్పాలా సార్?" అన్నాడు వదలకుండా.

విపుల వారించేలోగా - "ఆయన చిన్నప్పటి ఫ్రెండ్ వచ్చాడని చెప్పు!" అన్నాడు శౌరి.

* * *

మరునాటి మధ్యాహ్నం రెండుగంటల సమయంలో కాలింగ్ బెల్ మోగింది.

విపుల విశ్రాంతిగా పడుకుని 'చలం' నవల చదువుతుంటోంది. ఎవరై వుంటారా.... అనుకుంటూ లేచి తలుపు తీసింది.

బదరీ!

"నువ్వా!" అంది.

ఆమె ముఖంలో ఆశ్చర్యం, కళ్ళల్లో అయిష్టత గమనించాడు బదరీ.

"శౌరిగారు లేరా?" అనడిగాడు.

శౌరికీ తనకీ ఎంతో పరిచయం వున్నట్లు- అతనికోసమే వచ్చినట్లు.... ఆ ప్రశ్న విని ముఖం చిట్లించింది.

"ఈ సమయంలో ఇంట్లో వుంటారనుకునే వచ్చారా?" అంది నవ్వటానికి ప్రయత్నిస్తూ.

"ఓ.... ఆఫీసు కదూ ఆయనకు. నాకంటే బిజినెస్ కనుక ఓ టైమంటూ వుండదు.... ఆయనకట్లా కాదుగా...." అని నవ్వేసి- "ఏమిటి వాకిట్లోనే నిల బెట్టేశావు? లోపలికి రాకూడదా?" అన్నాడు అదోలా చూస్తూ.

ఆమె అడ్డుతొలగి లోపలికి దారి ఇస్తూ- "బిజినెస్‌మాన్‌వి. లక్షపన్లుంటాయేమో.... కూర్చునే తీరిక ఎంతుందో వుండదో అని.... రా, కూర్చో" అంది.

అతను ముందుగదిలోని సోఫాలో కూర్చున్నాడు. గదిని పరిశీలనగా

చూస్తూ— "నువ్వొక్కదానివే వున్నావా ఇంట్లో? ఏం చేస్తుంటావు ఈ తీరిక సమయంలో?" అనడిగాడు.

"ఇంటిపట్టున వుండే గృహిణులంతా చేసేదే ఏదో. పుస్తకాలు... టీవీయో.... కుట్లు.... అల్లికలు."

"నిన్ను చూస్తుంటే నాకు ఆశ్చర్యంగా వుంది" అన్నాడు నవ్వుతూ.

చటుక్కున అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ—

"ఎందుకు?" అంది.

"చదువుకున్నావు. అందునా బావుండే చిన్న... ఉద్యోగం మానుకుని గడప దాటని ఇల్లాలుగా మారిపోయి.... కేవలం ఇంటికే పరిమితం అయిపోయి...."

"ఏం అయితే? నా కిందులోనే శాంతి. తృప్తి వున్నాయి. మనిషికి కావాల్సినవి ఈ రెండే. లోకాన్ని వుద్ధరిస్తానని చిలో ఎప్పుడూ ప్రగల్భాలు పల్కలేదే" అంది నవ్వుతూ.

"అయినా నా భావం... ఈనాడు చదువుకున్న స్త్రీలు—ఆర్థికస్వాతంత్ర్యం కోసం ఉద్యోగం. భావస్వాతంత్ర్యంకోసం తపనంటూ పేరే వ్యాసాలు.... సాంఘికసేవ .. మహిళామండలివ్యాసాలు.... దీనజనోద్ధరణ.... వగైరాలన్నమాట."

"నువ్వు చెప్పే వ్యాపకాలన్నీ ఉన్నతవర్గంలోని స్త్రీలకు కావాలి. నేను మధ్యతరగతి స్త్రీని. అయినా.... నాకు అన్ని స్వాతంత్ర్యాలూ ఉన్నాయి. వాటి కోసం వెంపర్లాడాల్సిన పనిలేదు....ఆఁ....అన్నట్టు ఏంతీసుకుంటావు? కాఫీయా? టీనా?"

"ఈ సమయంలో టీ తీసుకొంటే బావుంటుంది."

విపుల వంటగదిలో కెళ్ళింది.

టీపాయ్‌మీద వున్న మాగజైన్స్ తిరగేస్తూ కూర్చున్నాడు బదరి. అయిదు నిముషాల్లో కప్పులతో తిరిగొచ్చింది విపుల.

అతనికో కప్పు ఇచ్చి—తను తీసుకుని ఎదురుగావున్న కుర్చీలో కూర్చుంది.

టీ తాగుతూ విపులనే పరిశీలనగా చూస్తున్నాడు బదరి. కొద్దిగా రేగిన జుట్టు ముఖంమీద పడ్తోంది. అప్పటిదాకా పడుకుని వుందేమో కొంచెం నలిగి వుంది చీర. నిర్మలంగా వున్న ఆ ముఖం.... శరీరాకృతి .... సమ్మోహనంగా వుంది. తనను మామూలు పరిచితుడిలా చూస్తూ - తమ మధ్య ఏం జరగనట్లే మాట్లాడటం అతనికి ప్రోత్సాహకరంగా వుంది. యౌవనం తొలిదశలో మనసిచ్చి

-అతనికి తన కన్యాత్వం ధారపోసిన ఏ స్త్రీ అతన్ని తొందరగా మర్చిపోలేదని విదరి నమ్మకం.

'అప్పటికంటే అతను మరింత ఉన్నతస్థితిలో వున్నాడు. రూపంలో కూడా హుందాతనం వచ్చింది. అడపా-తడపా కథలు రాస్తున్నాడు. ఇప్పటికీ తనకి విపులపై వ్యామోహం తగ్గలేదని తెలిస్తే.... ఎట్లా ప్రవర్తిస్తుందో....' అనుకున్నాడు, తనవంకే రెప్పవేయకుండా చూడటం గమనించి-

"ఏవిటి ఒంటరిగా వచ్చావు? నీ మిసెస్‌ను కూడా తెస్తే బాగుండేదిగా!" అంది.

"ఆమెకి తీరికెక్కడ? ఉమెన్స్ క్లబ్ సెక్రటరి కావటంవల్ల పనేవో బాధ్యతలు. పల్లెటూళ్ళకెళ్ళి 'ఉచిత నేత్ర చికిత్సాశిబిరాన్ని' నిర్వహిస్తున్నారు.... ఆ హడావుడి.... ఇంట్లో వుండేదే తక్కువ."

"అయితే మీ ఆవిడ్ని చూడటం కష్టమన్నమాట!"

"ఆవిడకి తీరిక వున్నప్పుడు చెప్తాను. నువ్వే ఓసారి మా యింటికి రారాదూ?"

ఆ ఆహ్వానాన్ని ఎట్లా అర్థంచేసుకోవాలో తెలీలేదు విపులకి. 'ఇతను తమతో సాన్నిహిత్యాన్ని పెంచుకోవాలని చూస్తున్నాడా? ఎందుకు? ఏ ఉద్దేశంతో? గతంలో తను చేసిన తప్పుని దిద్దుకుని- మంచి మనసుతో స్నేహాన్ని అభిలషిస్తున్నాడా? లేక ఏదన్నా దురుద్దేశంతోనా?'

"నిన్న మీ షాపుకొచ్చాము" అంది.

"ఆఁ, ఔనట. గుమాస్తా చెప్పాడు. ముఖ్యమైన మీటింగ్‌కి వెళ్ళటంవల్ల ఆ సమయంలో అక్కడ వుండలేకపోయాను. సారీ...."

"దానికేంలే. మేము వస్తామని నువ్వేం కలగనలేదు గదా!"

"నువ్వెంతో మంచిదానివి కనుక.... అట్లా అంటున్నావు."

"అంటే!"

"మరొకరైతే డిసప్పాయింట్ అయి నన్ను తిట్టుకొనేవారు!" అన్నాడు.

'ఇతను మారాడా? లేక ఇంకా అప్పటి నంగివేషాలు మార్చుకోలేదా' అన్నది తేల్చుకోలేకపోతోంది విపుల.

"అన్నట్లు నువ్వు ఇప్పుడేమన్నా రాస్తున్నావా? నీ కార్టూన్లు కూడా ఎక్కడా కన్పించటంలేదే?" అనడిగింది మాట మారుస్తూ.

"అవన్నీ ఎప్పుడో మానేశాను. ఆ రోజులు, ఆ జీవితం వేరు... అప్పట్లో.... నా కవితకు ప్రేరణ, నా మనసుకు స్ఫూర్తి. నా భావాలకు ఆలంబన.... నువ్వే కదా! నిన్ను పోగొట్టుకున్నాక ఇంకా ఏం కవితలు! ఆ రోజు అట్లా ఎందుకు ప్రవర్తించానా అని ఆ తర్వాత ఎంతో విచారించాను."

"ఇప్పుడవన్నీ ఎందుకు!" అంది విపుల.

"కానీ...."

"చూడు బదరీ! ఇద్దరం జీవితంలో సెటిలయ్యాం. ఇప్పుడా విషయాల్ని తలుచుకోవటం బావుండదు." అంది గంభీరంగా.

బదరి తన బిజినెస్‌గురించి — అందులో వస్తున్న లాభాల గురించి చెప్ప సాగాడు.

నాలుగున్నర అవుతుండగా పింకీ కాన్వెంటునుంచి వచ్చింది.

బదరీని చూసి గుర్తుపట్టి— "అంకుల్ ఎందుకొచ్చాడమ్మా!" అడిగింది. విపుల ఏదో చెప్పేలోగా— "మీ మమ్మీని చూడాలని!" అనేశాడు నవ్వుతూ.

"అయితే నువ్వు చెడ్డవాడివన్నమాట!" అంది వెంటనే.

ఉలిక్కిపడ్డట్టయి— "చెడ్డవాడినా!" అన్నాడు వింతగా.

"మా డాడీ చెప్పారు. పెద్దపెద్ద.... ఆడవాళ్ళని గుడ్లగూబలా చూసే వాళ్ళంతా చెడ్డవాళ్ళుట!"

అరిందాలా చేతులు తిప్పుతూ— 'మల్లిక్' కార్టూన్స్‌లోని బేబీలా చెబుతూ— బెదురూ లేకుండా అనేస్తున్న 'పింకీ'ని చూస్తుంటే ముచ్చట వేసింది బదరీకి.

విపుల 'పింకీ'ని అలా అనకూడదని మందలించి లోపలి కెళ్ళగొట్టింది. ఇక అప్పుడు లేచి— "వస్తా విపులా. చాలా సేపయింది వచ్చి!" అన్నాడు.

*　　　*　　　*

శౌరి ఆఫీసునించి వచ్చాడు.

వంట ప్రయత్నంలో వుంది విపుల.

అతను స్నానంచేసి విశ్రాంతిగా కూర్చున్నాక కాఫీ అందించి మళ్ళీ వంటగదిలో కెళ్ళింది విపుల.

'పింకీ' తండ్రిదగ్గర చేరి స్కూలు కబుర్లు చెప్తోంది.

"డాడీ .. ఇందాక అంకుల్ వచ్చాడు." అంది గుర్తుకొచ్చి.

"అంకులా.... ఎవరమ్మా! త్రిపురా!"

"ఊహూం. ఈ అంకుల్ చెడ్డవాడు డాడీ!"




"ఏంచేశాడు?"

"మమ్మీని...." అంటూ ఏదో చెప్పబోయిన పింకీని కేకేసింది విపుల.

పింకీ వచ్చాక "ఏవిటా పిచ్చిమాటలు? వెళ్లు.... రోజాతో ఆడుకో." అంటూ పంపేసింది విపుల.

అది గమనించిన శౌరి భ్రుకుటిముడిచాడు.

వంటపని పూర్తిచేసి – స్నానంచేసి – తల దువ్వుకుంటూన్న విపుల నుద్దేశించి—

"మనింటికి ఎవరైనా వచ్చారా?" అనడిగాడు.

"ఆఁ బదరీనాథ్ వచ్చాడు. నిన్న షాపుకు మనం వచ్చివెళ్ళినట్లు తెలిపి.."

"పింకీ చెప్పిన పెద్దవాడతనేనా?"

"ఊఁ."

"ఏమన్నాడేం?" అన్నాడు నవ్వుతూ. అది కుతూహలమో–అనుమానమో అర్థంకాలేదు.

"ఏమంటాడు?" అని వూరుకుంది.

శౌరి మరి ప్రశ్నించలేదు. విపుల ఏదన్నా చెప్తుందేమో అని ఎదురు చూశాడు. విపుల మరి ఆ విషయాలు ఎత్తక పేపర్ చూస్తూ రాజకీయాలు గురించి మాట్లాడసాగింది. శౌరి ఆసక్తి చూపించలేదు. కొంచెం అలిగినట్టు లేచి వీధిలోకెళ్ళి పింకీని పిలిచి– ఇద్దరూ బంతి ఆడడం ప్రారంభించారు.

విపుల పేపర్ చదవటం పూర్తిచేసి అక్కడే కూర్చుండిపోయింది. రోజులా తండ్రీ–కూతుళ్ళ ఆట చూడలేదు. రేడియో ఆన్‌చేసి పరధ్యానంగా వింటూండిపోయింది.

రాత్రి భోజనాలప్పుడు కూడా ఇద్దరిమధ్యా ఎక్కువగా మాటలు జరుగ లేదు. పింకీ పడుకున్నాక గదిలోకొచ్చింది విపుల.

గుండెలమీద పుస్తకం వుంచుకుని సీలింగ్‌వంక చూస్తూ దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు శౌరి.

"ఇంకా మీరు పడుకోలేదూ?" అంది.

"ఊహూ. నీకోసమే చూస్తున్నాను."

"లైటు వుంచనా.... తీయనా?"

"వుంచు."

రేడియోలో గానసుధలో చిట్టిబాబు వీణ వస్తోంది. విపుల కళ్ళు మూసుకుని వింటూ పడుకుంది.

"విపులా!"

"ఊఁ."

"నిన్నో ప్రశ్న అడగనా?"

కళ్ళు తెరిచి చూసింది. "అడగండి!" అంది.

"సరైన సమాధానం చెప్పాలి!"

"ఊఁ." ఊపిరిబిగపట్టి అతనడగబోయేదానికోసం ఎదురుచూసింది.

"సాయంత్రంనుంచీ ఎంతో పరాకుగా వున్నావు. ఎందుకని?"

తేలిగ్గా నిట్టూరుస్తూ- "ఎందుకనుకుంటున్నారు?" అంది.

"ప్రశ్నకి ప్రశ్న సమాధానమా?"

"మీరేం అనుకుంటున్నారో తెలుసుకోవాలని!"

"నిజం చెప్పనా?"

"మీరు.... అబద్ధాలు కూడా చెప్తారా?"

"అవసరాన్ని బట్టి."

"సరే. నిజం చెప్పండి!"

"బదరీనాథ్‌ని చూసి-నువ్వెందుకో భయపడుతున్నావు." పక్కలో బాంబు పడ్డట్టే అదిరిపడింది విపుల.

"ఔనా?"

"నాకెందుకు భయం!"

"ఎందుకో నువ్వే చెప్పాలి!"

"మీరూహించింది శుద్ధ తప్పు!"

"మరి.... ఒప్పు ఏమిటో!"

"మీరూ, పింకీ బయటకెళ్ళిపోయాక ఒంటరితనంగా అన్పించి బోర్ కొడ్తూంది. ఏదైనా మార్పు కావాలనిపిస్తోంది!"

"ఎలాంటి మార్పు?"

"మళ్ళీ ఉద్యోగంలో.... చేరుదామా అని...."

"వున్న వుద్యోగం వద్దనుకుని—కావాలని ఇంట్లో వుండిపోయావు. ఇప్పుడు మళ్ళీ...."

"అప్పుడు పింకీ మరీ పసిది. దాని సంరక్షణకోసం అట్లా చేయాల్సివచ్చింది. ఇప్పుడు నా అవసరం దానికి అంతగా లేదు. స్కూలు, ఫ్రెండ్స్....ఆటలు.... దానికీ ఓ ప్రపంచం ఏర్పడింది!"

"ఉద్యోగం చెయ్యటం—మానటం అన్నది పూర్తిగా నీ వ్యక్తిగత విషయం. నీ ఇష్టం."

"మీ అభిప్రాయం చెప్పకూడదా?"

అతను వెంటనే జవాబివ్వక ఓ నిముషం ఆగి అన్నాడు.

"నా అభిప్రాయం.... నువ్విట్లా వుంటేనే బాగుంటుందని. ఇంట్లో వుండటం అలవాటయిపోయింది నీకు. అతిక్రమను తట్టుకోలేవేమో! అదీకాక... నా సంపాదన మనకు బాగానే సరిపోతోంది."

"మీరు చెప్పింది నిజమే.... అయినా.... నా ఒంటరితనం...."

"నా ఉద్దేశం చెప్పాను. అంతే. నిర్బంధం కాదుగా!"

"మీ ఉద్దేశానికి వ్యతిరేకంగా నడిచే శక్తి నాకు లేదు."

"నీ ధోరణి వింతగా వుంది విపులా! నీ ఇష్టప్రకారం చెయ్యమంటే నా అభిప్రాయం కావాలన్నావు. సరేఅని వెల్లడిస్తే— నాకు వ్యతిరేకంగా నడవనంటున్నావు. అంటే.... నీ ఇష్టాన్ని....స్వేచ్ఛను అడ్డుకున్నవాడిని చేసి— నన్ను నిరంకుశుడిగా నిలబెడుతున్నావన్నమాట!" అన్నాడు కాస్త తీవ్రంగా.

అతని భుజంమీద చెయ్యివేసి—

"శారీ! అట్లా అనుకోవద్దు. మిమ్మల్ని — మీ అభిప్రాయాన్ని నేను గౌరవిస్తున్నాను!" అంది.

"విపులా! ఈ గౌరవం నాకు సంతోషాన్నివ్వదు!"

"మీ సంతోషంకోసం ఏంచెయ్యమంటారు?"

"ఏంచెయ్యొద్దు.. నీ మనసుని స్వచ్ఛంగా వుంచుకో!"

ఛెళ్లున చెంపమీద కొట్టినట్లయింది విపులకు. చెయ్యి వెనక్కి తీసుకుని మౌనంగా వుండిపోయింది.

గౌరి కూడా మళ్ళీ పలకరించలేదు.

## 3

సూపర్‌మార్కెట్ నెలలో మొదటివారం కావటంవల్ల రద్దీగావుంది. లిస్టు రాసిన కాగితం తీసి ఏదైనా మర్చిపోయానా అని ఆలోచిస్తోంది విపుల.

"హలో...."

తలెత్తింది. బదరి!

ఎవర్ని మర్చిపోదామనుకుంటుందో అతను!

"సరుకులకోసమా?"

"ఊఁ."

"క్యూ చాలా వుంది. ఈలోగా నాకో చిన్న హెల్ప్ చెయ్యాలి!"

"ఏవిటి?"

"ఓ ఫ్రెండ్‌కి మంచి ప్రజెంటేషన్.. నువ్వు సెలక్ట్‌చేసి పెట్టాలి."

"నేనా?...నో. ఇక్కడి క్యూ పోతుంది."

"జస్ట్ టెన్ మినిట్స్. ఇంతలో ఏం కొంపమునగదులెద్దూ."

"సారీ.. నాకు ఇంట్రస్టులేదు. నేను రాను!"

"ప్లీజ్ విపూ...."

అప్పటికే అక్కడున్నవాళ్ళంతా వీళ్ళిద్దరివంకా చూస్తున్నారు. విపులకు కోపంగా వుంది. 'ఏంటీకిట్లా ఇరకాటంలో పడేస్తాడు? ఇష్టంలేదని చెప్పినా అర్థంచేసుకోడేం?' అనుకుంది.

"విపూ.... ఇప్పుడే వచ్చేద్దాం రా."

అతను 'విపూ' అని పిలవటం దుర్భరంగా వుంది. మరోసారి అట్లా పిలిచే అవకాశం ఇవ్వకూడదని విధిలేక అతనితో నడిచింది. ఫ్యాన్సీ వస్తువులున్న కౌంటర్‌ముందు ఆగి అక్కడున్నతనితో తనకు కావాల్సినవి చెప్పాడు బదరి. అతను షోకేసుల్లో వున్న వస్తువులన్నీ తీసి అతనిముందు పేరుస్తున్నాడు.

"చూడు.. ఏది బావుందో!" అన్నాడు విపుల నుద్దేశించి."

"ఫ్రెండ్ అంటున్నావు.... వాళ్ళ టేస్ట్ ఏమిటో నాకేం తెలుస్తుంది?"

"నీకిష్టం, అభిరుచి ప్రకారం ఎన్నికచేయి."

"సందర్భం ఏవిటి?"

"సందర్భమా?" అని కొంచెం ఆలోచించి — "చిరకాలం తర్వాత కలిశాము. నా గుర్తుగా.... సంతోషంగా....అఁ....ఇదిగో. ఈ వీనస్ ఎట్లా వుంది?" అని చూపాడది.

సగం జారిపోయిన వస్త్రంతో అర్ధనగ్నంగా వున్న ఆ మెటల్‌బొమ్మవంక చూసింది.

చేతుల్ని కట్టుకుని నిగూఢంగా చూస్తున్న వివేకానందుడ్ని చేతిలోకి తీసుకుని "ఇది చూడు " అంది.

"బాగుంది.... ఎవరికైనా తాతగారికిస్తే బాగుంటుంది కదూ? చూడు.... ఇది ఎట్లావుందంటావు?" అనడిగాడు — పూర్తి నగ్నంగా కూర్చుని స్నానమాడుతున్న వయ్యారిని చూపిస్తూ.

"దానికన్నా ఈ మీరాబాయి ఎంతో నిర్మలంగా వుంది!" తంబుర మీటుతూ— అర్ధనిమీలితనేత్రయై వున్న మీరాను ముగ్ధంగా చూస్తూ అంది విపుల.

"ఇది చాలా బావుంది కదూ విపూ.... ఓహ్.... ఫెంటాస్టిక్." అన్నాడు ఓ అర్ధనగ్న స్త్రీ— నిటారుగా నిలబడి ఓ చెయ్యి వయ్యారంగా పైకెత్తి వుంది. ఆ చేతికో ప్లగ్‌పాయింట్ వుంది. టేబిల్‌లైట్‌కింద ఉపయోగపడుతుంది.

"బెడ్‌రూంకి అందంగా వుంటుందిది. ఇది తీసుకుందాం!" అని విపులతో అని— పేక్‌చెయ్యమన్నాడు బదరి.

విపులకు కోపం బుస్సున పొంగింది. 'తనని అవమానించటానికా రమ్మన్నాడు?' అనిపించింది.

"నేను వెళ్తున్నాను!" అంది.

"అగు.... అంత తొందరేమిటి?" అని వారిస్తూ — ప్యాకెట్ తీసుకుని— డబ్బు చెల్లించి 'పద' అన్నాడు.

తిరిగి విపుల తన క్యూవైపు నడవబోయింది.

"అటుకాదు.... అట్లా క్యాంటీన్‌కెళ్ళి కాస్త కాఫీ తాగుదాం."

"ఇప్పుడా? వద్దు."

"అరె!.... ఎందుకంత అదుర్దా విపూ?"

"నన్ను 'విపూ' అని పిలవకు." అంది చిరాకుగా.

"ఓ.... కూడదు కదూ? అలవాటు చొప్పున...."

"మర్చిపోయిన అలవాట్లను.... సంఘటనల్ని మళ్ళీ గుర్తుచేసుకోవటం మంచిదికాదు బదరీ!"

"కాఫీ తాగుతూ మాట్లాడుకుందాం పద!"

ఏదో నిశ్చయించుకున్న దానిలా అతనివెంట నడిచింది. అతను టిఫిన్‌కి ఆర్డరిచ్చి సిగరెట్ వెలిగించాడు.

"బదరీ.... నీకో ఓ విషయం చెప్పదల్చుకున్నాను!"

ఏమిటన్నట్లు చూశాడు.

"నీతో ఇట్లా చనువు పెంచుకోవటం నా కిష్టంలేదు. మంచికో—చెడుకో—మన దారులు వేరైనాయి. తప్పు నీదైనా—నాదైనా గతించిన జ్ఞాపకాల్ని తిరిగి తోడుకుని.... మన మధ్య అసహజమైన స్నేహం పెంచుకోవటం .... నా కిష్టం లేదు. దయచేసి.... నువ్వు నన్ను ఎరగనట్లే ప్రవర్తించు. నాతో మాట్లాడాలని గానీ— నా ఇంటికి రావాలనిగానీ ప్రయత్నించకు. నా దారిన నన్నిట్లా బ్రతక నీయ్."

"ఏమైంది! శౌరి ఏమన్నా...."

విపుల ముఖం కోపంతో జేవురించింది.

"అతనంత కుసంస్కారుడు కాడు."

"మరి నీ మాటల కర్థం!"

"ప్రస్తుత పరిచయం నా కిష్టంగాలేదు. అర్థమైందనుకుంటాను! గుడ్‌బై.." లేవబోయింది.

"ఆగు.... ఇదే చివరి కలయిక అంటున్నావు.... కాఫీ తాగి వెళ్ళు వాకోసం!"

విపుల కాఫీ మాత్రం తీసుకుంది.

ఇద్దరూ బైటకొచ్చారు.

తన చేతిలోని ప్యాకెట్టు ఆమెచేతిలో పుంచబోయాడు.

"నాకిస్తున్నావేమిటి!" అంది చేతులు వెనక్కి లాక్కుని.

"నీకోసమే కొన్నాను!"

"ఒద్దు. ఇలాంటివి నా కిష్టంవుండదు."

"నా గుర్తుగా.... మన పరిచయానికి...."

"ఒద్దు....ఒద్దు. నీకు సంబంధించినవేవీ నా ఇంట్లో వుండకూడదు."

"మంచి మనసుతో ఇస్తుంటే...."

"నిజంగా నీది అట్లాంటి మనసే అయితే—నేనీవూళ్ళో వున్నానన్నసంగతి మరచిపో. వస్తాను."




ఆమె వడివడిగా వెళ్ళిపోయింది.

చివరికి తన చేతిలోని ప్యాకెట్ వెక్కిరించినట్లయింది. సిగరెట్ విసురుగా పారేసి— 'డామిట్' అనుకున్నాడు.

చేతికందినట్టే అంది జారిపోతున్న విపులవైపు సాలోచనగా చూస్తుండిపోయాడు. 'నిన్ను మర్చిపోవాలా? ఇంత సులభంగానా?' అనుకున్నాడు. స్కూటర్ స్టార్ట్‌చేసి షాపుకెళ్ళాడు. షాపులోపల చిన్న రూం తనకు పర్సనల్‌గా వుంచుకున్నాడు. అడపా-తడపా స్నేహితుల్ని పిలిచి – అక్కడ డ్రింక్ తీసుకోవటం అలవాటు దానిక్కావాల్సిన సామగ్రి అంతా అక్కడ సిద్ధంగా వుంటుంది.

నేరుగా తన గదిలోకెళ్ళి తలుపు మూసుకున్నాడు. రెండుమూడు పెగ్గులు తీసుకున్నాక తీవ్రంగా ఆలోచించసాగాడు.

'ఎంతో వినయంగా – స్నేహంగా .... మంచిగా వున్నా – ఎందుకిట్లా దూరంగా తోసివేసిందా బిచ్? తనేదో పతివ్రత అయినట్లు వేధపోతూలా అదీ నిన్నా మొన్నటిదాకా నాతో కులికి.

...ఔను....అదే భయం కాబోలు.... మొగుడికి తెలిస్తే....తన కాపురం కూలిపోతుందేమో అని బెదురు.... నూటయిదు తగలేసి బొమ్మకొంటే.. వద్దంటుందా? ఇక దీంతో లాభంలేదు.... అట్నుంచి నరుక్కురావాలి!

అతని ఆలోచనలకు భంగం కలిగింది.

తలుపుమీద చిన్నగా తట్టి – "అయ్యా! మీకు ఫోనొచ్చింది!" అన్నాడు గుమాస్తా. వెళ్ళి రిసీవర్ తీసుకున్నాడు.

సుదతి అటునుంచి – "నువ్వేనా?" అనడిగింది.

"ఊఁ.... ఏవిఁటి?"

"ఇందాక ఫోన్‌చేస్తే నువ్వు లేవన్నారు. ఎక్కడికెళ్ళావ్?"

"ఎందుకు?"

"సాయంత్రం త్వరగా ఇంటికి రా.... బొంబేనుంచి హరీష్ వచ్చాడు."

"డాక్టర్‌దగ్గరి కెళ్లావా?"

"వెళ్ళాను. మామూలే.... రేపు నర్సింగ్‌హోంలో వుండాల్సి రావొచ్చు."

"అన్ని ఇష్టాలూ – నిర్ణయాలూ నీవేనా?" అన్నాడు కొత్త అసహనంగా.

"నా జీవితం.... నా ఇష్టం.... దీన్ని గురించి మాటలు పెంచకు!" ఫోను పెట్టేసింది.

కోపంతో పళ్ళుకొరుక్కున్నాడు బదరి.

స్కూటరెక్కి బజార్లన్నీ పిచ్చిగా తిరిగాడు. మండుతున్న ఎండలో బీచ్ కెళ్ళి ఇసుకలో పడుకున్నాడు.

కసి....కసి.... తనమీద.... సుదతిమీద.... విపులమీద.... లోకంమీద!

ఓ గంటతర్వాత లేచి నేరుగా శౌరి పనిచేసే బ్యాంక్‌కెళ్ళాడు. శౌరి ఎవరితో ఫోన్‌లో మాట్లాడుతున్నాడు.

బదరిని చూసి నవ్వి ఫోన్ పెట్టేసి.... "హలో.... ఏవిఁటిలావచ్చారు?" అనడిగాడు.

"ఏంలేదు.... మిమ్మల్ని చూడాలనిపించి." అన్నాడు నవ్వుతూ.

శౌరి ఇద్దరికీ కాఫీలు తెప్పించాడు.

"ఉదయం సూపర్‌బజార్లో విపుల కన్పించింది.... సరుకులకోసం వచ్చింటుంటా.... నేనూ హెల్ప్ చేశాన్లెండి....తొందరలో ఈ ప్యాకెట్ మర్చిపోయింది. ఇంటికెళ్ళి ఇద్దామనుకున్నాను కానీ...కుదరలేదు." అంటూ ప్యాకెట్టు అందించాడు.

"థాంక్యూ." అంటూ తీసుకున్నాడు శౌరి.

"మాయింటి కొస్తానన్నారు....రానేలేదు!" అన్నాడు శౌరి.

"వచ్చాను కాపీ.... మీరు లేరప్పుడు." అన్నాడు నవ్వి.

పావుగంటసేపు అమాటా–ఈమాటా మాట్లాడి వెళ్ళిపోయాడు బదరి.

• • •

కాఫీకప్పుతో వచ్చింది విపుల.

"ఇవాళ సూపర్‌బజార్ కెళ్ళావా?" అనడిగాడు శౌరి.

"అన్ని వస్తువులు వచ్చాయా?" యథాలాపంగా అడిగినట్లు అడిగాడు.

"ఆఁ!"

"సరిగ్గా చూసుకున్నావా?"

"చూశాను!" అంది కాస్త ఆశ్చర్యంగా."

"లాభంలేదు విపూ. నీకు మతిమరుపు ఎక్కువైంది."

"ఏంచేశాను?"

"పరధ్యాస—ఇంట్లోనూ—బయటా."

"ఏంచేశానో చెప్పరాదూ?"

"ఏంచేశావా? అటు చూడు." అన్నాడు టీపాయ్‌వైపు చెయ్యి చూపిస్తూ.

చూసింది విపుల. అర్ధనగ్నసుందరి!

సర్పాన్ని చూసినట్లే బెదిరి– "ఇక్కడికెట్లా వచ్చింది?" అంది.

"నిన్న అక్కడ బదరీ కలిశాడుటగా?"

"మీదగ్గర కొచ్చాడా?"

"వచ్చాడు. ఇది కౌంటర్‌మీదే మర్చిపోయావట! ఇచ్చి వెళ్ళాడు!"

విపుల ఏం తోచనట్లు నిలబడిపోయింది. దాన్ని తీసి పెంటకుప్పలో పడే యాలన్నంత కోపం వచ్చింది.

'తను మంచిగా వుంటూన్నకొద్దీ మితిమీరుతున్నాడు. గట్టిగా బుద్ధి చెప్పాల్సివచ్చేట్టుంది. ఈ మితిమీరిన అభిమానం చూసి పొంగి పోర్లాపడుతా ననుకున్నాడు కాబోలు! గట్టిగా హెచ్చరించాలి.' అనుకుంది.

దానివంకే తీక్షణంగా చూస్తూ నిలబడ్డ విపులవంక చూసి–

"ఎవరిది సెలక్షన్? నీదా? బదరిదా? ఇద్దరిదా? ఎవరిదైనా బావుందోయ్. కానీ.... వెల మాత్రం కాస్త హెచ్చే! ఇప్పుడంత ఖరీదు పెట్టి...."అతడికీ అను మానమే. అది విపుల కొన్నదా? బదరీ కొన్నాడా? అని.

'నే నది కొనలేదు. అది తీసి దూరంగా పారెయ్!' అని అరవాలనిపిం చింది విపులకు.

ఏదో అశక్తత. బదరీ కుటిల మనస్తత్వం గురించి చెప్తే— తీగ లాగితే డొంకంతా కదిలినట్లు తన గతజీవితపు పీలిపీడల్ని పైకి తోడవలసివస్తుందేమో. దీనవదనంతో – ఏదో అపరాధం చేసినట్లు – దోషిగా తను శౌరిముందు నిలవ

లేదు.... కాపీ.... ఎన్నాళ్ళిట్లా నిర్మలంగా సాగిపోతున్న తన సంసారాన్ని కల్లోలపర్చటానికా అన్నట్లు ఈ బదరీ మళ్ళీ దాపురించాడే!

విపుల అక్కడ్నించి మౌనంగా వెళ్ళిపోయింది.

రాత్రి పడుకోవటానికి బెడ్‌రూంలో కడుగు పెట్టిన విపుల శిలాప్రతిమే అయింది.

అర్ధనగ్నసుందరి చేతికి బల్బు తగిలించి- వెలిగించి- ఆ వెలుగులో చదువుతూ....శౌరి!

బల్బు వెలుగు ఆ సుందరి నిమ్నోన్నతాలమీద పడి వెండిలా మెరుపు....

శౌరి పుస్తకంలోంచి దృష్టి మళ్ళించి – "రా. అక్కడే ఆగిపోయావేం? ఎలావుంది లాంపు?" అనడిగాడు.

"అదిక్కడొద్దు. తీసేయండి." అంటూ విసురుగా వచ్చి స్విచ్ ఆఫ్ చేయబోయింది. ఆమె చెయ్యిపట్టి ఆపుతూ – "ఎందుకూ తీసేయటం? వుండనీ. నాకు చదువుకోవటానికి బావుంది!" అన్నాడు.

విస్సహాయురాలిలా చూస్తుండిపోయింది విపుల.

'దాన్ని చూస్తూ.... చూసినప్పుడల్లా బదరీ గుర్తుకొస్తూ....ఓహ్....ఎంత నరకం అది! ముందే ఈ విషయం గుర్తించి ఎంత తెలివిగా ఇచ్చాడు! పడగ్గదిలో శౌరితో వున్నప్పుడు కూడా.... అతన్ని మర్చిపోకూడదనా? ఆ సమయంలోకూడా ప్రశాంతతని వుండనీయక అడ్డుగా నిలవాలనా?' దాన్ని విసిరిపారేయాలన్నంత కోపాన్ని– బలవంతంగా అణచుకుంది.

'తను అనవసరంగా లేనిపోనివన్నీ వూహించి భయపడుతున్నదేమో! బదరితో తన అభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పింది కనుక.... ఇక తన జోలికి రాకపోవచ్చు. మానసికంగా తను పడ్తున్న నరకయాతనకి విముక్తి కలిగినట్లే, బదరీ మళ్ళీ కనపడనట్లే భావించి–ఆ జ్ఞాపకాల్ని దూరంగా తరిమేయాలి మళ్ళీ.. తన మామూలు సంసారం.... నడదాలు.... భగవంతుడా నన్నీ అదృష్టాన్నించి దూరంచేయకు,' అనుకుంది. మనసు కొంచెం తేలికపడినట్లయింది. శౌరికి దగ్గరగా జరిగి భుజంమీద తలఆన్చి–"ఏం చదువుతున్నారు?" అడిగింది మృదువుగా.

* * *

బదరి స్కూటర్ స్టాండ్‌వేసి వరండా మెట్లెక్కుతుంటే - హాల్లోంచి నవ్వులు విన్పించాయి. అందులో ఆడగొంతు సుదతిది. రెండోది ఎవరా అన్నట్లు ముఖం చిట్లించాడు.

లోపలికి అడుగుపెట్టాడు. హాల్లో సోఫాల్లో ప్రక్క-ప్రక్కన కూర్చున్నారిద్దరూ. ఆ అపరిచితుడికి అల్బంలో ఏదో చూపిస్తూ పగలబడి నవ్వుతోంది సుదతి. ఆ నవ్వటంలో పమిట చెదరినా సరిచేసుకోవాలన్న తెలివి లేనట్లువుంది.

బదరీని చూసి.... "అరుగో.... వచ్చారు...." అంటూ—

"బొంబాయిమంచి వచ్చారని చెప్పలేదూ? వీరే హరీష్." అంటూ పరిచయం చేసింది.

మర్యాదకోసమన్నట్లు షేక్‌హ్యాండ్ ఇచ్చి—తన గదిలోకి వెళ్ళిపోయాడు బదరి. మరో గంటతర్వాత అతన్ని పంపించి వచ్చింది సుదతి. మంచంమీద పడుకుని సిగరెట్ కాలుస్తున్న బదరీని చూసి—"త్వరగా రమ్మని ఫోన్‌చేసానా.... ఇప్పుడెంతయిందనుకుంటున్నావు? నీకు మరీ నిర్లక్ష్యం ఎక్కువైంది." అంది కోపంగా.

"ఎందుకు రావటం? నీ బాయ్‌ఫ్రెండ్‌ని చూస్తూ కూర్చోవటానికా?" అన్నాడు బదరి.

"తెలిసే మాత్రం వుంది! అత నెవరనుకున్నావు?"

"నీ బాయ్‌ఫ్రెండ్స్‌లో ఒకడు!"

"అంతకంటే నీ బుర్ర ఆలోచించదు! ఆ ఆలోచనే వుంటే వ్యాపారాన్నట్లా గుమాస్తాలకి వదిలి— పూరంతా బలాదూర్‌గా తిరగవు."

బదరీ మాట్లాడలేదు. ఆమె డ్రస్ మార్చుకుని— "పద భోజనం చేద్దువు!" అంది.

"మవ్వు?"

"నా డిన్నర్ హరితో డాల్ఫిన్‌లో అయిపోయింది."

"నా కాకలి లేదు!"

"అలకా?"

"అలకలూ — ప్రణయకలహాలూ — ఈ ఇంటి దరిదాపులకు కూడా రావని నాకు తెలుసు."

"తెలుసు కదా? అర్థంలేని కోపంతో కడుపు మాడ్చుకోక వెళ్ళి తినిరా."

"వొద్దు. నన్ను విసిగించకు."

"సరే.... నీ ఖర్మ." అనేసి ఏదో ఇంగ్లీష్ మాగజైన్ తీసుకుని చదువుతూ పడుకుంది సుదతి.

"రేప్రు హాస్పటల్‌లో వుండాలన్నావు?" అడిగాడు బదరి.

"రెండ్రోజుల తర్వాత వెళ్తాను. ఇవాళా-రేపూ హరి వుంటాడు."

"ఓ అతనికోసం నీ ప్రోగ్రాం మార్చుకున్నావా?"

"ఔను. లాభంలేనిదే నేను ఏ పనీ చెయ్యను. అతనో బిజినెస్ మాగ్నెట్. అతని మిల్లునుంచి ఉత్పత్తిఅయే బట్టలకు మార్కెట్‌లో మంచి డిమాండ్ వుంది. అందుకే అతనితో ఒప్పందం కుదుర్చుకుని.... మన షాపుని 'షోరూం' చెయ్యాలని.... న్యాయంగా ఇవన్నీ నువ్వు చూసుకోవాలి. ఎంతసేపూ ఫ్రెండ్స్‌ని వెంటేసుకుని– డబ్బుని తగలేయటం తప్ప బిజినెస్ మెంటాలిటీ లేదు."

"బంగారు బాతులాంటి నువ్వుండగా నా కెందుకా బెడద?"

"షటప్. ఆమాట అనటానికి సిగ్గుండాలి!"

"సిగ్గూ, లజ్జా వదిలేసి– నీ ఇష్టంవచ్చిన మగాడితో షూరేగేది నువ్వు.... నాకెందుకు సిగ్గు?"

"నువ్వో ప్రవరాఖ్యుడైనట్లు మాట్లాడకు. నన్ను .... నువ్వా దులకన చేసేది? నా తెలివి, డబ్బూ లేకపోతే – నువ్వు బజార్లో బికారిగా నిలబడాల్సి వస్తుందని గుర్తుపెట్టుకో!" అంది మండిపడుతూ.

బదరి మాట్లాడలేదు.

'ఇప్పటికి రెండుసార్లు ఎబార్షన్ చేయించుకున్నావ్.... ఈసారైనా వూరుకుని ఓ బేబీని కంటే బావుంటుంది. మనిద్దరం ఎన్నాళ్ళిట్లా?' అని అడగాలనుకున్న అతని మాటలు అతన్లోనే అణిగిపోయినయ్. సుదతినుంచి ఎట్లాంటి సమాధానం వస్తుందో తెలుసు.

'డోంటాక్ నాన్సెన్స్! హాయిగా బ్రతకటానికి లేకుండా.... అదొక వెధవ న్యూసెన్స్.... నీకంత ముచ్చటగా వుంటే – ఓ బేబీని తెచ్చుకుని పెంచుకో' అనేస్తుందని తెలుసు. అసహనంగా అక్కడ్నించి కదిలి ఫ్రిజ్ తెరిచి – బాటిల్ తీసుకున్నాడు.

వారంరోజులతర్వాత ఓ ఆదివారం ఉదయాన్నే తలుపుతట్టి లోపలికొస్తున్న బదరీవంక విపుల విస్మయంగా చూస్తుండిపోయింది.

"రండి.... రండి...." అంటూ శౌరి సాదరంగా ఆహ్వానించాడు.

విపుల అక్కడ్నించి లోపలికెళ్ళిపోయింది. వాళ్ళిద్దరూ మాట్లాడుతూ కూర్చున్నారు. శౌరితోపాటు బదరీకి కూడా కాఫీ-టిఫిన్ ఇవ్వక తప్పలేదు విపులకు. టిఫిన్ తిని కాఫీ తాగాక ఇద్దరూ పేక ముందేసుకుని కూర్చున్నారు.

వంటపని పూర్తిచేసి స్నానంచేసి - పుస్తకం చూస్తూ కూర్చుంది విపుల. దృష్టి దానిపై నిలవలేదు.

తను అరోజు ఇంటికి రావద్దనీ - తనని మర్చిపోమని ఒక స్పష్టంగా చెప్పినా బదరి వదిలిపెట్టక ఎందుకొచ్చినట్లో అర్థంకాలేదు. ఎంతో మాట్లాడాలన్నా - ఆ ముఖం చూడాలన్నా లోతగా విన్పించింది. సైము కె చేస్తున్నా - శౌరి స్నానానికి కూడా లేవలేదు. ఇక తప్పనిసరై వెళ్ళింది విపుల.

ఇద్దరూ సిగరెట్ పై సిగరెట్ తగలేస్తూ - ఉత్సాహంగా మాట్లాడుకుంటూ అడుతున్నారు. శౌరి సిగరెట్లు అలవాటుగా కాల్చడు. ఎప్పుడైనా ఒకటీ.... అదా... అదీ విపుల కిష్టంలేదని బైట కాలుస్తాడు. ఇవాళ ఇంట్లో బదరీతోపాటు సగం పెట్టె ఖాళీచేశాడు.

విపులని చూస్తూ- "ఏంచేస్తున్నావు లోపల? సరదాగా నువ్వూ ఓ అట అడకూడదూ?" అన్నాడు బదరి.

ఆ మాటలు విన్పించుకోనట్లు.... "మీరిక లేచి స్నానంచేయండి. రెండు గంటలు దాటింది కూడాను__" అంది భర్తతో.

"ఇంకేం స్నానంలెద్దూ.... అన్నం వడ్డించెయ్. అన్నట్టు.... బదరీ! మీ భోజనం కూడా ఇక్కడే!" అన్నాడు శౌరి.

"విపుల నిబ్బంది పెట్టటం ఎందుకులెండి! నే వెళ్తాను!" అన్నాడు.

"ఇబ్బంది ఏముంది? ఏం విపూ!" అన్నాడు భార్యవంక చూస్తూ.

"అతనికోసం వాళ్ళావిడ ఎదురుచూస్తూ వుంటుందేమో! వెళ్ళనివ్వండి!" అంది.

"ఆ బాధేం లేదు. రాత్రిళ్లు తప్ప - పగలు కలిసి తినటానికి మా ఇద్దరి టైములూ కలవ్వు!" అన్నాడు బదరి.

ఇక తప్పనిసరిగా అతనికూడా వడ్డించింది. సాయంత్రం ఆరు దాటాక బదరీ వెళ్ళిపోయాడు.

"ఈ ఆదివారం చాలా తొందరగా గడిచిపోయింది!" అన్నాడు విపులతో శౌరి. విపుల ఏం మాట్లాడలేదు.

శౌరి ఎప్పుడన్నా తనతో సరదాగా పేకాడటం తెలుసు కానీ ఇన్నిగంటలు భార్యనిద్దర్ని కూడా మరిచిపోయి ఆడేంత మోజు వుందని ఇప్పుడే తెలిసింది విపులకు. 'ఈ ఆదివారం ఎంత భారంగా గడిచింది!' అనుకుంది. బదరితో స్నేహం పెంచుకోవద్దని ఎట్లా చెప్పాలో తెలీక వూరుకుంది.

మరో రెండు ఆదివారాలు కూడా ఇదే పద్ధతిలో గడిచిపోయినయ్. ఈ పద్ధతి ఇట్లాగే కొనసాగిస్తే అదొక వ్యసనంగా మారినా ఆశ్చర్యం లేదనిపించింది విపులకు.

ఆ ఆదివారం ఉదయాన్నే – "మనం సింహాచలం వెళ్ళొద్దామండీ!" అంది విపుల.

"ఇంత హఠాత్తుగా భక్తి పుట్టుకొచ్చిందేమిటి?" అన్నాడు శౌరి.

"కలవురోజుల్లో మనిద్దరం కలిసి బయటకెళ్ళి చాలా రోజులైంది!"

"సరే. త్వరగా తయారుకా." అన్నాడు.

విపుల వుత్సాహంగా పనులు ముగించుకుని తయారయేసరికి బదరి వచ్చాడు.

విషయం తెలిసి– "నేను వెళ్ళిపోతాను." అన్నాడు.

"సరదాగా....మీరూ రారాదూ?" అన్నాడు శౌరి.

విపుల బదరి ఏంచెప్తాడా అని ఆదుర్దాగా చూసింది.

"ఓ.కె. పదండి. నేనూ వెళ్ళి చాలారోజులైంది!" అన్నాడు.

విపుల ఉత్సాహం నీరుకారిపోయింది. గిరుక్కున బెడ్‌రూంలోకెళ్ళిపోయి చీర మార్చుకుంది. కొంచెం అలిగినదాన్లా మంచంమీద పడుకుంది.

శౌరి ఎంతకీ విపుల బయటకి రాకపోవటంతో బెడ్‌రూంలో కెళ్ళాడు.

"అదేమిటి పడుకున్నావేం?" అనడిగాడు.

"వంట్లో బాగాలేదు."

"ఏమైంది?"

"ఏంలేదు.... మనం ఎక్కడికీ వెళ్ళటంలేదు!"

"ఏమైంది విపులా?"

"నాకు చాలా తలనొప్పిగా వుంది!"

శౌరి వెళ్ళిపోయి ప్రోగ్రాం మారిపోయిన విషయం చెప్పి–బదరితో వళ్ళీ పేక ఆడుతూ కూర్చున్నాడు.

విపులకు ఉక్రోషం, దుఃఖం ముంచుకొచ్చాయి.

'ఇట్లా మారిపోయిందేమిటి తన బ్రతుకు? ఇదివరకు ఆదివారాలు ఎంతో ఉత్సాహంగా గడిచిపోయేవి. ఇప్పుడు ఆదివారం వస్తోందంటే భయంగా వుంది! ఇట్లా ఎంతకాలం? బదరిని ఇంటికి రాకుండా అపటం ఎట్లా?' అనుకుంది.

సాయంత్రం బదరి వెళ్ళిపోయాక శౌరితో అంది.

"అతన్నిక మన ఇంటికి రావద్దని చెప్పండి!"




"ఎందుకని?"

"ఆదివారం వస్తూనే తయారవుతున్నాడు. ఏ సరదా, సుఖం లేకుండా పోతోంది."

"ప్రొద్దున వెళ్దామని తయారై .... నువ్వే మానేశావుగా?"

"మనిద్దరిమధ్య అతనుండటం ఇష్టంలేక."

"మనిద్దరం కొత్తగా పెళ్ళయిన జంట కాము ప్రేమయాత్రగా వెళ్ళటం లేదు. పైగా అతను మీ క్లోజ్ ఫ్రెండ్ కూడాను. ఇష్టంలేదనటానికి అర్థంవుండాలి."

"ఇష్టం ఎందుకు వుండాలో కూడా అర్థంవుండాలి. ఎప్పుడో ఫ్రెండ్ అయినంతమాత్రాన మనం వెళ్ళే ప్రతిచోటుకీ వెంటేసుకు తీసుకెళ్ళాలా?"

"అంటే ఏమిటి మీ ఉద్దేశం?"

"అతను మనింటికి రావటం నా కిష్టంలేదు."

"ఎందుకని?"

"అతని స్వభావం మంచిది కాదు కాబట్టి."

"ఏ విషయంలో?"

"స్త్రీలవిషయంలో."

"అట్లాంటివాడు నీకు ఫ్రెండ్ ఎట్లా అయ్యాడు?"

"ఫ్రెండ్.... ఫ్రెండ్ అని పదిసార్లు అనకండి, కాలేజీరోజుల్లో కాస్త చనువుగా వున్నంతమాత్రాన ఫ్రెండ్సయిపోరు."

"మీ ఇద్దరిమధ్యా వున్న ఆ చనువు ఏమిటో?"

విపులకు కోపం వచ్చింది. "ఏమిటీ ప్రశ్నలు? మీ మనసులో ఏ వుద్దేశం పెట్టుకుని అడుగుతున్నారు?" అంది.

"ఏదో ఉద్దేశం వుందని అనుకుంటే అది నా తప్పు కాదు. అతను మొదటి సారిగా కన్పించినప్పటినుంచీ— నీ ప్రవర్తనలో వచ్చిన మార్పు నాలో ఏదైనా వుద్దేశాన్ని కల్గించి వుండొచ్చుగా?" విపుల తనలో తానే ప్రశ్నించుకొంది. శౌరి నుంచి ఇట్లాంటి జవాబుని వూహించలేదు 'అతని మనసులో ఇట్లాంటి అనుమానం వుందా? ఐదరి విషయం వున్నదున్నట్టు చెప్పేయనా?' అనుకుంది.

'ఇప్పుడున్న ఈ సౌమ్యత... విన్నాక వుంటుందా? పెళ్ళికిముందే ఎందుకు చెప్పలేదని నిలదీస్తే? ఎప్పుడో జరిగిపోయిన విషయాల్ని గుర్తు చేసుకుని లేనిపోని అపోహల్ని పెంచుకున్నట్టు అవుతుందేమో!' అనుకుంది.

విపుల మౌనం చూసి - "విపులా! ప్లెయిన్‌గా మాట్లాడేవాళ్ళంటే నా కిష్టమని నీకు తెలుసు!" అన్నాడు.

"మీకు కొన్ని ప్రిన్సిపుల్స్ వున్నట్టే - నాకూ కొన్ని వున్నాయి. నాకు చెప్పాలని గాఢంగా అన్పించినప్పుడు మీరడక్కుండానే చెప్తాను." అంది.

శౌరి వూరుకున్నాడు.

వారంరోజులు గడిచినయ్. ఈ వారంరోజులూ శౌరి ఎక్కువగా విపులతో మాట్లాడటంలేదు. విపుల కల్పించుకుని మాట్లాడబోయినా మాటల్ని తుంచేస్తున్నాడు. అతని ముభావం ఆమెని బాధించింది.

'ఏమిటిది! ఎంతకాలమిట్లా! కేవలం తిండికోసం తనూ అతన్ని వంటకోసం అతను తనని ఆశ్రయించుకుని వున్నట్లు... ఎవరిపన్లు వాళ్ళు యాంత్రికంగా చేసుకుంటూ...ఎందుకింత భారంగా అర్థరహితంగా గడపాలి! యౌవనారంభంలో చేసిన పొరపాటు.... అది తప్పే అయితే.. ఆ తప్పును అతనికి చెప్పి.... అతను చెప్పే తీర్పుకోసం తను ముద్దాయిగా నిలబడాలా! అది తనని బాధించే తీర్పు అయితే!

తను అతనితో ఆ విషయాన్ని చెప్పలేకపోతోంది అంటే — ఆ గతాన్ని ఎంతగా ద్వేషిస్తోందో అర్థంచేసుకోవాలి. తిరిగి ఆ పీడవలన తెలికి తనని శోభ పెట్టకూడదని అతనుకోవాలి. ఇన్నాళ్ళ సంసారంలో తనని సరిగ్గా అర్థంచేసుకుని వుంటే.... ఈ విషయాని కింత ప్రాధాన్యత ఇవ్వకూడదు. ఇష్టంలేని పనిని తనచేత చేయించే అధికారం ఎవ్వరికీ లేదు!' అనుకుంది.

'విపుల కింత మొండితన మెందుకు? జరిగింది ఇదీ అని చెప్పి ఐదరిని తను ద్వేషించే కారణం చెప్పొచ్చుగా. ఆమె మనసులో తనకేమాత్రం విలువ లేదని తెలిస్తే ఎవరికి మనసు బాధపడదు! తను మనిషే కాని మాను కాదుగా

నిర్వికారంగా వుండటానికి? ఎన్నిసార్లు అడిగినా పెదవి విప్పదు. కట్టుకున్న భర్తదగ్గర కూడా ఇంత గుంభనంటే.... చూద్దాం ఎన్నాళ్ళిట్లా దాటవేస్తుందో.... ఎప్పుడో ఒక సమయానికి.... బైటపడకపోదు!' అనుకున్నాడు శౌరి.

ఇట్లా ఇద్దరూ ఎంతకాలం పంతంగా వుండేవారో ....ఓ రోజు మధ్యాహ్నం పూట బదరీ వచ్చాడు. శౌరితో విపుల బదరీగురించి ప్రశ్నిపద్దాక శౌరి అతనికి ఏం చెప్పాడో ... బదరి రావటం మానేశాడు. ఆ తర్వాత మళ్ళీ శౌరి ఇంట్లో లేని సమయం చూసి వచ్చాడు.

అతన్ని చూస్తూనే విపుల ముఖం చిట్లించింది.

"ఎందుకొచ్చావు?" అంది.

ముఖంమీద గుద్దినట్లయి- "లోపలికి రానీయ్! చెప్తాను!" అన్నాడు.

"అవసరంలేదు.... ఏం పనిమీద వచ్చావో చెప్పు!" అంది నిర్మొహ మాటంగా.

"వీధిలో నిల్చుని మాట్లాడుకుంటే నీకే నష్టం. నీ ఇరుగు-పొరుక్కి- మంచి కాలక్షేపం కల్గించాలనుకుంటే....అట్లాగే కానియ్...." అని భుజాలెగరేసి- "మనం చదువుకునే రోజుల్లో....నువ్వు నాకొక లవ్ లెటర్ రాశావు...గుర్తుందా!" అనడిగాడు కావాలని స్వరం పెంచి.

తనని అల్లరిపెట్టటానికి వచ్చాడని అర్థమైంది విపులకి. కోపంతో ముఖం ఎరుపెక్కింది. చాచి లెంపకాయ కొట్టాలన్నంత ఆగ్రహాన్ని అతికష్టంమీద ఆపు కుంది.

ప్రక్కకు తప్పుకుని- "రా లోపలికి!" అంది నిగ్రహంతో.

"ఈ మర్యాద ముందే ఇచ్చివుంటే .... ఎంత బావుండేది చెప్పు!" అంటూ లోపలికొచ్చి కూర్చున్నాడు.

"ఇప్పుడు చెప్పు!" ఎందుకొచ్చావ్!" అంది సూటిగా చూస్తూ.

"సింపుల్....ఏంలేదు.... నా మనసులో ఏ మారుమూలో ఇంకా నీపై మోజు కొత్త దాగివుంది. అందుకే పదేపదే నీకోసం నా కాళ్ళని నీ ఇంటివైపు లాక్కొస్తోంది.... ఒక్కసారి నువ్వనుగ్రహిస్తే నా కోవన నేను పోతాను." అన్నాడు తన నిజస్వరూపాన్ని బహిర్గతం చేస్తూ.

"షటప్.... ఏం మాట్లాడుతున్నావో వళ్ళు తెలుస్తోందా? ముందు నా ఇంట్లోంచి బైటకు నడు!" అంది ఆవేశంతో వూగిపోతూ.

"తొందరపడకు. ఆవేశం అనర్థాలకు మూలం అంటారు. నేనేం నువ్వు తీర్చలేని కోరిక కోరలేదే? ఒకప్పుడు మనం ప్రేయసీప్రియులమే! అప్పుడు నువ్వు ఎబార్షన్ చేయించుకోకుండా వుండివుంటే.... నా బిడ్డకు తల్లివయి వుండే దానివి కూడా! అవునా?"

"అవన్నీ గతించిపోయినవి. నీ మోసపుమాటలు, కపట ప్రేమాభినయంకి తెలివితక్కువగా లొంగిపోయాను. ఇప్పుడు కూడా అప్పటి విపులనే అనుకుంటే పొరపాటుపడ్డావు."

"పొరపాటా? ఇన్నేళ్ళు గడిచినా— నన్ను చూడగానే నీ కళ్ళల్లో మెరిసిన మెరుపులు.... అప్యాయంగా మాట్లాడిన మాటలు.... నీ శరీరం, మనసు ఇంకా నన్ను కోరుతున్నాయనటానికి నిదర్శనాలు. నన్ను ద్వేషించి అసహ్యించు కుంటున్న దానివైతే— నా ముఖాన్ని చూసేదానివి కావు. ఎవర్నో తెలియనట్టే ప్రవర్తించేదానివి!" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

విపుల నిర్ఘాంతపోయింది. అతని అభాండాలు వింటుంటే వంటికి కారం రాసుకున్నట్టే వెర్రెత్తిపోయింది.

మనుషుల్లో మంచివాళ్ళు—చెడ్డవాళ్ళు అనే రెండు స్వభావాలే వుంటాయని తెలుసు. మరీ ఇంత దారుణంగా ఎదుటిమనిషిని మాటలతో హింసించే ప్రవృత్తిని ఇప్పుడే చూస్తోంది. అటనిచేతిలో మోసపోయినతర్వాత - ఆ అనర్థానికి కొద్దో గొప్పో తన పాత్రకూడా వుందని అనుకుందే గానీ— బదరిలో మరీ ఇంత వికృతత్వం దాగివుందని అనుకోలేదు.

బదరి విశ్వరూపం తెలిశాక కలతపడింది.... భయం కూడా వేసింది.

'ఏం చేస్తాడితను? పచ్చని తన కాపురంలో చిచ్చుపెట్టబోతున్నాడా? దుష్టులకు దూరంగా వుండమన్నారు. ఇన్నాళ్ళూ సభ్యతకోసం—అతన్ని ఇంటికి రానిచ్చి తన చేతు చేతులారా తెచ్చుకుందా?'

విపుల మౌనంచూసి అతను విలాసంగా నవ్వుతూ—

"మాట్లాడవేం? నేను అన్నది నిజమే కదూ?" అన్నాడు.

"పూర్తిగా పొరపాటు. నీ అతితెలివితేటలకి బోల్తాపడతావనుకోకు. జరిగిందానికి పశ్చాత్తాపంచెంది - నాతో నిర్మలమైన స్నేహాన్ని కోరుతున్నావని భ్రమపడ్డాను. ఇంత కుత్సితం కడుపులో పెట్టుకున్నావనుకోలేదు. నువ్వూ పెళ్ళయినవాడివి. ఉచితానుచితాలు వదిలేసి నీ ఇష్టంవచ్చినట్లు మాట్లాడకు! నీ భార్యని ఇట్లా పరాయిమగాడు హింసిస్తే నీకెట్లా వుంటుంది?"

బదరి ముఖం వెల్లబడింది. కూర్చున్నవాడల్లా లేచి అటూ ఇటూ పచార్లు చేయసాగాడు.

"నా భార్యకి.... పరాయి మగాడు! హు .... నా భార్య ఎట్లాంటిదో నీకేం తెలుసు? మీ ఆడవాళ్ళల్లో ప్రత్యేక వ్యక్తిత్వం కలది. ఆవిడలా మరో స్త్రీ వుండదు.... వుండలేదు... అట్లాంటప్పుడు ఏ స్థితిలో ఆవిడ్ని ఎట్లా వూహించేవి?" అన్నాడు వ్యంగ్యంగా. ఆ వ్యంగ్యం అతనికి తప్ప ఎవరికీ అర్థంకాదు.

"నీలాంటి నరపశువు ఆవిడకి తారసపడి వుండకపోవటంవల్ల ఆవిడ పతివ్రతే కావచ్చు. అంతమాత్రాన నీ దృష్టిలో మిగతా స్త్రీలంతా పతితలేనా?"

"పతితలు.... భ్రష్టులు.... మొగుడ్ని అడ్డంపెట్టుకుని నాటకమాడే కులటలు, అండర్‌స్టాండ్? ఉదాహరణకు నువ్వు. నువ్వు నాకు మనసిచ్చావు. ఆ తర్వాత పూర్తిగా నాదానవైనావు. మనసా-వాచా నన్నే కోరి నాతోవున్న నీవు.... ఇప్పుడు మరొకడ్ని కట్టుకుని 'నా భర్త' అంటూ నీతులు చెప్తున్నావ్. స్త్రీ ఒకడికే మనసిస్తుందనీ- చావైనా-బ్రతుకైనా అతనితోనే అనీ మీ ఆడవాళ్ళు అర్థమైన డైలాగులూ చెప్తారే? ఇప్పుడు నువ్వు చేసిందేమిటి?"

"నా ఈ పరిస్థితికి కారణమైన నువ్వు.... నన్ను తప్పు పడ్తున్నావా? నీ బుద్ధి వెర్రితలలు వేసినట్లుంది. ఏం మాట్లాడుతున్నావో వళ్ళు తెలిసే అంటున్నావా? నీ తిరస్కారంతో దెబ్బతిని కాలప్రవాహంలో గాయం మాన్చుకుని.... మళ్ళీ మామూలుమనిషినై .... జీవితాన్ని విస్తారంగా తాత - పునాదికలల్ని పండించుకున్నాను. ఈనాడు నువ్వు వచ్చి కోరగానే లొంగిపోయేంత హీనురాల్ని కాను. ఇష్టాయిష్టాలనేవి ఎల్లకాలమూ ఒక్కతీరుగా వుండవు. ఇప్పుడు నిన్ను చూస్తుంటే పరమ అసహ్యంగా వుంది. నా దరిదాపుల్లో కూడా సహించలేను. ఇంకో క్షణం నువ్విక్కడుంటే ఏంచేస్తానో నాకే తెలీదు. తక్షణం మర్యాదగా వెళ్ళిపో.... వెళ్ళిపోతావా లేదా?" అంది కోకిలా గర్జిస్తూ.

బదరి ఆమెనిచూస్తూ అట్లాగే ఓ క్షణం నిలబడ్డాడు. తర్వాత మౌనంగా బైటకి నడిచాడు.

ఉద్రేకం, ఆగ్రహం, ఆవేశం చల్లారిన విపుల అలసిపోయినదానిలా సోఫాలో కూర్చుంది. తల వెనక్కివాల్చి కళ్ళు మూసుకుంది.

బూట్లశబ్దం విని ఉలిక్కిపడింది.

బదరి వెళ్ళలేదా? వెళ్ళినట్లు నటించి మళ్ళీ వస్తున్నాడా? ఇంకా ఏమని ఏ విధంగా హింసించాలని? కళ్ళుతెరిచి అతనిముఖం చూడాలన్నా అసహ్యం వేసింది.

"మళ్ళీ ఎందుకొచ్చావ్?" అంది ముఖం తిప్పి చూడకుండా.

"విపులా.... నేను!" అన్న గౌరి కంఠస్వరం విని చటుక్కున లేచి.... "మీరా?.... అప్పుడేవచ్చారేమిటివాళ?" అంది.

ఆమె ముఖంలోకి చూస్తూ—

"బదరీ ఎందుకు వచ్చాడు?" అనడిగాడు.

వళ్ళంతా చెమటలతో తడిసి— అలసివున్న విపులరూపం అతనిలో అనేక ఆలోచనల్ని రేపింది.

"తర్వాత చెప్తాను ముందు మీకు కాఫీ పట్టుకొస్తానుండండి!" అంటూ లోపలికి వెళ్ళబోయింది.

"ఆగు!" అన్నాడు గౌరి.

ఆగి ఆతనివంక ఆశ్చర్యంగా చూసింది.

"తిరిగ్గా ఆలోచించి .. అందమైన కథ అల్లి నన్ను మభ్య పెట్టాలని చూడకు. ఇప్పుడే నాకు సమాధానం కావాలి!" అతనట్లా విలదీయటంతో పాలి పోయినంత పనయింది విపులకు

"మీరు.... మీరేనా?" అంది.

"నేనే.... ఏం? నీ నాటకం బైటపడిందని తెల్లబోతున్నావా?"

"నాటకమా-"

"బదరీ.... నువ్వు ప్రేమించుకోవటం నిజంకాదా? పెళ్ళిచేసుకోవాలను కోవటం నిజంకాదా? అతనికి చదువుతప్ప చిల్లిగవ్వైనా ఆస్తి లేదని తెలిసి— అతన్ని కాదని.... తర్వాత నన్ను పెళ్ళిచేసుకుని...."

"స్టాపిట్; ఏమిటీ ధోరణి? ఎవరల్లారీ అసత్యాల కోరణాన్ని?"

"ఏమీ ఎరుగనట్లు ఎందుకీ నటన? నువ్వింకా అతన్నే కోరుకుంటున్న ట్లయితే.... నే సద్దురాను; నిరభ్యంతరంగా అతని దగ్గరకు వెళ్ళిపోవచ్చు. నా దగ్గర అమాయకత్వం నటిస్తూ ఇన్ని తంటాలు పడనక్కర్లేదు!"

విపుల పిడుగుపాటు తిన్నదానిలా కూలిపోయింది. జరుగుతోంది కలో— నిజమో తెలీని అయోమయావస్థ. ఇన్ని మాటలంది తన భర్తకాక తరతరాల పురుషాధిక్యత ముందు నిలిచి అహంకారంతో— అనుమానంతో గర్జిస్తున్నట్లు....

నెమ్మదిగా వంటగదిలోకెళ్ళి – ఓ ప్రక్కగా గోడనానుకుని కూర్చుంది. తన జీవితం.... ఆ ఇల్లూ.... భర్తా.... పిల్లా.... అంతా అబద్ధమైనట్లు ఇన్నాళ్ళ ఏదో భ్రాంతితో బ్రతుకుతున్నట్లు అనిపించసాగింది.




ఈ 'ఆరేళ్ళ వైవాహిక జీవితంలో శౌరిని తను ఓ ప్రక్క మాత్రమే చూసింది. ఆ శౌరిలో ప్రేమ, ఆప్యాయత, అనురాగం తప్ప మరో అవలక్షణం ఎరుగదు. ఇట్లాంటిది.. అతనిలో ఒక్కసారిగా తనపట్ల ఇంత విముఖత్వం ఎట్లా కల్గింది? ఇన్నాళ్ళూ అతనితో చెప్పకుండా దాచిన తన గతం.... వున్నట్టుండి అగ్నిపర్వతంలా బ్రద్ధలై.... లావాయై తనను ముంచుతుందని అనుకోలేదు. చెప్పకుండా దాచటం విషయంలో తను పొరపాటు చేసిందా? ఈ పరిస్థితి ఎట్లాంటి పరిణామాలకు దారితీస్తుందో ....' అని పరిపరివిధాల ఆలోచిస్తుండిపోయింది విపుల.

'మనిషి జీవితంలో ఈ ఆటపాటలు సర్వసాధారణమైనవే. నిలదొక్కుకుని ప్రయాణించడమే తప్ప ఇట్లా ఎందుకు జరిగిందని ఆవేశపడుతూ — బాధపడుతూ అక్కడే నిలిచిపోతే ప్రయోజనం ఏముంది?' ఈ ఆలోచన కొంత ఊరటనిచ్చింది విపులకు. నెమ్మదిగా లేచి దైనందిన కార్యక్రమంలో పడింది. పింకీ స్కూలునుంచి వచ్చింది. తండ్రి ఇంట్లోనే వుండటంతో అతనితో స్కూలు కబుర్లు చెప్తూ కూర్చుంది. విపుల పిలిచినా 'వుండమ్మా!' అంటూ రానేలేదు. సాయంత్రం వంటలోకి కూరలు లేవు. మామూలుగా శౌరి ఆఫీసునుంచి వస్తూ కూరలు తెస్తాడు. ఇవాళ త్వరగా ఇంటికి రావటంవల్ల తేలేదు. కూరలబుట్ట తీసుకుని విపుల మార్కెట్ బయల్దేరింది. శౌరి ఆమె వెళ్ళటం చూసీ చూడనట్టు వూరుకున్నాడు.

విపుల కూరలుతీసుకుని తిరిగి వచ్చేసరికి ఇల్లు తాళంపెట్టి వుంది. తెల్ల బోయినట్టు అక్కడే నిలబడిపోయింది. 'తను కూరలు తీసుకురావటానికి వెళ్ళిం దని తెలిసీ.... ఎక్కడికెళ్ళినట్లు? పింకీ ఏమైంది?' రెండునిమిషాలు అక్కడే నిలబడి ఇక తప్పనిసరిగా ప్రక్కఇంటికెళ్ళింది విపుల. మంచినీళ్ళు అడిగి తాగి 'తాళంచెవి ఇచ్చారా?' అని అడిగింది. 'లేదే?' అందామె. వింతగా చూస్తూ.. ప్రక్కఇంట్లో తాళంచెవి ఇచ్చిపోవటం అలవాటులేదు. అయినా ఆశకొద్దీ అడి గింది. ఆమెతోనే ఏదో పిచ్చాపాటీ మాట్లాడుతూ కూర్చుంది. గంటన్నర తర్వాత గౌరి స్కూటర్‌శబ్దం వినిపించింది. విపుల లేచి వచ్చింది.

"మమ్మీ! మేం బీచ్‌కెళ్ళాం. అక్కడ్నించి హోటల్‌కెళ్ళాం!" అంది సంబరంగా పింకీ.

విపుల మౌనంగా వంటగదిలో కెళ్ళింది. వంట పూర్తిచేసింది.

రాత్రి పదిగంటలవుతున్నా - గౌరి భోజనానికి లేవలేదు. పింకీ ఆకల్లేదని పెందరాడే నిద్రపోయింది.

"అన్నం వడ్డించనా?" అయిదోసారి అడిగింది విపుల.

అతను కనీసం తలైనా తిప్పి చూడలేదు.

"మిమ్మల్నే!"

"నా కాకలిలేదు. నన్ను విసిగించకు!"

విపుల మనసు చివుక్కుమంది.

"మిమ్మల్ని విసిగిస్తున్నానా? మీరే నన్నిట్లా రంపపుకోత పెడుతున్నారు!"

"నిజంగా నిన్నట్లా శిక్షించాలనేవుంది. కానీ.... అది నా చేతకావటం లేదు!" అన్నాడు తీవ్రంగా.

"ఏదో అనబోయింది విపుల. "ప్లీజ్ గెటవుట్!" అన్నాడు.

"వెళ్తాను.... మీ కళ్ళఎదుట వుండటం అంత కష్టంగావుంటే ఇప్పుడే వెళ్ళిపోతాను! వెళ్లేముందు ఓ ప్రశ్న అడుగుతాను. జవాబు చెప్తారా?"

"ఏవిటి?"

"నేను చేసిన తప్పేమిటి?"

"ఆ ప్రశ్న అడగటానికి సిగ్గులేదూ?"

"ఎందుకు?"

"ఎందుకా? పెళ్ళిముందు విచ్చలవిడిగా తిరిగి.... ఏమీ ఎరుగనట్లు నన్ను మోసంచేసి.... ఇప్పుడు మళ్ళీ వాడ్ని ఇంటికి రప్పించుకుని.... ఛీ!"

"ఎవరు చెప్పారు మీకివి? బదరీయేనా?"

"ఏం? నువ్వు చెప్పనంతమాత్రాన నిజాలు తెలీవా? తప్పులు దాగుతాయా?"

"నేనేతప్పు చేయలేదు. తప్పు అంటే నా దృష్టిలో - తెలిసీ కూడనిపని చెయ్యటం .... అప్పట్లో నేను తెలియక చేసిన పొరపాటు అది .... తెల్లనవన్నీ పాలు అనీ, నల్లనివి నీళ్ళని నమ్మే అమాయకత్వం నాది...."

"బరితెగించినవాళ్ళంటే నా కసహ్యం."

"ఏది బరితెగించినతన మంటారు? కట్టుకున్న భర్తని గౌరవించటం మనసా-వాచా అతనే కావాలని-అతనే లోకమని అనుకోవటం. తెగించిన తనమా? మన ఈ చిన్న సంసారం శాంతిసాగరంలా ఉండాలనుకోవటం బరి తెగించిన లక్షణమా? నీ భర్తచాటున ఎన్ని ఘాతుకాలైనా చేయొచ్చు.... అన్న నీమదికి బుద్ధిచెప్పి బైటకిగెంటటం బరితెగించినతనమా? ఏది?"

"నిన్ను నీవు సమర్థించుకోకు."

"నన్ను నేనే సమర్థించుకోవాలి. ఏ తప్పూ చేయనప్పుడు.... ఎవరికి అప చారం తలపెట్టనప్పుడు... ఎవరికీ భయపడను."

"నువ్వు చెప్పేవన్నీ నిజాలంటావా? నువ్వు పరమ సాధ్వీమణినంటావు అంతేనా?"

ఆ గొంతులోని ఎటకారం శూలంగా గుండెల్లో గుచ్చుకొంది ఉబికి వస్తున్న దుఃఖాన్ని - ఉద్రేకాన్ని - రోషాన్ని అణచుకొంది.

"మిమ్మల్ని నమ్మించాల్సిన అవసరం నాకుంది కాదు ఇవన్నీ చెప్తోంది. ఆరేళ్ల మనం కల్సివున్న దగ్గరితనం నాచేత వాగిస్తోంది. సరే .... మీరా అపో హల మైకంలోనే వుండండి. మిమ్మల్నిక నమ్మించను! విసిగించను!" వెనక్కి తిరిగి ఇవతలికి వచ్చేసింది. శౌరి చూస్తూ వుండిపోయాడు.

ఆ మరునాడు అతను లేచేసరికి - విపుల సూట్‌కేస్‌తో, పింకీని ఒళ్ళో వుంచుకుని అతనికోసమే చూస్తోంది.

"నేను వెళ్తున్నాను!" అంది.

"ఎక్కడికి?"

"ఈ ఇంట్లోనించి ఎక్కడికైనా!"

"అంటే?"

"అవి మీ కనవసరం అనుకుంటాను!"

"ఈ తలబిరుసువల్లే ఇందాకా తెచ్చుకున్నావు!"

"మీకు కలబిరుసు అన్పించొచ్చు. నాది ఇది ఆత్మవిశ్వాసం!"

శౌరికిదంతా అయోమయంగా వుంది. అతడిట్లాంటి పరిణామం వూహించలేదు. తను తిట్టినా—విసిరికొట్టినా ఇంటిని అంటిపెట్టుకుని—బయటకీడ్చినా...చూరుపట్టుకుని వదలక....'మీ పాదాలదగ్గర పడివుండనీండి....మీరు కాదంటే ఇంక నా బ్రతుకేం కాను?' అంటూ విపుల దాసోహమనటం కావాలి. రెండ్రోజులు బెట్టుగా పెడసరంగా వుంటే—తన కాళ్ళపైబడి కన్నీళ్లు కారుస్తుందనుకున్నాడు.

'విపుల వెళ్ళిపోతే....తనూ.... పింకీ.... ఈ ఇల్లు ...' అతనికొంచెం గాబరా వేసింది.

"ఇంట్లోంచి వెళ్ళిపోవటం ఎందుకు?" అన్నాడు.

"ఎందుకు వుండాలో అర్థంకాక వెళ్ళిపోతున్నాను. ఇక్కడ నాకు స్థానం లేదు. తెలిశాక ఇంకా ఇక్కడే పడిఉండటానికి మనస్కరించక వెళ్ళిపోతున్నాను?"

"జరిగిందేదో జరిగిపోయింది. ఇకనుంచి బుద్ధిగా వుంటాను. నన్ను క్షమించమని అడగొచ్చుగా?"

"అడిగితే? జరిగిందంతా మాసిపోతుందా? ఈ క్షమాపణలూ వేడికోళ్లు .. నాపై మీకున్న అపోహల్ని—నిందల్ని మాపుతాయా? అప్పుడు నేను పరమ సాధ్వీమణినౌతానా!"

"నీతో వాదించటానికి నాకు ఓపికలేదు!" అన్నాడు ముఖం గంటు పెట్టుకుని

"ఓపికలేకపోవటం కాదు. నా ప్రశ్నకు జవాబు మీదగ్గర లేదు!"

"ఈ ప్రశ్నలు....జవాబులు అనవసరం...."

"సరే!" లేచింది. సూట్ కేస్ తీసుకుంది. పింకీ చెయ్యిపట్టుకుంది.

"వెళ్ళటానికే నిశ్చయించుకున్నావా?"

"అంటే? మీ నిరాదరణని భరిస్తూ— ఇక్కడే వుంటాననుకున్నారా?"

"మరోసారి ఆలోచించు. మొగుడ్ని కాదనుకున్న స్త్రీకి సంఘంలో ఎంత విలువ వుంటుందో నీకూ తెలుసు. అహంకారంతో వెళ్ళిపోతే తర్వాత పశ్చాత్తాపపడతావు!"

అతని వైఖరి, మాటలు అతనిపట్ల మరింత విముఖత్వాన్ని కల్గించినయ్.

'విపులా! నేనే తొందరపడ్డాను. తెలిసీ తెలియని వయసులో ఎన్నో పొరపాట్లు చేస్తాడు మనిషి. ఏ బలహీనతలూ లేనివాడు దేవుడేకాని మనిషి కాడు. నాలో మాత్రం బలహీనతలు లేవా? నిన్ను అర్థంచేసుకోగలను. నాకోసం.... పింకీకోసం మనసు మార్చుకో. నువ్వులేని ఇల్లు కళాకాంతులుండవు. నన్ను విడిచి



పోకు!' అంటూ ప్రాధేయపడక పోగా బెదిరిస్తున్నాడు. అకారణంగా అనుమానించి అవమానించింది అతను. నిజానిజాలు తెల్సుకోకుండా తనతో జీవితాంతం తోడూ-నీడగా నిలిచి కష్టసుఖాల్లో పాలుపంచుకునే అర్ధాంగిని అనరానిమాటలన్నాడు. తను క్షమాపణ చెప్పవల్సిందిపోయి తను చెప్పాలిట! పైగా అతను లేకపోతే తనకు గౌరవమూ, జీవితమే లేదని ఎంత ధీమాగా అంటున్నాడు!

అతనితో పెళ్ళికాకముందు తను జీవించిలేదా? అతనిచేత మెళ్ళో మూడు ముళ్ళు వేయించుకున్నంతమాత్రాన తనకు జీవితమే లేకుండా పోవాలా? అతనెంత అవమానించినా–తిట్టినా–బెదిరించినా ఇదే జీవితం అనుకోవాలా?' విష్ణి. హృదయం భగభగా మండసాగింది. అతనితో మరొక్కమాట కూడా మాట్లాడా లన్పించలేదు. మౌనంగా వీధిగుమ్మంవైపు నడవసాగింది.

శౌరి ఆ తిరస్కారంతో-రెచ్చిపోయి ఆగ్రహంతో వళ్ళుమరిచిపోయాడు. గబగబా విష్ణలదగ్గరికి నడిచి పింకీని చెయ్యిపట్టి తనవైపు లాక్కున్నాడు.

"పింకీ ఇక్కడే వుంటుంది!" అన్నాడు.

"ఇది చాలా అన్యాయం!"

"నువ్వు చేసిన అన్యాయంకంటేనా?"

"తల్లినించి బిడ్డను వేరుచేస్తారా?"

"తల్లికంటే.... తండ్రి అవసరమే పిల్లలకెక్కువ."

'శౌరీ.... ఎంత కఠినంగా ప్రవర్తిస్తున్నావు! ఇప్పటికీ నాకు నమ్మశక్యం కావటంలేదు!"

"నన్నిట్లా మార్చింది మీరే!"

"ఔను.... మీలో వచ్చే ప్రతి మార్పుకి కారణం నేనే. అట్లా అనుకుంటే మీకు తృప్తి.... మీ కాళ్ళుపట్టుకుని నేను చేసింది తప్పే అని ఒప్పుకుంటే మీ కానందం. అవునా?"

"అవునేమో!"

"పింకీని నాతో రానివ్వండి. అది బెంగపెట్టుకుంటుంది. ఆడపిల్లకి తల్లి అవసరమే ఎక్కువ."

"పింకీ.... కావాలనుకుంటే.... జరిగినదానికి క్షమాపణ చెప్పి ఇక్కడే వుండిపోవచ్చు."

పింకీ తండ్రిమెడనుచుట్టి ఇద్దరివంకా అయోమయంగా చూస్తోంది.

విపుల మనసు రగిలిపోతోంది. 'ఎంత నిర్దయ. బాస్ని ఎరగా చూపి... తన ఆత్మాభిమానాన్ని అణగగొట్టి అతని పాదాక్రాంతం చేసుకోవాలని ఎంత తపన!"

"ఇదేనా మీ నిర్ణయం?

"ఆ ప్రశ్న నేను అడుగుతున్నాను!"

చాచి చెంపకేసి కొట్టాలన్నంత ఆగ్రహాన్ని ఎట్లాగో నిగ్రహించుకుని గిరుక్కున వెనక్కితిరిగి చరచరా బయటకొచ్చింది. వెనకనించి పింకీ 'అమ్మా!' అని పిలుస్తున్నా లక్ష్యపెట్టలేదు.

'ఆదినించి మగాడు స్త్రీలోని ఈ బలహీనతనే ఆసరా చేసుకుని స్త్రీని తన గుప్పెట్లో పెట్టుకుని నిస్సహాయురాల్ని చేస్తున్నాడు. మమతకు, కరుణకు ప్రతిరూపమైన స్త్రీ ఈ అనుబంధాన్ని జయించలేక – తనలోని వ్యతిరేకమైన భావాల్ని చంపుకుని పురుషుడికి దాసోహమంటోంది. దీన్ని జయించగల్గితే.... ఎంతో విశాలప్రపంచం.... పట్టుదల– ఉత్సాహం వుంటే.... ఎన్నో అవకాశాలు....ఇల్లు సంసారం, మొగుడు, పిల్లలు.... ఇదే లోకమని.... జన్మకు సార్థకమనీ....ఇవి తప్ప స్త్రీకి వేరే గత్యంతరం లేదనీ భావించుకుని బలంగా నమ్మకాన్ని పెంచుకోవటంవల్ల ఎంత కష్టమైనా– నరకమైనా.... జీవచ్ఛవంలా సంసారాన్ని అంటిపెట్టుకుని బ్రతకాలనుకుంటుంది స్త్రీ. ఆ బంధనావలయం దాటి–మనసుని వేరే వ్యాపకాలపై మళ్ళిస్తే నిజమైన జీవితసార్థక్యం ఏమిటో తెలుస్తుంది. ఎందరో సంఘసేవికలు, దయామూర్తులు, త్యాగధనులు తయారవుతారు. మానవసేవలో, బాధిత, పీడిత జనావళి సేవలో ఆత్మతృప్తిని పొందగలుగుతారు. అప్పుడే ఈ లోకంలో మానవతాదృక్పథం పెరిగి దారుణాలు, హింసాప్రవృత్తి, తగ్గుముఖం పడ్తాయి. తను ఆ ఎత్తుకు ఎదగాలి....' కళ్ళనించి జారిపడ్తున్న అశ్రువుల్ని తుడుచుకుని....దూరమౌతున్న విశాఖని చూస్తూ దృఢంగా అనుకుంది విపుల. ✕



# మీపిల్లల్ని ఇంతేనా...

'కిషోర్'

ఆందోళన —

కంగారు —

చిరాకు —

సత్యమూర్తికి —

ఆలోచనల్లో తల్లి, తల్లితోపాటు ఇంకా రాని బస్సు....

సత్యమూర్తి బస్సెక్కి చాలా రోజులైంది. మూడేళ్ళపైనే అవుతుంది. మళ్ళీ ఇప్పుడు.... తణుకు.

వాడు పదేళ్ళప్పుడు తాడేపల్లిగూడెం మేనమామగారింటికి వచ్చాడు చదువుకునేందుకని— కూలిపని చేసుకునే తల్లిని విడిచి. తను వచ్చేడనే కంటే తల్లే పంపించిందని చెప్పడం సబబు. అయితే పెళ్ళాంచాటున చవటలా బతికే మేనమామ పెళ్ళాం సలహాతో సత్యమూర్తిని— చదువు చెప్పించే వంకనే అయినా— ఒక పనికుర్రాడిలా తీసుకొచ్చాడు. ఆ ఇంటి చాకిరీ అంతా వాడే చేయాలి. అయినా చదువుమీద పట్టుదలతో తల్లిని పెద్దయి సుఖపెట్టాలనే తాపత్రయంతో స్కూలుకి విడవకుండా వెడుతూ ఆ ఇంటిచాకిరీ అంతా వాడే చేస్తున్నాడు.

'తణుకె'ళ్ళి మూడేళ్ళయినా ఆ వూరు ఎలావుందో అన్న ఆలోచనే లేదు.... తల్లి ఎలావుందో అన్న ఆలోచనే.... ఆ ఆలోచన ఇందాక తణుకు నుంచి— తమ గుడిసె ప్రక్క గుడిసెలో ఉంటున్న సర్విగాడొచ్చినప్పట్నుంచి. ఆ సర్విగాడు అక్కడ్నుంచి ఊరికే రాలేదు. 'మీ అమ్మ ఆరోగ్యం ఏమాత్రం బావుండ లేదు — చావుకి దగ్గర్లో ఉంది' అన్న దుర్వార్త మోసుకుని మరీ వచ్చాడు. ఆ వార్త విన్న వెంటనే హోంవర్కు చేసు

కుంటున్నవాడల్లా టక్కున లేచి అత్తయ్య దగ్గరకెళ్ళి తల్లి దగ్గరకెడతానని చెప్పాడు.

ఆవిడ వాడివంక చూసింది.

"ఇంతరాత్రి ఎక్కడికి వెడతావ్— మీ మామయ్యకూడా లేడు" అని కసురుకుంది.

ముందు కాస్త తటపటాయించాడు. కాని తల్లిని చూడాలన్న కోరిక వాడొక్క చోట నిలబడనివ్వలేదు. [?]

మళ్ళీ అత్తయ్యదగ్గర కెళ్ళి-

"నే నిప్పుడే వెళ్తాను" నిశ్చయంగా చెప్పాడు. బహుశా వాడు మేనమామ ఇంటికి వచ్చిన తర్వాత ఇదేనేమో మొదటిసారి అంత ఖచ్చితంగా మాట్లాడింది.

ఆవిడ ముందు ఆశ్చర్యపోయింది— 'వీడికింత తెగింపు ఎలా వచ్చిందా' అని. ఏమనుకుందో -

"డబ్బులున్నాయా?" అని అడిగింది.

'నాదగ్గరెక్కడివి?' అనలేదు. ఆవిడికి మరీ కోపం తెప్పించటం వాడికిష్టంలేదు.

తల అడ్డంగా ఊపాడు.

"నా దగ్గర రూపాయ్ ఉంది. వెళ్ళ డానికి సరిపోతుందిలే.... వచ్చేటప్పుడు మీ అమ్మనడిగి తెచ్చుకో...."

అలాగే అని ఆ రూపాయి తీసుకుని కళ్ళకద్దుకుని మరీ బస్టాండుకు వచ్చాడు.

బస్టాండుకి వాడొచ్చాడు కాని —

తణుకువెళ్ళే బస్సుమాత్రం లేదు.

ఎవర్నో అడిగితే 'పాసింజర్ బస్సుంది, రావాలి' అన్నాడు.

ఆమాట విని అరగంటైంది.

అయినా ఆ బస్సు రాలేదు.

జారిపోతున్న నిక్కరుని పైకి లాక్కున్నాడు. జేబులో ఉన్న రూపాయి జాగ్రత్తగా ఉందో లేదో చూసుకున్నాడు.

అంతలో అక్కడున్న వాళ్ళల్లో కదలిక!

'బస్సు వస్తోందన్నమాట — తణుకెళ్ళేసరికి పది దాటిపోతుందేమో' అనుకున్నాడు.

అసలే పెద్దవైన కళ్ళని మరీ పెద్దవి చేసుకుని చూశాడు. ఆ వచ్చేది తణుకు వెళ్ళే బస్సే!

రోగాలతో బాధపడుతున్న మనిషిలా వచ్చిందా బస్సు.

బస్సు ఆగగానే జనం తోసుకుంటూ..

'వీళ్ళంతా 'క్యూ' ఎందుకు పాటించరో' అనుకున్నాడు తన క్లాసు పుస్తకాలలో చదువుకున్నది జ్ఞాపకం వచ్చి.

వాడికి తెలీదు - వాళ్ళలో చదువుకోని వాళ్ళు చాలామంది ఉన్నారని. అంతేకాదు చదువుకున్న మూర్ఖులు కూడా ఉన్నారని.

తోసుకుని తొక్కుకుని - ఉన్నదే తక్కువమందే అయినా జనం బస్సు ఎక్కారు.

తనూ చివరగా ఎక్కాడు.

కాస్త ముందు కెళ్ళాడు. సీటు ఎక్కడా ఖాళీగా లేదు. కడ్డీ పట్టుకు



నిలబడ్డాడు. ఓ చేత్తో నిక్కరు జేబుకూడా జాగ్రత్తగా పట్టుకున్నాడు - రూపాయి పడిపోతుందేమో అన్న భయాన్ని మనసునుండి అరచేతివరకు పాకించి.

ఆ రూపాయికెంత విలువుందో వాడికి తెలుసు — అదే తనని తన తల్లిదగ్గరకు చేర్చేది.

బస్సు నడుస్తోంది.

కండక్టర్ తన డ్యూటీలో....

డబ్బులు తీసుకుంటూ ... టికట్లు పంచ్ చేస్తూ .... కొంతమందికి చిల్లర ఇస్తూ.... కొంతమందికి ఇవ్వక....

బస్సు ఆగింది - అది స్టేజీకాదు— ఊరుచివర — బస్సులోని పాసింజర్లు అందరికీ టికెట్లు ఇవ్వనిదే అక్కడ్నుండి కదల్డానికి వీలు లేదు.

"టికెట్లు అందరూ తీసుకోవాలి .... ముందు చెకింగ్ వుంది.... టికెట్లుకూడా జాగ్రత్తగా ఉంచుకోవాలి...." కండక్టర్ అరుస్తూ ముందుకొస్తున్నాడు.

"తణుక్కి ఓ అరటికెట్ ఇవ్వండి" రూపాయి కండక్టర్ చేతిలో పెట్టాడు.

"అరటికెట్టా!" వాడి వయసును అంచనావేస్తూ అడిగాడు.

"అవునండి...."

"ఎన్నేళ్ళు"

"పద్నాలుగు"

"పద్నాలుగా!" రెట్టించాడు.

"అవునండి."

"అయితే ఇంకా రెండ్రెళ్ళ పైనలివ్వు - నీకు ఫుల్ టికెట్."

"ఫుల్లా!" కంగారుపడ్డాడు.

"అవును- పన్నెండు దాటితే ఫుల్లే" విసుగ్గా అన్నాడు కండక్టర్ చిల్లర ఇమ్మన్నట్లుగా.

సత్యమూర్తికి ఏంతోచలేదు. జేబులో ఇంకొక్క పైసా కూడా లేదు. ఇప్పుడెలా!"

అత్తయ్యమీద విపరీతమైన కోపం వచ్చింది. ఏం చేయగలడు. ఇప్పుడేం చేయాలో అర్థం కావటంలేదు. చావు బతుకుల్లో ఉన్న తల్లి జ్ఞాపకం వస్తోంది.

"డబ్బుల్లేవండీ ...." దీనంగా అన్నాడు.

కండక్టర్‌కేం జాలి కలగలేదు. అతని కిటువంటివన్నీ మామూలే. రూపాయి వెనక్కి ఇచ్చేస్తూ - "డబ్బుల్లేకపోతే దిగి వెనక్కెళ్ళు" అని ముందుకు నడిచాడు .... మిగిలినవాళ్ళకి టికెట్లు ఇవ్వడానికి.

సత్యమూర్తి పరిస్థితి అయోమయం!..

అందరికీ టికెట్స్ ఇవ్వడం అయ్యాక సీట్లో కూర్చోబోతున్న కండక్టర్‌కి 'కుర్రాడి సంగతి' జ్ఞాపకమొచ్చింది.

"ఇంకా నిలబడి ఉన్నావేంటి?" అన్నాడు. అలా అడగటంతో సత్యమూర్తి బస్సులో ఉన్న చాలామందిని ఆకర్షించాడు.

సత్యమూర్తిని ఇందాకట్నుంచి గమనిస్తున్న ఓ పాసింజర్-

"కుర్రాడే కదా పోనీండి అరటికెట్ ఇచ్చేయండి" అన్నాడు.

"మామూలుగా అయితే ఇచ్చేవాణ్ణే- పైన చెకింగ్ ఉందని తెల్సింది."

"చెకింగ్‌కి వచ్చినప్పుడు అడిగితే 'పన్నెండేళ్ళు' అని చెప్పమనండి" మళ్ళీ ఆ పాసింజరే అన్నాడు.

"సరే! ఇదిగో అబ్బాయ్. నీకు టికెట్ ఇస్తానుగాని ఎవరైనా అడిగితే 'పన్నెండేళ్ళు' అని చెప్పాలి. సరేనా" అన్నాడు కండక్టర్.

"అలాగేనండి- అలాగే చెప్తా" అని ఆనందంగా తల ఊపలేదు.

---

"నేను చెప్పనండి" అన్నాడు.

"ఏం!"

"నాకు పద్నాలుగైతే పన్నెండని ఎందుకు చెప్పాలి"

"నీ దగ్గర డబ్బుల్లేవుగా అందుకని"

"నే నబద్ధం ఆడను" చాలా నిక్కచ్చిగా చెప్పాడు సత్యమూర్తి.

"అబ్బ! ఓగాడండి సత్యమూర్తి




శ్చంద్రుడు" ఓ పాసింజర్ హేళనగా అన్నాడు.

ఆ మాటకి బాధ కలిగింది వాడికి— అతనివైపు సూటిగా చూశాడు. 'నేను సత్యహరిశ్చంద్రుణ్ని కాదుగాని నా పేరు సత్యమూర్తి' అని చెప్పాలనిపించింది. కాని చెప్పలేదు.

"ఇదిగో అబ్బాయ్ చిన్నబద్ధం ఆడవయ్యా! శుభ్రంగా నువ్వు తణుకెళ్ళిపోవచ్చు లేకపోతే ఇక్కడే దిగి ఈ చీకట్లో వెనక్కి వెళ్ళాలి" ఓ 'ఖద్దరు చొక్కా'వాణ్ని బెదిరించి అబద్ధమాడించాలనుకుంది.

వాడికి వెనక్కి వెళ్ళడానికి బాధలేదు. 'తల్లిని తొందరగా చూడాలన్న కోరిక తీరదా' అని బాధ.... కాని సత్యహరిశ్చంద్రుడి కథ, గాంధీ జీవిత చరిత్ర చదువుకున్న వాడు జీవితంలో అబద్ధం ఆడకుండా బతకాలని ఎప్పుడో నిశ్చయించుకున్నాడు— తల్లి మీద ఒట్టువేసుకున్నాడు. అందుకే అబద్ధం ఆడటం ఇష్టంలేదు.

"ఏరా ఏంటి గొడవ.... ఆలస్యమవుతోంది" డ్రైవరు చిరాకుపడుతూ కండక్టర్ని కంగారుపెట్టాడు.

"ఇదిగో అబ్బాయ్ నువ్వుదిగు, బస్సు వెళ్తోంది" కండక్టరుకి మహా కోపంగా ఉంది. 'అరే పోనీలే కుర్రాడు— డబ్బుల్లేవు' అని ఓ చిన్న అబద్ధం ఆడమంటే 'అబ్బే' అంటాడా.... ఇదంతా తనకోసమా.... వాడికోసమా.... అని కోపంగా ఉన్నాడు.

"అక్కర్లేదు అలాగే చెప్పాల్లేండి — ఎవరైనా వస్తే...." అన్నాడు ఆ ఖద్దరు వాలా.

"క్షమించండి.... నేను చెప్పను...."

నలుగురయిదుగురు పాసింజర్లు వాడికి నచ్చచెప్పడానికి ప్రయత్నించారు కాని వాడు వినలేదు.

"బాబూ నీకో నమస్కారం! నువ్వు

అబద్ధం చెప్పనక్కర్లేదు గాని బస్సు దిగుతావా" కండక్టర్‌లో సహనం చచ్చిపోయింది.

కాని వాడు బస్సు దిగలేదు.

వాడి మెదడులో ఏదో ఆలోచన.

"రూపాయ్ టికట్ ఇవ్వండి. ఎంత వరకూ అయితే అంతవరకు."

"సరే 'దువ్వ'లో దిగు అని కండెక్టర్ టికెట్ ఇచ్చి 'రైట్' చెప్పి వెళ్ళి తన సీట్లో కూర్చున్నాడు – హాయిగా. అతనికి 'వెధవ గొడవ' వదిలినందుకు కాస్త చిరాకు తగ్గింది.

సత్యమూర్తి మూర్ఖత్వానికి కొంత మంది నవ్వుతున్నారు. వానిచేత అబద్ధం చెప్పించలేనందుకు కొంతమంది అవమానం పొందయ్యారు.

ఓ పదిహేను నిమిషాల అనంతరం–

బస్సు 'దువ్వ'లో ఆగింది. కొంత మంది దిగారు.

సత్యమూర్తి కూడా బస్సు దిగడానికి కదిలాడు.

అందులో ఎవరో అన్నారు–

"సత్యహరిశ్చంద్రుడి తమ్ముడు దిగుతున్నాడ్రోయ్!"

వాడు వెనక్కి తిరిగాడు–

"అయ్యా నన్నేమన్నా బాధపడను. మాకు చదువుచెప్పే గురువులు అసత్య మాడరాదని చెప్తుంటారు. మీరేమో ఇక్కడ కేవలం డెబ్బై పైసలు కోసం నన్ను అబద్ధమాడమన్నారు. మీ ఇంట్లో పిల్లలను కూడా ఇలానే ప్రోత్సహిస్తూంటారా?"

ఛెళ్ళున కొరడాతో కొట్టినట్లనిపించి ఉలిక్కిపడ్డారు. ఇందాక వాడితో అబద్ధం చెప్పించడానికి ప్రయత్నించినవాళ్ళు.

అలా సూటిగా ప్రశ్నించి వాళ్ళ సమాధానం కోసంగాని నిశ్శబ్దమైన వాళ్ళే చూస్తున్న ముఖాలనుగాని వాడు చూడలేదు. బస్సు దిగాడు.

బస్సులో ఓ మూల కూర్చుని నిర్లిప్తంగా గమనిస్తున్న ఓ వ్యక్తికి ఆ కుర్రాడిని చూస్తే బాధ కలిగింది.

'ఆ కుర్రాడికెంత అవసరమో తనుకు వెళ్ళడం. మరిక్కడ దిగుతున్నాడు. ఇక్కడ్నుంచి ఎలా వెళ్తాడో' అనుకున్నాడు. అంతలోనే అతనికి 'బస్సులో వాళ్ళు ఎంత తప్పు చేశారో' అని అనిపించింది. గబుక్కున జేబులో చెయ్యి పెట్టాడు ఖాళీ జేబు వెక్కిరించింది.

'హుం.... తనూ అంతే.... టికెట్‌కి సరిపడా డబ్బులున్నాయి కాకపోతే అవి టికెట్ రూపంలోకి మారిపోయాయి.'

అదేకాదు ఇంకోటి కూడా అనుకున్నాడు.

'బస్సులో వాళ్ళంతా అతనిచేత బలవంతంగానైనా అబద్ధమాడించడానికి ప్రయత్నం చేశారు కాని .... అతనికి మిగిలిన డెబ్భైపైసలు ఇచ్చి పుల్ టికెట్ తీయించే ప్రయత్నం మాత్రం చేశారుకారు– తలో అయిదు పైసలిచ్చినా

సరిపోయేది, ఎంత దారుణం! ఒక ఆశయం కోసం కష్టానికైనా సిద్ధపడిన మనిషికి– అందులోనూ ఓ కుర్రవాడికి – తోడ్పాటు నివ్వవలసిందిపోయి అతన్ని తిరోగమనం పట్టించడానికి ప్రయత్నం! ఎంత అమానుషత్వం!"....

బస్సుదిగి వెళ్ళిపోతున్న 'సత్యమూర్తి'ని చూస్తుండిపోయాడు ఆ నిరుద్యోగి పాసింజర్.

బస్సు ముందుకు కదిలింది–అన్యాయం న్యాయాన్ని తాత్కాలికంగా జయించినట్లు.

ఓటర్ని నట్టేట ముంచేసి వెళ్ళిపోయే రాజకీయ నాయకుడిలా వెళ్ళిపోతోంది బస్సు.

కాని—

సత్యమూర్తి మాత్రం....

అంత చీకటిలో.... ఒక్కడూ....

మానవత్వాన్ని మరచిపోయి దానవత్వం మత్తులో జోగుతున్న వ్యవస్థ గుండెలమీంచి నడుస్తున్న వాడిలా వెళ్తున్నాడు.

గాంధీగారి చేతికర్రని ఓ చివర తనూ పట్టుకుని ఆయన్ని నడిపించిన కుర్రాడిలా నడుస్తున్నాడు.

"అమ్మ ఎలా వుందో...."

తల్లి ఆలోచన వాడిని వదలటంలేదు.

ఇంకా ఏడెనిమిది కిలోమీటర్లు నడవాలి, అప్పుడుగాని తల్లిని తన కళ్ళతో చూసుకోలేదు.

అంతలో....

గాంధీ, హరిశ్చంద్రుడు జ్ఞాపకం వచ్చారు.

వాళ్ళ జీవితాలలో ఎన్ని చేదు అనుభవాలు...., కష్టాలు.... నష్టాలు....

తన కష్టం ఒక లెఖ్ఖా....

ఆ ఆలోచన తృప్తి నిచ్చింది.

ఆ తృప్తితోనే వాడు ముందుకు నడుస్తున్నాడు—

— కుళ్ళు కుసిద్ధం అమానుషత్వం, అరాచకత్వం అన్యాయం అక్రమం నీతిరాహిత్యంతో నలిగిపోతున్న వర్తమానం చీకటిలోంచి దేదీప్యమానంగా వెలుగుతుందనుకునే భవిష్యత్‌లోకి ఆశతో నడిచే ఋషిలా.





# వలస

దివాకర్

"అయ్యోరయ్యోరొత్తుంద్రు, లే రాగొద్ద కొడకా!"

"చూశ్నేదులే మావా! లేత్తిఏగా!"

"దండాలండయ్యోరూ! దండాలయ్యా!"

"చిరంజీవ! సుఖీభవ!"

సుందరరామసిద్ధాంతులవారు తమ అరుదశాబ్దాల జీవితంలో ఆశీర్వదించటమే తప్ప ప్రతినమస్కారం ఎరుగరు.

తోకపల్లెల్లో తరతరాలనుండే స్థిర నివాసం. తూర్పున నల్లకొండలు. తూర్పునుండి ఉత్తరదిశాభిముఖంగా తిరిగి పడమటికి పారే కుముద్వతీ నదీతీరం. ఎక్కడా బీడులేని బంగారుపండే మాగాణం. ఎన్నడో తుళువంశ రాజులు వైదికబ్రాహ్మలకిచ్చిన అగ్రహారం తోకపల్లె.

జ్యోతిష సిద్ధాంతులకూ, పంచాంగ కర్తలకూ, పౌరోహితులకు సామూహికానుభోగానికై ధారాదత్తం చేయబడిన గ్రామం; కొండకోనల్లో అందంగా నిలచిన పల్లె అది!

అవే యిళ్ళు! అవే పొలాలు! అవే పరసలూ మర్యాదలు!

మనుషుల ఆకారాల్లోగానీ, మాటల్లో గానీ తేడా రాలేదు. ఊళ్ళోకి అంతగా బస్తీ నాగరికత తలదూర్చలేదు

అయినా కాలం మారుతూ తన ప్రభావాన్ని ప్రసరించే గుణం మానుకోలేదు. ఆ పరిణామం తోకపల్లె మీదా ప్రసరించసాగింది!

ఊరేమీ మారదలచుకోలేదు! జనమూ మారదలచలేదు.

కానీ జనం మనస్సులలో మార్పు ప్రవర్తనలో మార్పు వచ్చేస్తూంది. రాజులూ రాజ్యాలూ పోయాయి! జమీందారీలూ ఇనాములూ అంతరించాయి. అగ్రహారాలూ హరించుకుపోయాయి! తెల్లదొరల పరిపాలన తొంగిచూచింది, ఇంగ్లీషునీ, కాఫీనీ పల్లెలకి దిగుమతి చేసింది.

తోకపల్లె ఒకానొకనాడు అగ్రహారం!

ఆ ఊళ్ళో హొలాలన్నీ వైదికులవే. అయితే బాపనపేద్యమైపోయింది. బొట్రలు పెంచుకున్న ఛాందస వైదికుల పోషరికనానికి భేషజాలకి హొలాలు, హలాలు గలవారి బలాలకు దళులయాయి.

నేతులమూతులు తుడుచుకున్నచోట చేతులుచాచి యాచించను మనసురాక చిన్నగా, సన్నబడ్డ విప్రకుటుంబాలు తరలిపోయాయి కొన్ని. కన్న ఊరునీ ఉన్న లంకంత కొంపనీ వదలుకోలేకా, యాచనాదైన్యం ప్రకటించుకోనూలేక, గుంభనగా ఆకలితో అలమటించి భవనాలనే సమాధులుగా చేసుకున్నారు కొందరు.

హొలాలు పోయాక, కొంపలు కూలాక, బ్రతుకు తెరువుకోసం బద్ధకం వదలుకోక తప్పనిసరై నడుంవంచిన ఒకే ఒక కుటుంబం కోకపల్లెలో సిద్ధాంతుల వారిదే. ఆ మొత్తంపల్లెకు, కరెంటు కూడా వచ్చిన కొత్తకాలానికి ఒకే ఒక వైదికకుటుంబం మిగిలిపోయింది. ఆ కుటుంబానికి పెద్దదిక్కుగా సుందర్రామ సిద్ధాంతి మిగిలాడు.

రైతులు కొత్త మిద్దెలు కట్టుకోక పోయినా ఉన్న మిద్దెలనే బాగుచేసుకున్నారు. సుందరంగా అలంకరించుకున్నారు. కరెంటు వేసుకున్నారు.

ఊరిబయట మాలవాడలో కొన్ని నిరుపేద కుటీరాలకూ, ఊరిమధ్య సిద్ధాంతులవారి యింటికి మాత్రమే కరెంటు నోచుకోలేదు.

సిద్ధాంతులవారిల్లు కూడా ఒకానొకనాటి పాతవైభవాన్ని తలపిస్తూ మొగసాల అరుగులతో, నగిషీలు చెక్కిన పెద్దపెద్ద స్తంభాలతో, ద్వారబంధాలతో, ఎర్రమట్టి పట్టెలతో, గంభీరంగా అపుపిస్తూనే ఉన్నా, దానికి శతాబ్దాల వార్ధక్యం వచ్చిందని చూడగానే తెలిపేలా అరుగులు కూలుతూ, స్తంభాలు పేదులేస్తూ అవుపించసాగాయి.

లంకంత భవనంలో ఓనీదంత బలగం. అందరూ దిట్టంగా పీకలదాకా లాగే వయసువారే. తలచెడిన అక్కగారూ, వదినలూ కూడా. వారి బడుద్దాయి సంతానమూ; మునలావిడ తల్లి; సిద్ధాంతులవారి సంతానమ్ అధికం. ఆయన కున్న అష్టసంతానంలో ఒకడే కుమారుడు; ఎదిగిన ఆడపిల్లలప్పటికే నలుగురున్నారు.

సంవత్సరం పొడుగునా ఉండే వైదీకమూ; ఎంతమంది వ్రతాలూ, నోములూ ఎల్లవేళలా చేసుకుంటూ ఉంటారు; తన కడుపు నిండేందుకీ, ఇల్లు గడిచేందుకీ ప్రతిరోజూ ఎవరింట్లోనూ ఏదో శ్రాద్ధమో, బిపసాలో, వివాహాలో జరుగాలనుకునే అవివేకి కాదు సిద్ధాంతి;

అందుకే ఎంత ఎగసేసి గసపెట్టి రెండుచేతులా ఆర్జిస్తూనే ఉన్నట్లు కనిపించినా ఒక్కోమారు ఓ చిటికెడు

నశ్యానికి పదిపైసలు రొమ్మిన ఉండని దినాలే జాస్తి.

ఎంత కష్టపడ్డా దూడనోటికి గడ్డి అందించినట్లులా ఇంటిల్లిపాది రెండు పూట్లా తిండికే అరకొరగా సరిపోయేది.

కోకపల్లెలో సిద్ధాంతులవారు జీవితం కోసం పరుగులెత్తటమే సరిపోయేదిగా కనిపించేది ఎవరికైనా!

చుట్టుప్రక్కల ఎక్కడ ఏ విధమైన శ్రౌతస్మార్త కార్యాలు జరిగినా, దేవాలయ ప్రతిష్ఠాదికార్యాలు జరిగినా, ఏ యజ్ఞమో, అలాంటిదో ఏది జరిగినా జరపాలన్నా ముహూర్త నిర్ణయం మొదలు పూర్తి నిర్వహించే వరకూ సిద్ధాంతులవారుండాల్సిందే.

అయినా తీరా సంభావనవద్దో, దాన ధర్మాదులవద్దో సిద్ధాంతులవారు చాలా మొహమాటం వెలిబుచ్చేవాడు కావటం వల్ల, అది అలుసుగా తీసుకొని వారి కుదాళక్తివి పొగిడి చేతిలో ఏదో కాస్త తగలేసేవారు. అదే పదివేలుగా భావించి దొరికిన కాసిన్ని బియ్యం బేళ్ళా బత్తెంతోనే యింటికి చేరేవాడు!

ఏళ్ళు గడిచేకొలదీ, పెరటివైపుమండి యిల్లు పడిపోతూ వచ్చేకొలదీ, ముందు ముందుకు జరిగి చివరకు అరుగులకు తడికలు కట్టుకుని నివసించసాగారు సిద్ధాంతులవారు.

పడిపోయిన భాగాన్ని సరిచేసుకునే స్తోమత యేదీ!

గడచిపోయిన కాలం ఎలా సాగిందీ! సిద్ధాంతులవారికి అదే ప్రశ్న. ఆ ప్రశ్న వేసుకున్నపుడల్లా ఒక సంఘటన గుర్తు వచ్చేది ఆయనకి!

బాగా చిన్నతనం. బహుశా తనకి పదిపదిరెండేళ్ళ వయసు! పెరట్లో పెద్ద బాదం చెట్టు ఉండేది బావి ప్రక్కగానే. అల్లంతదూరాన ఓ పసుల కొట్టంకూడా. ఒకమారు గాలివానా రావటంతో అంత లావు బాదంచెట్టూ పెళపెళమని విరిగి కూలింది.

బావిచుట్టూ గోడలు కూలిపట్టమే కాకుండా అవులమంచిన కొట్టమూ నేల కరిచింది. అవులెట్లో బ్రతికి బయట పడ్డాయి.

"ఒరేయ్! పెద్దన్నా! ఆ బావీ, కొట్టం సంగతి కాస్త చూడరా!" అంటూ సిద్ధాంతులవారి తండ్రిగారు ఆదేశించారు పెద్దన్నని.

ఆ పెద్దన్న ఆ గ్రామంలో అనాటికి ధనిక భూస్వామిగా పేరున్న పెద్దిరెడ్డి గారు. అయినా తన తండ్రికి 'ఒరేయ్ పెద్దన్నే!'

"అల్లాగేనండయ్యవారూ!" అని గంగిరెద్దులా వినయంగా తలూపి, ఆ తర్వాత రెండ్రోజుల్లోనే బాగుచేయించాడు పెద్దన్న.

తన యజమానధర్మం పరిపాలనాధికారం చేపట్టిన తొలిదినాలల్లో కూడా తన







తండ్రిమాట కిచ్చినంత విలువే యిచ్చేవారు. ఆనాటికి తనది చాలా యౌవన ప్రాయం; ఇంత అనుభవమైనా పాండిత్యమైనా లేదు ఎందులోనూ.

ఈనాడేమయింది? తనకు వయసుతో పాటు, అనుభవమూ తెలివితేటలూ పెరిగాయి. తనలోని పెద్దరికం అచ్చుపోసినట్లుగా అందరికీ అవుపిస్తూనే ఉంది.

మరి ఈనాడే రైతునీ, కాస్త బాగా దబ్బుస్థండిలం ఉన్న ఆసామినీ పిలిచి ఇల్లు కూలిపోతున్న సంగతి గురించి అడిగితే ఏమంటున్నారు?

"అంత శ్రమెందుకు సామీ; రిపేరీ కమ్ ఖర్చుతో కొత్తయిల్లే ఏసుకోవచ్చు! ధరకిచ్చి వేయండి? మరోయిల్లు అందంగా కట్టుకోవచ్చు" అన్నారు కొందరు.

"ఫలానా కల్లంలో కాస్త స్థలం యిస్తా నయ్యవారూ; అక్కడో చిన్న మిద్దె వేసుకుందురుగానీ, యిది నాకిచ్చేయండి" అన్నారింకొందరు;

"వర్లేండయ్యవారూ; మనుషుల్ని పంపిస్తాం; కట్టించిస్తాం; మీరు కట్టుకోండి; పైకం మేం చూస్తాంలెండి" వంటి మాటలు ఉదారంగా యెవరూ అనటంలేదు.

సిద్ధాంతులవారిలో ఏ లోపమూ లేదు. తాత తండ్రులు బ్రతికున్నవాళ్ళలో ఏ ఆచారం, నియమం, నీతి కట్టుబాట్లతో మెలిగాడో ఈనాటికీ అదేపద్ధతి ఆయనది నిత్యకృత్యాలలో కానీ కట్టుబాట్లలో కానీ అవగింజంత మార్పులేదు. అదే గంభీరాకారం; అదే విశాలమైన నుదురూ. విభూతిరేఖలూ, చెవులకు బంగారు కుండలాలు. గోష్పాదమంత పిలకా. మెడలో రుద్రాక్షమాలలు. నొసట కుంకుమబొట్టూ, వెడల్పయిన కాళ్ళూ. పెద్ద చెవులూ, బలిష్ఠమైన భుజదండాలూ, చేతులకు తామ్రకడియాలు. అజాను

బాహంవు, స్ఫురద్రూపం చూడగానే ఎవరైనా నమస్కారం చేయాలనిపించే ఠీవి. చేతిలో ఓ పొన్నుకర్ర. కాళ్ళకి చమడాలు. నడుస్తూన్నా, కూచున్నా, మాటాడినా అదో గాంభీర్యం.

ఆనాడూ అదే! ఇప్పటికీ అదే. ఆకృతిలోనూ, ప్రవృత్తిలోనూ.

అయినా కూలుతోన్న యిల్లు కప్పుకో లేకపోతున్నాడు.

ఎదిగివున్న అమ్మాయిలకి పెళ్ళిళ్ళు చేయలేకపోతున్నాడు.

ఆదాయం లేదా? ఎక్కడుందని? ఎంత వుంటుందని? వచ్చేదంతా భుక్తికే సరిపోయెనే.

తనలో మార్పేమీ రాలేదు. మరి పల్లె జనంలో ఏమిటీ మార్పు? ఎందుకీమార్పు? అదే సిద్ధాంతులవారి ఆవేదన.

ఆయన బయటపడడు. అంతర్మథనం నిరంతరం ఆతనితో ఘర్షణ చేస్తూనే ఉంటుంది.

వంటల్లో నీళ్ళుమోసే వెధవే అయినా, పప్పుగరిటె మోసే గాడిద యినా అమ్మాయితో పెళ్ళి అనగానే అందల మెక్కి అంతాయింతాకాని కట్నమూ, లాంఛనాలు అడుగుతాడు.

మంత్రపుష్పం చెప్పటం రాని అప్రాచ్యుడూ, సంధ్యవదలిన బ్రాహ్మడూ సమారాధనల భోజనాలకే చెంబు పంచెన బెట్టి నడిచే గర్వదరిద్రుడూ కూడా హిరణ్యాక్షుని రాలే కోరుతాడు.

ఇక మంచి వైదిక కుటుంబానికో, చక్కగా చదువుకొని ఏ బేంకులో ఉద్యోగమో చేసుకుంటూన్న వాడికో యిద్దామా అనుకుంటే ఆక్కడి కట్న కానుకల కొర్కెల హిమాలయాలు కాలి జన్మ కెక్కలేదు.

ఏంచేయాలో తోచని పరిస్థితులలో, తన అంతర్మథనాన్ని బయటికి పొక్క నీయకుండా అలాగే కాలం గడుపుకు వస్తున్నారు సిద్ధాంతి.

ఆషాఢమాసం వచ్చింది. శూన్య మాసం! ఏ కార్యాలూ ఉండని కాలం! ఆ నెలంతా గడపటం కష్టమే. వర్షాలూ బాగా మొదలయాయి. ముసురు పట్టింది. పెద్ద పెనుగాలులతో వర్షాలు విసురు తున్నాయి. అరుసులకు కట్టిన తడికలు వర్షాన్ని ఆపలేకపోతున్నాయి. ఏకంగా అరుగులనిండా నీళ్ళు ప్రక్కచుట్టలూ, గుడ్డల మూటలూ కాస్తోకూస్తో పెద్ద గంపలలో నిల్వచేసుకున్న ధాన్యం తడిసిపోసాగింది. అన్నిటిమీదా అన్నీ కప్పుతూన్న తడిపేపోతున్నాయి. పైగా బహు పాత మిద్దె. పైన మట్టికప్పు. ఎలుకలు త్రవ్విన రంధ్రాలుంటం వల్ల మిద్దే కారసాగింది.

సిద్ధాంతులవారూ, ఆయన ధర్మపత్ని, పిల్లలూ, చెల్లెలూ, వదినలూ అందరూ అన్నిరకాల తాపత్రయపడుతూన్నా లాభం లేకపోయింది. మరీ ముఖ్యంగా సిద్ధాంతికి అతని తల్లి పరిస్థితి హృదయాన్ని

రంపంతోకోసేలా బాధపెట్టింది. జోలె అయిన కుక్కి మంచం మీద, దాదాపూ తడిసి వణకిపోతూ ముడుచుకొని పడుకు వణికిపోతూ ముడుచుకుని పడుకునుంది. నోరెత్తి ఒక్కమాటా అనటంలేదు మహాతల్లి!

సిద్ధాంతి కళ్ళల్లో నీరుతిరిగాయి.

'ఏమిటి తన బ్రతుకు! వేదం కొట్టిన పిండి! వైదిక లౌకిక కర్మకాండల్లో తనను మీరినవాడు లేడు. జాతకనిర్ణయం, ముహూర్తనిర్ణయం, సర్వసందేహాం నివృత్తి వాదాలలో తన మాటే వేద వాక్యం! ఏ పనైనా శ్రౌత సంబంధి నిరాఘాటంగా చేయించగలడు! కానీ ఒక్కటే చాతకావటం లేదు. అదే బ్రతగ్గలగటం! ఏమిటి తనలో లోపం?'

తల్లివైపు చూచాడు, అందరివైపూ చూచాడు. అందరూ తడిశారు. ఈదురు గాలులకు అందరూ వణకిపోతున్నారు. అమ్మ మరీ ఊగిపోతోంది.

"నా....య....నా! సుందర్రామా." అందొక్కమాట, అప్పుడు, వణకుతూ.

"అమ్మా! ఉన్నానే" అనుకుంటూ పరుగున తల్లి మంచంవద్దకు పోయాడు. తానరవయ్యేళ్ళయినా, తల్లికి తాను కొడుకే! తల్లి శరీరానికి తన మీది శాలువ నిండా కప్పేడు!

"జల్లుపడకుండా మీరంతా అమ్మకు చుట్టూ నిలవండి! ఇప్పుడే వస్తా" నంటూ మూల దండేనికి గుడ్డలో చుట్టివుంచిన పాతగొడుగు తీసుకున్నాడు.

"గాలీ.... వర్షమూనండీ!" భార్య అంది!

"తెలుసు" అంటూ మరో సెల్లా మీద కప్పుకొని అరుగుదిగి బయటికి వచ్చాడు సిద్ధాంతి.

హోరున గాలి. మోకాళ్ళలోతు బురద నీరు. పైన విపరీతమైన వర్షం. గొడుగు నిలిచేలా లేదు. మెలికలు తిరిగిపోతోంది గొడుగు. షల్లలు విరిగాయి. గుడ్డ రెప రెపలాడిపోతోంది.. సిద్ధాంతి తప్పొతరిసి పోతున్నాడు. గాలి విసురుకో ఒకటి రెండుమార్లు బురదనేలమీద క్రిందా పడ్డాడు. మోకాలో మోచేయో చిట్లింది. ఎర్రని నెత్తురు చిమ్మింది.

దేనినీ లెక్కించలేదు సిద్ధాంతి. గొడుగు విసరి గిరివాటేశాడు. అపర చాణక్యుల్లా ఆవేశంతో ముందుకు నడి చాడు. సరాసరి ఓ పెద్ద భూస్వామి యింటిముంగిట్లోకి నడిచి భూనభోంత రాళాలూ బ్రద్దలయేలా గర్జించిన ఉరుములా "రెడ్డీ!" అంటూ కేకవేశాడు.

పెద్దిరెడ్డి కుమారుడు చిన్నప్పరెడ్డి బయటికి వచ్చారు. తప్పతడిసిపోయిన అయ్యవారిని చూచి, అయన వదనంలో కోపం చూచి—అదిరిపోయాడు.

"నమస్కారం అయ్యగారికి! తడిసి వచ్చారు. ఇలా రండి స్వామీ లోనికి!" అంటూ సాదరంగా వినయంగా అహ్వా నించాడు చిన్నప్పరెడ్డి.

"పాపా! బీరువాలో కొత్త టవలు తీసుకురా" అని కూతుర్ని పురమాయించి ఎంతో వినమ్రంగా తల తుడుచుకోమని అర్థించాడు.

"చత్రీ తేలేదా అయ్యవారూ? ఇంత వానలో...." అడగబోయి ఆగాడు రెడ్డి.

"అవసరమయ్యా చిన్నప్పా! వర్షం చూడు. నా యిల్లే మియిల్లు! పైన పొటుకు. అన్నివైపులనుండీ జల్లు. వర్షమంతా నా యింట్లోనే. ముసిలామె తడిసిపోతోంది. సరి తలదాచుకోవాలి కదా?" సిద్ధాంతులవారి పొడిపొడిమాటల లోనే చిన్నప్పకు అంతా బోధపడింది.

"నాగన్నా! నాగన్నా!" కేకవేశాడు.

"వస్తిని!" అంటూ గానగాడు నాగన్న వచ్చాడు. అయ్యవారిని చూడగానే 'దండాలయ్యోరు!' అన్నాడు.

"సుఖీభవ!" అన్నాడు సిద్ధాంతి.

"జల్లబండి నీవు కట్టుకు అయ్యవారింటికి పో! తారుపట్టలూ వేసుకుపో. మామూలుబండీ కట్టి వెంకణ్ణి తీసుకుపో. ఆ రాముణ్ణీ, ఎర్రోణ్ణి పిలుచుకుపో. అయ్యవారి యిల్లు కాళీచేయించి, అమ్మయ్యగారినీ అందరినీ మన పడమటింటి వసారా బావుంది కదా, కటాంజనమూ తలుపులూ? అక్కడ చేర్చు. వెళ్ళు! త్వరగా! ఈ గొడుగు తీసుకు వెళ్ళండి అయ్యవారూ?" చిన్నప్ప అందించాడో కొత్తగొడుగు.

అదీ అగదని తెలుసు సిద్ధాంతుల వారికి. ఇచ్చినప్పుడు పుచ్చుకోవటమే తన వృత్తిధర్మం. ఆ గాలివానలోనే ఆలాగే యిల్లుచేరాడు.

కొంచెంసేపటికి బళ్ళు వచ్చాయి. సరకంతా ఎత్తించి, జల్లబండిలో కుటుంబాన్నంతా కూచోబెట్టి, తారుపట్టాలు పైనకప్పి చిన్నప్ప పడమటింటి వసారా చేర్చాడు సిద్ధాంతి.

వసారాయే అయినా తన యింటి అరుగులకన్నా ఎన్నోరెట్లు బావుంది. ఒక్కచుక్క జల్లుకూడా లేదు. వెచ్చగా వుంది. కరెంటు వుంది. గూళ్ళు ఉన్నాయి. విశాలంగానూ ఉంది. ఓ చెక్కమంచమూ సిద్ధంగా వుంది. ముందు ఆ ముసలితల్లికి పక్కపరచి అక్కడ వెచ్చగా పడుండబెట్టాడు.

"మంచం బావుందిరా రామూ! వెచ్చగానూ వుంది" అందాతల్లి. ఎంత సంబరమో! అల్ప సంతోషం!

సిద్ధాంతి ఒళ్ళంతా గగుర్పొడిచిం దొక్కమారు. ఏ వసతీలేని ప్రకృతిలో నుండి కాస్త తెరపికి రాగానే స్వర్గం చూచినంత సంబరపడే ఈ బ్రతుకులు నిజంగా తెల్లవారే దెన్నడు?

ఆ రాత్రంతా హాయిగా వెచ్చగా పడుకున్నమాట నిజమే అయినా సిద్ధాంతి మనసునిండా ఆలోచనలే! తెల్లవార వచ్చేప్పటికి ఓ నిర్ణయానికి వచ్చాడు.

తెల్లవారింది. వర్షం తీవ్రత చాలా తగ్గిపోయింది. ఏదో వన్నతూబరు!



సిద్ధాంతి స్నాన జపతపాలు ముగించుకొని గంభీరంగా బయటి కడుగువేశాడు: ఎక్కడో ఏదో అరచినట్లయింది. ఆ దిశకు చూచాడు. ఆకాశంవేపు చూచాడు. కుడిచేత ఏవేవో లెక్కలు అరచేతిలోనే గుణించుకున్నాడు.

సమాధానం వ్యతిరేకఫలం అందించింది. శాస్త్రం అందించిన సమాచారం అది. శాస్త్రవిచారాలకు తరతరాలుగా కట్టుబడ్డ కుటుంబం సిద్ధాంతిది. వసారాలోకి చూచాడు. తల విదల్చుకున్నాడు.

"శతాయగశాయచ....నూరారుకానీ.. ఏది ఏమైనా కానీ" అనుకుంటూ శాస్త్రం, శకునం అన్నీ ప్రక్కకునెట్టి కదలిపోయాడు.

దానికీ దీనికీ సరిపోయిందని ఇన్నేళ్ళుగా తమ పొలం ఊరబందుల్లా అనుభవిస్తూన్న పెద్ద పెద్ద భూస్వాముల్ని, ఆసాముల్ని సందీసి లెక్కడిగాడు. అడిగింది మెత్తగానే. అయినా అది చురుకుమనిపించింది పెద్దల్ని.

"అన్నీ సరిజేస్తాములే స్వామీ!" అని వాళ్ళు వినయంగానే జవాబిచ్చారు. సిద్ధాంతి వెళ్ళిపోయాడు.

"పిల్లి పులయిందేమా! సాధు జంతువుకి సాధించే రోషం ఎక్కడిదా!" అని వెక్కిరించుకున్నారు పెద్దలు.

ఆషాఢమాసం ముగిసే సమయంలో పెద్దలు లెక్క తేల్చారు. అందరూ అదే సరేనన్నారు. సిద్ధాంతివారికి ఐదెకరాల భూమి మిగిలేలా చూపి మీదే నన్నారు.

అక్కడికే చాలులే అని తృప్తి పడ్డాడు సిద్ధాంతులవారు. సొంతం ఎక్కడ చేసుకుంటాడు కనుక? చిన్నప్పరెడ్డే గుత్తకు వేస్తానన్నాడు. సరేనన్నాడు సిద్ధాంతి.

శ్రావణమాసం వచ్చేసింది.

సిద్ధాంతికి చేతినిండా పని! పెళ్ళిళ్ళే యెక్కడా. నోములూనూ.

సీరానాయుడి ఏకైక కుమార్తె వివాహం! నాయుడు లోకపల్లె రాజా లాంటి భూస్వామి. ఎవరికి అప్పు గావలసినా నాయుడే దిక్కు. ఎవరికేమి కావలసినా అతడే దిక్కు. అందుకే అందరి భూములూ, ఆభరణాలూ నాయుడి సొంతం అయిపోయాయి.

ఇంద్రభవనంలా యిల్లు కట్టాడు. అబ్బాయిలను పెద్ద చదువులకి పంపేడు. ఒక్కడూ పాసవలేదు. అయినా దిగులు పళ్ళేదు. ఊరిమీదకి వదిలాడు వాళ్ళని. వాళ్ళకు పార్టీలూ గొడవలూ ద్వేషనులు, నాయుడు పెళ్ళి విడిపించుకురావటాలు మందలించటాలు, పార్టీతగవులు, పల్లె కాంతికి మేకులూ నాయుడి సంతానం నిత్యకృత్యాలు.

అమ్మాయి చదువుకుంది ఏమీ లేదు. షోకులు జాస్తి. ప్వంత జీపుంది. వారంలో ఏడు రోజులైనా బస్తీకి రావల్సిందే సినిమాలు చూడాల్సిందే. బోలెడు కట్నం కాబట్టి ఓ బేంకాఫీసరుడు వరుడయ్యాడు.

ఆకాశమెత్తు పందిరి! విద్యుద్దీపాల మాలలు. షామియానాలు, కుర్చీలూ, మేళ తాళాలూ, బ్యాండు పెట్టూ! ఎంద రెందరో్నో ఇంటాబయటా ఆహ్వా నించాడు. క్రిక్కిరిసిన బంధుమిత్ర బలగం.

పురోహితుడు సిద్ధాంతుగారే!

ఘనంగా, దివ్యంగా పెళ్ళి జరిపించాడు కుప్పలుగా చదివింపులు వచ్చాయి, వివాహమైపోయింది.

"అందరూ భోజనాలకు పదండి" నాయుడు అందరికీ విజ్ఞప్తిచేశాడు.

"అయ్యగారింటికి బత్తెం పంపించారా!" ఎవరో అడిగారు.

"ప్రొద్దుటే పంపాము నాయుడుగారూ!" అయ్యవారే జవాబిచ్చారు

"మంచిది అయ్యవారూ! ఇంద ఈ తాంబూలం యివ్వటికి తీసుకోండి! సాయంత్రం నా కచ్చేరీ దగ్గరికి రండి! సంభావన తీసుకుందురుగాని" అన్నాడు నాయుడు.

"అలాగే" అంటూ సిద్ధాంతులవారు వెళ్ళిపోయారు

* * *

"నాయుడుగారు జరిపినట్లు ఇంకెవ్వరూ ఇంత ఘనంగా పెళ్ళి జరపరేమో!" అంటూ ఇంట్లో సిద్ధాంతులవారు పెళ్ళి యేర్పాట్లు గురించి చాలా గొప్పగా కీర్తించాడు.

"బత్తెమూ బాగానే పంపించాడు నాయనా!" వదినగారన్నారు.

"మీ కెంతేసి సంభావన యిచ్చాడే మిటి?" భార్య వడ్డిస్తూ అడిగింది

"సాయంత్రం వెళ్ళాలి నాయుడుగారి కచేరీయింటికి. జోడు దోవతులూ, జరి

పిల్లాలూ సంభావనా అక్కడే యివ్వచ్చు" అపోశనం పడుతూ అళగా నమ్మకంతో అన్నాడు.

"మీ రొక్కరే గుర్తున్నారులా ఉంది నాయుడుగారికి?" అంది భార్య మూతి విరుస్తూ. దంపతులకు వస్త్రాలు పెట్ట వచ్చు కదా? అలా చేయలేదే అని ఆవిడ చింత!

"పరేపరేలే! మజ్జిగ వడ్డించు "అంటూ సుష్టుగా భోంచేసి నడుం వాల్చాడు.

సాయంత్రం కావచ్చింది. సూర్యుడు పూర్తిగా కనుమరుగైపోయాడు. చీకట్లు ముసురుతున్నాయి. కోకపల్లె అందం అప్పుడే చూడాలి!

సాయంసంధ్య వారుస్తూ, సంభావన మీద మనస్సుని పరుగెత్తిస్తూ చావిట్లో కట్టమీద కూర్చున్నారు సిద్ధాంతులవారు,

"అయ్యోర్రండీ! తవరు దయసేయా లంట తొరగా? నాయుడుగారే కబురెట్టి వారు." బయట గానగాడు కేక వేశాడు.

"అయిపోయె! వచ్చేస్తున్నా! నువ్వు పద!" అంటూ సిద్ధాంతి త్వరత్వరగా సంధ్య ముగించుకొని గబగబ నాయుడు గారి కచేరికి వెళ్ళారు.

సిద్ధాంతులవారు సాలోచనగా ఆ పేవ కుడివైపు చూచాడు. తలమీదే అరుస్తూ కాకి లేచిపోయింది. ఆయన మన సెందుకో అనుకోకుండా కీడును శంకిం చింది. కాలగణన చేసుకుబోయాడు. మనసు చెదిరింది. గణన వేళ్ళమీద నిలవలేదు.

"రండి అయ్యవారూ!" అక్కడ తలుపు తెరచి మరో భూస్వామి పిలిచా డంతలో.

సిద్ధాంతి మౌనంగా గదిలోకి వెళ్లాడు. తలుపులు మూశారు. లోపల తివాచీలూ, వాటిమీద మెత్తని పరుపులూ: వాటిమీద నాయుడుగారితోపాటు, తన పొలాలు రాజారోషుగా అనుభవిస్తూ పక్కలుక్కం చేసుకున్న ఘనులూ ఉన్నారు. విలాసంగా కూచున్నవాళ్ళు లేవనైనాలేదు. కనీసం తవను కూచోమనలేదు.

"నా ...డుగారూ! నా సం....భా.... వ....వ...." సిద్ధాంతి నీళ్ళు నమిలాడు.

"ఇంకా సంభావన కావాలా? బాప నయ్యా, నాటకాలేస్తుందవా?" నాయుడు వెటకారంగా అడిగాడు.

"నాయుడుగారూ?" ఆవేశంతోపాటు ఆశ్చర్యమూ, అసహ్యమూ కూడా పెన వేసుకువచ్చాయి సిద్ధాంతులనోట!

"ఔను! మర్యాదుంచుకుంటేనే మర్యాద! చదివింపులలో ఆరువేల రూపాయలు తక్కువయాయి. మా కెవరి మీదా అనుమానం లేదు. అతి దగ్గర్లో నివ్వేగా ఉన్నావు! నీవే తీశావనే మాకు మాంచి నమ్మకం! ఆ డబ్బు మర్యాదగా కక్కుతావా? లేక ఈ గదిలోనే కక్కి యాలా? ఏది కావాలో చెప్పు?" నాయుడు తరపు వకాల్తా తీసుకొని ఓ బుర్రమీసాల ఆసామి అన్నాడు.

ప్రళయం వచ్చినట్లూ, మిన్నువిరిగి వెన్నుమీద పడ్డట్లూ, కాళ్ళక్రింది భూమి కదలిపోయినట్లూ అయి కళ్లు బైర్లు కమ్మాయి సిద్ధాంతికి!

"ఓం హరహరశాంతం" అనుకున్నారు మనస్సులో. గాయత్రిని ధ్యానం చేసుకున్నారు జందెం బ్రహ్మముడి తడుముకుంటూ. ఒళ్ళంతా చెమటలు పట్టాయి. ముఖం జేవురించింది. కళ్ళు అప్రయత్నంగానే వర్షించాయి. మోకాళ్ళ మీద కూలబడ్డాడు. చేతులు రెండూ జోడించాడు.

"నాయుడుగారూ నేనేమీ మాట్లాడగలిగే స్థితిలో లేను. తరతరాల నా వంశ ప్రతిష్ఠకు ఈ మచ్చ నా గుండెల్లో దిగిన బాకు.... అరవైయేళ్ళ వయస్సులో అప్రాచ్యపుపని చేసిన నింద నామీద వేశారు. కఠినంగా ఈ ముసిలాణ్ణి శిక్షించేందుకైనా మీరు వెనకాడని కర్కశులై ఉన్నారు. నేను తీయలేదని ప్రమాణాలు చేసినా, నా యిల్లు వెతకండని చెప్పినా మీరు వినరు. వినదలచుకోలేదని మీ ప్రవర్తనే చెపుతోంది. నా దగ్గర యివ్వ దేమిలేదు. కానీ మీ అరువేలూ యిస్తాను. ప్రోనోటు వ్రాసుకోండి!" అన్నాడు గంభీరంగా.

నాయుడు, ఇతరులు చిరునవ్వులతో ముఖముఖాలు చూచుకున్నారు. ఒకరు నిక్కాలం వ్రాశారు - ఏం వ్రాశారో చూచుకోకుండా చేవ్రాలువేసి తిరిగి చూడనైనా చూడకుండా చకచక తల వాల్చుకు యిల్లుచేరాడు.

సిద్ధాంతి తాను చేసిన బాకీలోకి కూలిపోయిన యిల్లూ, పొలాలూ అన్నీ ఆ అసాములకందరికీజమకట్టినట్లు అందులో వ్రాయబడుంది. సిద్ధాంతిని వంచేందుకి పల్లెపెద్దలాడిన అవినీతి నాటకంఅది.

ఇంటికి వచ్చి మౌనంగా తలగడలో దూర్చి పడుకున్న సిద్ధాంతిని పలకరించేందుకు ఎవరికీ ధైర్యం చాల్లేదు. అతని భార్యే అత్తగారితో చెప్పింది.

లేవలేని వంద మునలి ఆ మహాతల్లి కుక్కిమంచంనుండి దిగి ప్రాకుతూ కొడుకుదగ్గరకు వచ్చింది. "సుందరా! రామా! సుందర్రామా! ఏమయింది నాయనా?" అంటూ తల నిమురుతూ అడిగింది.

పసిపిల్లవాడిలా ఆ తల్లి ఒళ్ళో తల దూర్చి భోరున యేడ్చేశాడు సిద్ధాంతి.

"అమ్మా! అయిపోయిందే! పల్లెల్లో న్యాయం, నీతి అన్నీ అడుగంటాయ్. ఊరి పెద్దలంతా కలిసి నీ కొడుకుని ఓ దొంగగా జమకట్టారే. నేను దొంగనటే? అమ్మా! వేదపండితుణ్ణి దొంగనటే?"

"వాళ్ళనోళ్ళల్లో పురుగులు పడతాయి! ఎవడురా నాయనా నిన్ను దొంగ అన్నది? ఆ వెధవలంతా దొంగలు! వాళ్ళు దొంగలై మన స్థలాలూ పొలాలూ అన్నీ చేజిక్కించుకున్నారు. ఇప్పుడు నీ

మంచినీ దొంగిలించారు. ఎవరూ? ఆ వాయుదేవట్రా ఇంతా చేసింది! ఇంత కింత అనుభవించక పోడు! మన ఉసురు వాడు కొట్టుకుని పోతాడు! పిల్ల పెళ్ళివేళా వచ్చి ఘనంగా కులుకుతున్నాడు. కుమిలి చస్తాడులే నాన్నా! నువ్వూరుకో రామూ! దిగులు పడవాకరా!" ఒళ్ళంత నిమురుతూ గర్జించి, ఊరడించింది.

సిద్ధాంతి కేదో ఊరట కల్గింది. ఆరాత్రి సుఖంగా కాకున్నా మామూలుగా నిద్ర పోయాడు.

ఇంకా తెల్లారలేదు. ఇంట్లో ఎవరూ నిద్ర లేవలేదు. ఇంటిబయట మువ్వల చప్పుడు వినిపించి అందరూ లేచారు.

"ఏవిటండీ యిది? మన వస్తువులూ, పాత్రలూ ఏవీ లేవు!" కంగారుగా అడిగింది భార్య, వాకిలివద్ద నిలబడ్డ సిద్ధాంతులవారిని.

"అన్నీ సిద్ధంగా బళ్ళలో వున్నాయి. కాని, అందరూ త్వరగా తెమలండి. ముఖాలు కడిగి బళ్ళెక్కి కూర్చోండి!"









అని ఆదేశించాడు.

"నాయనా! ఎందుకు రామూ! ఇల్లు మారుతున్నావా!" తల్లి అడిగింది!

"లేదమ్మా! ఊరే మారుతున్నాం! పట్నం పోతున్నాం! ఏమీ, కాలం చెల్లిన ఈ వెధవపల్లెలో ఉండదలుచుకోలేదిక!"

"మంచిమాటరా! వెళదాం పద!" అన్నది తల్లి కూడా.

బళ్ళు కదిలాయి.

—*—

# నాకు నచ్చిన నా కథ



యలిశెట్టి శంకరరావు

ఓల్డ్ జెనిసిస్. మానవ జీవిత పరిణామ క్రమంలో ఏ ఏ మార్పులు జరిగాయో సృష్టిలో ఏ ఏ అద్భుతాలు ఎలా సంభవించాయో ఊహించవచ్చు. చరిత్ర చెప్పొచ్చు. ఆంత్రపాలజీ, ఎన్‌షెంట్ హిస్టరీ అనే మానవ జీవిత పరిణామ క్రమాన్ని చెపుతాయి. సృష్టిలో, మానవ జీవిత పరిణామంలో ప్రతి అద్భుత వికాసం వెనక ఓ అపురూపమైన శక్తి స్త్రీ— ప్రేమ!

సృష్టికర్త, మానవశక్తి వీటిపైన నాకు నమ్మకం లేదు. ప్రకృతి పురుషునికి ఇచ్చిన అద్భుతమైన వరం స్త్రీ ప్రేమ! లవ్ ఇట్‌సెల్ఫ్ మీన్స్ జస్ట్ ఏన్ అండర్‌స్టాండింగ్ బిట్వీన్ మేన్ అండ్ వుమన్.

వుమన్ క్రియేటెడ్ ఫర్ ది ప్రాస్పరిటీ, అండ్ మెంటల్ ఫిజికల్ అప్‌లిఫ్ట్ ఆఫ్ ది మేన్. మౌనంగా ఉండిపోయే మనసుపొరల మధ్య భాష్యంలేని ప్రేమ ప్లేటోనిక్ లవ్.

ఏ మనసుపొరల్లో ఏముందో ఏ గుండెవెనక ఏ ఆవేదన దాగుందో, ఏ సిలిశళ్ళ వెనక ఏ మూగ ఆరాధన మౌనంగా భాషిస్తోందో ఎవరికి తెలుసు?

ద్వేషానికి, అసూయకి, హిపోక్రసీకి అతీతంగా, ఆరాధనకి, త్యాగానికి

వాటన్నిటి స్వచ్ఛంగా నిర్మలంగా మెరిసే ఓ వెన్నెల బొమ్మ ప్రేమ. అదో మహత్తరమైన శక్తి. ఆ ప్రేమికి భాష్యం చెప్పటానికి ఈ జీవితం చాలదు.

ఓ చిత్రకారుడి కుంచెలో కరుడుగట్టి గుండెలో పండిన ప్రేమను తాజ్ మహల్ నవ్వుతు— నా దేహంతో సజీవమైన పాత్రలా కాన్వాస్ పైన చిత్రించి, జీవం పోసుకోబోతే 'తాజ్‌మహల్ నవ్వింది....'

# తాజ్‌మహల్ నవ్వింది

"మే ఐ కమిన్ ?"

కుంచెతో రంగులు కలుపుతున్న వాణ్ణల్లా వీణలయను వెక్కిరించే కంఠ మాధుర్యం విని వెనక్కి చూశాను.

విచ్చిన మల్లెలా విందుగా జయ.

"ష్యూర్, ష్యూర్" నవ్వుతూ ఆహ్వానించాను.

ముగ్ధలా అడుగులో అడుగు వేసుకుంటూ లోపలికి వచ్చింది.

స్టాండుకు ఫిక్స్‌చేసి ఉన్న డ్రాయింగ్‌షీట్ వంక చూసింది. పల్లెకారుల జీవితానికి సంబంధించిన చిత్రం అసంపూర్తిగా ఉంది.

"అరే! కొత్త చిత్రం ప్రారంభించేశారా? చిత్రం మొదటినుంచి ఎలా వేస్తారో చూద్దామనుకున్నాను." బుంగమూతి పెట్టింది.

"ఏం చెయ్యను? చిత్రం సగంలో ఉండగా వచ్చావు." అన్నాన్నేను.

నిరుత్సాహంగా నవ్వింది జయ. మరేం మాట్లాడకుండా తిరిగి రంగులు కలపసాగాను.

కుర్చీలోంచి లేచి గోడలకి తగిలించి ఉన్న వర్ణచిత్రాలన్నింటిని పరీక్షగా చూస్తోంది జయ. నా జీవితంలో చాలాభాగం ఆ బొమ్మలకోసమే వెచ్చించాను. అందాన్నంతా హృదయంలో బంధించి రంగుల ప్రకృతిని కుంచెతో కాగితంమీద ఒలికిస్తే, మరో మరపురాని అద్భుత ప్రపంచం, జలపాతాలు, నదులు, కొండలు, కోనలు, పంటచేలు, నిష్కల్మషంగా కనిపించే అమాయకపు గిరిజన ప్రజలు, పల్లెపడతులు....

జయ వాటిని చూస్తూండగా నా వేళ్ళు చిత్రంమీద చకచకా కదిలాయి. పది నిముషాల్లో చిత్రం పూర్తిచేసి, బేసిన్‌లో చేతులు కడుక్కుని నాప్‌కిన్‌తో చేతులు తుడుచుకున్నాను. ఫ్లాస్క్‌లో కాఫీ కప్పులో పోసి అందించాను

"థాంక్స్!" అని, "మీరు తీసుకోరా?" అడిగింది. చిన్నగా నవ్వాను.

"ఉహూ! కాఫీ నాకు హుషారివ్వదు. జస్ట్ వన్ మినిట్ కూర్చో! ఇప్పుడే వచ్చేస్తాను." జయతో చెప్పి నా గదిలోకి నడిచాను.

నా గది నా ప్రపంచం, అందులోకి ఎవరూ రారు. కాదు! నేనే ఎవర్నీ రానివ్వను.

నా భార్య రాధని కూడా!

అయిదు నిముషాల తర్వాత తిరిగొచ్చాను. హుషారుగా, సంతోషంగా ఉంది. ప్రపంచాన్ని ఓడించినంత ఆనందం.

"తరుచూ ఆ గదిలోకి వెళ్తుంటారు! ఏముందందులో?" కుతూహలంగా జయ ప్రశ్న.

ఏం చెప్పగలను? ఎలా చెప్పగలను?

"బొమ్మలు! నన్నాడించే బొమ్మలు!"

ఇంకేం మాట్లాడలేదు జయ.

"మీ చిత్రాలన్నీ బావున్నాయి! ఆర్ట్ ఎగ్జిబిషన్ కండక్ట్ చెయ్యకూడదూ? మంచి పేరొస్తుంది. మీ చిత్రాలకు మంచి గిరాకీ కూడా వస్తుంది." కొంచెం సేపయింతర్వాత అంది జయ.

"ఆ ముచ్చట కూడా తీరింది! ఒకసారి ఈ ఊళ్ళోనే నా చిత్రాల ప్రదర్శన ఏర్పాటుచేశాను. వాటిలో కొన్ని చిత్రాలు అమ్మి, ఆ డబ్బు వరదబాధితుల సహాయనిధికి ఇవ్వాలని నా ఆలోచన. పదివేలమంది వచ్చి చూశారు. పట్టుమని పది చిత్రాలు కూడా అమ్ముడుపోలేదు. ఈ దేశంలో కళ సంతరించుకున్న దౌర్భాగ్యం ఇది." నా కంఠంలో నిరాశపు జీర.

నిట్టూర్చింది జయ.

"మీ చిత్రాల్లో ప్రేమికులు చోటుచేసుకోరేం?" సూటిగా నా కళ్ళలోకి చూస్తూ అడిగింది జయ.

నా గుండె ఎందుకో కలుక్కుమంది. జయ కళ్ళల్లోకి చూశాను. నిర్మలంగా జ్యోతుల్లా ఉన్న కళ్ళు సమాధానంకోసం రెపరెపలాడుతూ చూస్తున్నాయి.

క్లిష్టమైన ప్రశ్న. సమాధానంకోసం నా గత జీవితాన్ని త్రవ్వుకొని ప్రయత్నించాలి.

"నా హృదయం స్పందించటంలేదు, జయా! నా ఆలోచనలో, నా జీవిత విధానంలో ఎక్కడో, ఏదో లోపముంది. నా ఆశయాల్ని, అభిరుచుల్ని, ఆదర్శాల్ని అర్థంచేసుకుని నన్ను నన్నుగా ప్రేమించే స్త్రీ కాదు రాధ! నేను ఓ



దంతప్రతిమతో కాపురం చేస్తున్నానంటే! ఇలాగే జీవితం కొనసాగిస్తే కొన్నాళ్ళకి నాలోని కళాకారుడు చచ్చిపోతాడు." ఆత్మలో విషాదం సమాధానంగా కురిసింది.

జాలిగా నావైపు చూసింది జయ.

నామీద నాకే జాలివేసింది. జయ హృదయంలో హత్తుకుపోయి సేద తీరాలన్న కోరికని చాలా కష్టంతో నిగ్రహించుకున్నాను.

చాలా సేపు మౌనం.

జయ కళ్ళల్లోని కరుణకాంతుల్లో తడుస్తూ నేను. బహుశా నా కళ్ళక్రింద నల్లటి వలయాల్ని చూస్తుందేమో జయ!

నా పొడవైన చేతివేళ్ళని అందుకుంటూ తమలపాకులాంటి తన అరచేత్తో స్పృశించింది జయ. ఆ స్పర్శలో కరుణ, జాలి, దయ పలుచని తెరల్ని ఛేదించుకుంటూ పైకిరావాలని ఆతృతగా ఎగిసిపడే కెరటం! ప్రేమకెరటం!

విచిత్రం ఏముంది? మా పరిచయానికి వయసు నాలుగు నెలలు!

ఆ స్పర్శ సుఖాన్ని అనుభవిస్తున్న నాలో ప్రకంపన. ఇంత ఆదరణ నా ఇరవై ఎనిమిదేళ్ళ జీవితంలో మొదటిసారి చూస్తున్నాను.

నెమ్మదిగా నన్ను చుట్టుకున్న గతం నీలినీడలు.

* * *

నేను సోక్రటీస్ అంతటివాడిని కాదు కాని, నా భార్య మాత్రం ఖచ్చితంగా సోక్రటీస్ భార్యలాంటిదే!

కొన్ని జీవితాల్ని కనిపించని విషాదపు తెరలు కప్పివుంచుతాయి. ఏదో పోగొట్టుకున్నామనే బాధ, ఒక రకమైన మానసిక జాడ్యం. ఏం పోగొట్టుకున్నామో నిశ్చయంగా తెలీదు. అస్థిత్వంమీద అనుమానం. ఎవరో తన ప్రతుకుని శూన్యం చేసినట్టు భ్రమ! అందుకు ప్రతిగా తాము ఎవరిమీదో కసితీర్చుకోవాలి. ఎవరిమీదో తెలీదు. విషవాయువులు పీసే వెట్టు రాధ. ఆ గాలి పీలుస్తూ నేను.

చాలామంది మనుషులు ఇలాంటి ఖరదలో బ్రతికే క్షుద్రజీవులే!

నా చిన్నతనంలోనే తల్లినీ, తండ్రినీ పోగొట్టుకున్న దురదృష్టవంతుణ్ణి. అక్క మహాలక్ష్మి నా మంచిచెడ్డల్ని చూసింది. పదిహేనేళ్ళ వయసు వరకు నన్ను చదివించింది. అయితే, నాకు చదువు వంటబట్టలేదు. చిత్రకళవల్ల ఆకర్షితుడనయ్యాను. పదహారోఏట ఒక ఆర్ట్‌స్కూల్లో చేరి దీక్షగా చిత్రకళని అభ్యసించాను. ఎన్నో వర్ణచిత్రాలు నా కుంచెనుంచి ఊపిరిపోసుకున్నాయి.

ఇరవైయేళ్ళు నిండుతుండగానే ఆర్ట్‌స్కూల్ నుంచి డిప్లొమా తీసుకున్నాను.

నిండు జీవితాన్ని, ఇరుకు ప్రపంచాన్ని ఎదుర్కోవడానికి కలల్లో చిత్రించుకున్న భవిష్యత్తులో అడుగుపెట్టగానే ఎదురైన అశనిపాతం.

"నా కూతుర్ని చేసుకోవట్రా! అమ్మ పోయినప్పట్నుంచి నిన్ను కంటికి రెప్పలా పెంచాను."

నా మవునాన్ని చూసి అక్క రెచ్చిపోయింది.

"నీమీద ఎంత ఖర్చుపెట్టాను! గారముద్దుగా చూసుకుని, నా కూతురికి కాబోయే మొగుడని అందరితోనూ చెప్పుకుని మురిసిపోయాను."

అక్క నన్ను సొంత కొడుకులానే చూసుకుంది. నిజమే, నేను రాధని మొన్నటివరకు ఎత్తుకుని తిరిగాను. ఆరేడేళ్ళ వయసువరకు స్నానం కూడా నేనే చేయించేవాణ్ణి. ఇప్పుడు ఓణీలువేసుకుని తిరుగుతున్నా, నా కళ్ళకి రాధ చిన్నపిల్లలాగే కనిపిస్తుంది. తనని పెళ్ళిచేసుకుంటే నా జీవితంలో ఏదైనా సుఖం మిగుల్తుందా?

నాలో బయటకు రాలేని భావాల సంఘర్షణ. నా మవునాన్ని చూసి అక్క ఏడుపు. నేను చేసిన అన్యాయాన్ని చుట్టుపక్కలవాళ్ళతో ఏకరువుపెట్టింది. నాలో ఘర్షణ. నెమ్మదిగా గళం విప్పి చెప్పాను నేను. బుగ్గలు నొక్కుకుని విస్మితంగా చూసింది అక్క.

"ఇదేం చోద్యంరా! నేను అమ్మ తమ్ముణ్ణి చేసుకోలేదు. మాకేమయ్యిందిరా మేం సుఖంగా లేమూ! నా కూతుర్ని చేసుకోవడం ఇష్టంలేకపోతే సూటిగా చెప్పెయ్యి!

నన్ను నేనే మోసంచేసుకుంటున్నానా? ఇంకెవరైనా నావల్ల మోసపోతు న్నారా? ఏమో!

రెండోసారి రాధ గర్భందాల్చింది. మూడో నెల్లోనే పుట్టింటికి వెళ్ళిపో యింది.

అప్పుడే నా జీవితం మరో మలుపు తిరిగింది.

మధు చెల్లెలు జయ బి.ఎస్సీ. ఫైనల్ పరీక్షలు రాసి అన్నయ్య దగ్గరకు వచ్చింది.

జయని పరిచయంచేస్తున్నప్పుడు నా హృదయంలో ఏదో ప్రకంపనం. ప్రబంధకన్యని నేనెప్పుడూ చూడలేదు. ఇలాగే ఉంటుందేమో! అంతకంటే వర్ణించటం నాకు చేతకాదు. ఎందుకంటే నేను రచయితను కాదు. నా హృద యంలో ఆమె పంచరంగుల వర్ణచిత్రానికి స్కెచ్ గీయబడింది. నన్ను చిత్ర కారుడుగా పరిచయం చేసినపుడు జయకళ్ళల్లో మెరుపు.

మధు ఆఫీసుకి వెళ్ళిపోతే సుమలత వంటపనిలో మునిగిపోయేది.

నేను బొమ్మలుగీస్తున్న హాల్లోకి వచ్చి కూర్చుని, వర్ణచిత్రాల్ని కుతూహ లంగా గమనించేది జయ.

ఎన్నో కబుర్లు- నవ్వుతూ నన్ను నవ్విస్తూ నా హృదయంలో అస్పష్టంగా రూపుదిద్దుకుంటున్న ప్రేమ.

"నే వెళ్తాను." నన్ను తట్టిచెప్పింది జయ.

"అప్పుడేనా?" గతంలోంచి తేరుకుని నిరాశగా అన్నాను.

"అప్పుడేనా ఏమిటి? గంటయింది వచ్చి- ఏమీ మాట్లాడరు! రాత్రి పడపో తోంది. ఇంటికి వెళ్ళకపోతే వదిన తిడుతుంది." చెప్పి నవ్వుతూ వెళ్ళిపోయింది జయ.

* * *

మా పరిచయానికి అర్నెల్ల వయసొచ్చాక - ఆదివారం జయకు ఊరు చూపించటానికి తీసుకువెళ్తూ నన్నూ పిల్చాడు మధు. మరునటిరోజు ఆఫీసుకు వెళ్తూ పబ్లిక్‌గార్డెన్స్, సాలార్‌జంగ్ మ్యూజియం చూపించే పని నామీద వేశాడు.

జయ మ్యూజియంలో ప్రతిమల్ని, చిత్రాల్ని, వింతల్ని చూసిందో! లేదో! నేనుమాత్రం ప్రతిక్షణం జయనే చూశాను.

పబ్లిక్‌గార్డెన్స్ పచ్చికలో కూర్చుని మాట్లాడుకుంటున్నపుడు జయ అను క్షణం నా కళ్ళల్లోకే చూసింది.

బిర్లామందిర్ మెట్లు ఎక్కుతుండగా ఇద్దరం చెయ్యీచెయ్యీ కలుపుకునే ఎక్కాం.

* * *

ఇంటికి తిరిగివచ్చేసరికి నాకోసం రెండు వార్తలు - రాధ ప్రసవించింది, చనిపోయిన పాపని,

ఈ వార్త ఎందుకో నాలో సంచలనం కలిగించలేదు. జయతో కూడా చెప్పలేదు.

ఇంకోటి ఢిల్లీలో ఆర్ట్ఎగ్జిబిషన్‌కి ఏదైనా చిత్రం తీసుకురమ్మని ఆహ్వానం! జయ ఈ విషయం విని చిన్నపిల్లలా సంబరపడింది.

"ఏదైనా మంచి ప్రేమ చిత్రం వెయ్యండి!" మెరిసేకళ్ళతో చెప్పింది జయ.

నాలో స్పందన మొదలైంది. చాలా రోజులుగా ఒక మాస్టర్‌పీస్ చిత్రించాలని నా కోర్కె. అది నా చిత్రకారుడి జీవితానికే మాస్టర్‌పీస్ కావాలి!

"ప్రేమికుల చిత్రం వేస్తాను! ఇన్‌స్పిరేషన్ కావాలి! ఎలా మరి?" కొంటెగా అడిగాను.

జయ బుగ్గలమీద సిగ్గు- కెంపురంగుతో!

ఆ క్షణం!

జయ మునివేళ్ళమీద నిలబడి, నా తలని వంచి నన్ను తనకు హత్తుకుని- నేనే తనని హత్తుకున్నానా? పెదవులు పెదవులు కలసి ఆ రసాస్వాదనంలో జగత్తు క్షణికమై- ఆ క్షణం శాశ్వతమైతే?

చాలాసేపయింతర్వాత విడివడ్డాం! ఏదో సంతృప్తి.

"ఏం బొమ్మ వెయ్యమంటావ్? ఐడియా చెప్పు" సిగరెట్టు ముట్టించుకుంటూ హుషారుగా అన్నాను.

"పాడుసిగరెట్టు పారెయ్యి ముందు. రోజుకు ఎన్ని సిగరెట్లు కాలుస్తావ్?" కోప్పడింది.

చిత్రం! వెంటనే పారేశాను.

విచిత్రమైన స్పందన!

నా బలహీనతల్ని ఓడిస్తోంది ఒక స్త్రీ!

"తాజ్‌మహల్ ప్రేమకు చిహ్నం కదా! ఆ సుందర మందిరాన్ని వెన్నెల్లో చిత్రించు. తాజ్‌మహల్ ముందు ఒక పెద్ద సరస్సు - నీటిలో ప్రతిబింబం తాజ్

మహల్‌కి బదులుగా ప్రేమపురుషుల జంట నీడగా! ఐడియా బాగుందా!" నా మొహంలోకి చూస్తూ కుతూహలంగా అడిగింది జయ.

ఆ వివరణ నాకు నచ్చింది. గుడ్ ఐడియా! నా కుంచె మహత్తరశక్తిని పుంజుకుంది. నా నరనరాల్లో ఆవేశం, ఉత్సాహం. కృషి.

కలర్స్ మిక్సింగ్, చిత్రం రూపొందుతున్న తీరు అపూర్వం. ఆ చిత్రం వేస్తున్నంతసేపూ నా ప్రక్కనే ఉంది జయ.

రెండోరోజు సాయంత్రం అవుతుండగా చిత్రం ఇంచుమించు పూర్తయింది. ఫైనల్ టచెస్ మాత్రం మిగిలాయి.

చిత్రం చూసుకుంటే ఎందుకో గర్వంగా ఫీలయ్యాను. నాలో ఇంత ఎత్తుకు ఎదిగిన కళాకారుణ్ణి ఇంతకాలం దర్శించలేకపోవటం నా దౌర్భాగ్యం. ఈ గొప్పతనం నాది కాదు. నాలో కళాకారుణ్ణి ప్రభావితంచేసిన జయది.

చీకట్లో బాపూ బొమ్మలా ఒదిగి నిల్చుంది జయ.

నేను చేతులు చాపానో, లేక తనే నన్ను అతుక్కుపోయిందో!

నిముషాలు నిశ్శబ్దంగా నవ్వుతూ గంటల్లోకి నడిచి వెళ్ళిపోతున్నాయి.

"థాంక్యూ! వెరీమచ్!" బరువుగా వూపిరిపీలుస్తున్న జయ చెవిలో చెప్పాను.

"ఎందుకు!" నెమ్మదిగా అడిగింది.

"నాలోని కళాకారుణ్ణి నిద్రలేపినందుకు!"

"ఆ కళాకారుణ్ణి జీవితాంతం చైతన్యంతోనే ఉంచాలని ఆశ."

జయ కళ్ళల్లోకి చూశాను.

"కృష్ణా! ఏ నిర్జనప్రదేశాల్లోకో వెళ్ళిపోయి సెలయేళ్ళతో, వచ్చిక బయళ్ళతో నిండిన మందరప్రకృతిలో స్వేచ్ఛగా విహరిద్దాం! కల్మషంతో నిండిపోయిన ఈ మనుషులికి, మనసులకి దూరంగా రావూ!" నా మొహంలో మొహం పెట్టి అడిగింది జయ.

నాలో సన్నగా వణుకు.

మాట్లాడకుండా నా గదిలోకి వెళ్ళాను.

అయిదునిముషాల తర్వాత తిరిగి వచ్చేటప్పుడు నాలో నిండుగా హుషారు. ఈ లోకాన్ని జయించినంత సంతోషంగా వుంది.

"ఈరోజు గోల్కొండ ప్రోగ్రామ్. నన్ను తీసుకెళ్ళి చూపించాలి నువ్వు." హడావుడిగా వస్తూ అంది జయ.




క్షణంసేపు ఆలోచనలో పడ్డాను.

"ఈరోజు నేను ముఖ్యమైన పనిమీద బయటికి వెళ్ళాలి! దాని ఫలితంమీదే నా భవిష్యత్తు ఆధారపడి ఉంది."

జయ నా సమాధానంకోసం ఆశగా చూస్తోంది.

'ఊహూ! నా పనిమీద బయటకు వెళ్లాలి ముందు.' మనసు తొందరచేస్తూంది.

"సారీ, జయా! నా కీరోజు పనుంది."

జయ కళ్ళలో నిరాశ.

"రేపు వెళ్దాంలే!" జయ బుగ్గమీద చిటికవేసి చెప్పి వడివడిగా బయటకు నడిచాను.

* * *

సాయంత్రం అవుతుండగా ఇంటికి వచ్చాను. మనసులో నిరుత్సాహం వెల్లువలా సాగుతూంది.

దుఃఖం, ఆవేదన, కసి గుండెలో తెలియని బాధ.

హాల్లోకి అడుగుపెట్టేసరికి రాధ! జయతో మాట్లాడుతోంది.

నేను ఎవరితోనూ మాట్లాడకుండా నా గదిలోకి వెళ్ళిపోయాను.

మరునటిరోజు జయా, నేను గోల్కొండ వెళ్ళలేదు.

* * *

గాలి తీసేసిన బెలూన్‌లా జీవితం చప్పగా అయిపోయింది.

రాధ విసుర్లు- హేళనలు, వ్యంగ్యోక్తులు.... యాంత్రికజీవితం ప్రవః

ప్రారంభం. జయతో నేను చనువుగా మాట్లాడేటప్పుడు రాధ పుల్లవిరుపు మాటలు వింటుంటే నాకు ఎందుకో బాధగా ఉండేది. ఆ మాటల్లో వాడికి తట్టుకో లేక జయకళ్ళల్లో ఉద్భవించిన కన్నీటిధార - నా గుండెల్ని కరిగిస్తూ జన్మజన్మ లకూ మరచిపోలేనంత విషాదం!

* * *

ఆ రోజు—

రాధ వంటింట్లో ఉంది. హాల్లో నా తాజ్‌మహల్ చిత్రానికి ఫైనల్ టచెస్ ఇస్తున్నాను.

జయ నెమ్మదిగా వచ్చి నా పక్కనే నిలబడింది.

"అలా వెళ్ళి బజార్నుంచి కూరగాయలు తేకూడదూ! ఎంతసేపు ఆ పిచ్చి గీతలు గీసుకుంటూ ఆ వగలాడితో కులుకుతూ కూర్చుంటే కడుపు నిండుతుందా? ఆదేవన్నా వండి వడ్డిస్తుందా?" జయని గమనించకుండా రాధ కంఠం కటువుగా పలికింది.

నేను గాభరాగా జయ మొహంలోకి చూశాను.

నిశ్చలంగా ఉన్న జయ అదురుతున్న పెదవులు విచ్చుకున్నాయి.

"కృష్ణా! నాతో వచ్చేస్తావా?" గంభీరంగా అడిగింది జయ.

ఉలిక్కిపడ్డాను. రెండు నిముషాలు మాట్లాడలేకపోయాను. అయిదు.... పది ...పదిహేను నిముషాల తర్వాత "సారీ, జయా! క్షమించు."

ఆ ఒక్కమాట పలకటానికి నా సర్వశక్తులూ కూడదీసుకోవలసి వచ్చింది.

జయ ఏమీ మాట్లాడలేదు.

చాలాసేపటి తరువాత-

"మిస్టర్ వంశీకృష్ణా! మీ చిత్రాల్లో రంగులకలయిక మీకు తెలియటం లేదు. అది సరిదిద్దుకునేవరకూ మీరు మంచి చిత్రకారులు కాలేరు." నిశ్చలంగా చెప్పి వడివడిగా నడిచింది జయ.

తదేకంగా చూస్తున్నాను నేను.

గుమ్మందగ్గర ఆగింది జయ.

"వంశీకృష్ణా! కొంత కష్టపడినా సరే దాచుకున్న కాగితంపూలు పారేసి గులాబీని అందుకోగల శక్తి నాకుంది." వెనక్కి తిరక్కుండానే చెప్పి వడివడిగా పారిపోతున్న జయ- కన్నీటితెర కప్పిన నా కళ్ళకు అస్పష్టంగా కనిపించింది.

"గాడ్ బ్లెస్ యూ!" అస్పష్టంగా నాలో నేనే గొణుక్కుని నా తాజ్‌మహల్ చిత్రంతోపాటు నా గదిలోకి వెళ్ళి తలుపులు మూసుకున్నాను.

* * *

చేతిలోని తాజ్‌మహల్ చిత్రం చూసుకున్నా, ఉత్సాహంగా లేదు. నేల మీద పెట్టేశాను.

ఒకమూల మంచం, పక్కనే టేబుల్ ఎదురుగా షెల్ఫ్-నాలుగు అరలతో:

ఒక అరలో అమ్మానాన్న - చిన్నపిల్లవాడిగా ఉన్నప్పుడు నన్ను ఒళ్లో కూర్చోబెట్టుకుని తీయించుకున్న ఫోటో.

రెండో అరలో నన్ను ఆహ్వానిస్తూ వరసగా విస్కీ-సీసాలు. నిండుగా ఒక సీసా విప్పి గడగడా తాగేశాను. గొంతు మండుతూంది. అంతే మరేంలేదు. విస్కీ-మత్తుకు లొంగలేనంత బలహీనమైంది కాదు నా మెదడు. ఖాళీసిసా ఒక మూలగా విసిరేశాను. నిండు విస్కీ-సీసాలపక్కన రెండేళ్ళక్రితం ఒక ఎక్స్‌రే రిపోర్టు—టి.బి. మొదటిస్టేజిలోది. తరువాత మళ్ళీ ఎక్స్‌రే తీయించుకోలేదు.

మనసంతా బరువుగా వుంది.

మూడవ అరలో సిరెంజి అందుకున్నాను. పక్కనే ఉన్న మార్ఫియా, పెథిడిన్, హిరాయిన్—నన్ను పిలుస్తున్నాయి. సిరంజి లోడయింది.

మత్తుగా శరీరం గాలిలోకి తేలిపోతున్నట్టుంది.

తియ్యని అనుభూతిలో విషాద గీతిక—జయ జ్ఞాపకం.

ఆ రోజు జయని విడిచిపెట్టి వెళ్ళినరోజు. కోటి ఊహల్తో - జయ చేతిని అందుకుని జీవితాంతం ముందుకు వెళ్ళాలనే తపన.

కానీ ఆ రోజే:

"సారీ: వంశీకృష్ణా: రెండేళ్ళక్రిందటే మీకు చెప్పాను. మీరు ఏమీ శ్రద్ధ కనబరచలేదు. మీ శరీరం పూర్తిగా విషపూరితమైపోయింది. పెడిటివ్స్‌కి మిమ్మల్ని మీరు అర్పణ చేసుకున్నారు. అదిగాక టి.బి. మిడిల్‌స్టేజీ, కాన్సర్ ప్రైమరీస్టేజి. సో:సారీ: యూ ఆర్ టూ లేట్: మీరు....మీరు మరో సంవత్సరం కంటే...." డాక్టర్ మాటలు పూర్తిగా వినకుండానే వచ్చేశాను.

నేను పిచ్చిగా ప్రేమించిన జయని మోసంచెయ్యలేదు. వనకన్యలా నిండుగా కనిపించే జయ మొహంలోని సింధూరపుబొట్టు నేను నా చేతులారా చెరిపి వెయ్యలేదు- అంతేచాలు నాకు.

మత్తుగా ఉంది. మార్ఫియా పనిచేస్తోంది.

ఒళ్లు తూలింది. పడబోయి ఆసరాగా టేబుల్‌ని అనుకున్నాను. చెయ్యి తగిలి టేబుల్‌మీది సీసాలో ఇండియన్ ఇంక్ క్రిందపడున్న నా తాజ్‌మహల్ చిత్రంమీద పడిపోయింది.

నా మాస్టర్‌పీస్- నా తాజ్‌మహల్‌మీద అసహ్యంగా మరకలు - నన్ను చూసి నా తాజ్‌మహల్ అసహ్యంగా నవ్వింది.

—x—



# శివమెత్తిన కెరటం

## 'పైడిశ్రీ'

చిక్కటి చీకట్లను చీల్చుకుంటూ వేగంగా పరుగెడుతోంది రైలు.

కిటికీలోంచి వీస్తున్న చల్లటిగాలితో బాటు విసురుగా ఓ లావాటి వానచినుకు వచ్చి ముంజేతిమీద పగిలిపోవడంతో ఉలిక్కిపడి కళ్లు తెరిచాడు పిచ్చిరెడ్డి. దవడలు కటకటలాడుతూండగా అవులిస్తూ తనతోబాటే ప్రయాణిస్తున్న పంతుల్ని తట్టి లేపేడు.

ఉలిక్కిపడి మేలుకున్న పంతులు శ్వాస బలంగా వదిలి ఒళ్లు విరుచుకుంటూ "ఇప్పుడు బండెక్కడుందండీ రెడ్డిగారూ" అనడిగేడు.

"జీళ్ళలంక దాటినట్టుంది." అంటూ కిటికీలోంచి బైటకుచూసి చీకట్లో ఏమీ కనిపించకపోవడంతో యధాలాపంగా లోపలికి చూస్తూ అనుకోకుండా ఎదురుగా పైనున్న బెర్తుమీదికి చూసేడు పిచ్చిరెడ్డి.

రాబోయిన అవులింత ఆగిపోయింది. ఎక్కడెక్కి కూర్చున్నాడో గాని లచ్చిగాడు బెర్తుమీద ఒకాలు ముడిచి మరో కాలు ప్రక్కకి బారచాపి కూర్చుని కనిపించేడు ఎటుకేసో చూస్తూ. లచ్చిగాడు, పిచ్చిరెడ్డి, పంతులు ఒకవూరి వాళ్ళే. కరణాలవారన్న కారణంగానో, కూలి నాలి చేసుకుని కడుపు నింపుకునే వాడన్న చులకన భావంతోనే, లేక ఎప్పుడూ దారిద్ర్యపు విషదంష్ట్రిల్లో చిక్కి, చిక్కి శల్యమౌతూంటాడనో లక్ష్మయ్య అనే పేరుకు నీళ్లొదిలి అతణ్ణి 'లచ్చిగాడు' అనీ, 'లచ్చుంగోడు' అని ఎవరికి తోచినట్లు వాళ్లు పిలవడం పరిపాటయిపోయింది.

తనకి నోటమాటరాక ప్రక్కన కూర్చున్న పంతుల్ని కుదిపి లచ్చిగాడి వేపు చూపించేడు పిచ్చిరెడ్డి.

లచ్చిగాడివేపు చూసి పంతులు కొయ్యబారిపోయేడు. "అమ్మ నాకొడుకి గిరెక్కిందండీ! మీరు యిక్కడ క్రింద కూర్చుని వుండే ఆ నాకొడుకు అంత

ఎత్తున అలా కూర్చోటానికి ఎన్ని గుండెలు కావాల." అని స్వగతంలో అనుకున్నట్లు పైకి అనేసి, పెద్దగా 'లచ్చిగా' అని అరిచేడు, షాక్ తిన్నట్టు.

లెక్కలేనట్టు చూసేడు లచ్చిగాడు వాళ్లవేపు ఏమిటన్నట్టు. వాడు అలా చూడడం, అందులోని లెక్కలేనితనం గమనించిన పిచ్చిరెడ్డి మొహం కంద గడ్డలా తయారయింది. ఆవేశం, కోపం అవధులుదాటి గుండెల్ని తన్నుకుని స్వర పేటికను పగులగొడుతుండగా చంద్ర నిప్పులా మండే కళ్ళతో ఉరిమిచూసేడు.

"ఏందిరా ఆ సూపు... ఎట్టినాకొడకా! ఇంత 'లావు' రెడ్డిగారు యిక్కడ కూకు దుంటే నువ్వా 'పెక్క'మీద దర్జాగా మారాజుబిడ్డ మాదిరి కూకోటానికి ఎన్ని గుండెల్రా!" గుడ్లురిమేడు పంతులు.

"మీతోబాటే నాను టిక్కట్టు కొన్లే దేటి!" ఎదురుప్రశ్న వేసేడు లచ్చిగాడు, కూర్చున్న పద్ధతి కొద్దిగా మార్పుచేస్తూ, సర్దుక్కూర్చుంటూ.

"రెడ్డిగోరు తానాలాడిన సీల్లతో గొంతు తడుపుకునేటోడివి, ఆయన కొట్టాంలో ఎద్దులేసిన పేడలో గింజల్ని ఏరుకుని గంజికాసుకు బతికేటోడివి.... పూర్వోర్ని కానీపేగల పెద్దమడిసి యీడ కూకుదుంటే పేడబురగ నాకొడకా నువ్వాడ కూకుంటవా! దిగు నాకొడకా" అదుపుతెచ్చుకున్న కోపాన్ని పొదుపుగా ఒలకబోసేడు పంతులు.

పంతులు మాటలకు లచ్చిగాడి మొహంలో రక్తం పొంగుకొచ్చింది. మొహం కోపంతో ముడతలుపడి ముప్పయ్యేళ్ళ లచ్చిగాడు అరవయ్యేళ్ళ ముసలాడిలా కనిపించేడు. వాడు కూర్చున్న భంగిమలో, తొడుక్కున్న చిరుగుల చొక్కాలోనూ, భుజమ్మీద తువ్వాలు లోనూ, నల్లటి చారలురేగి గుంటలుపడ్డ కళ్లలోనూ, కళ్లల్లోంచి దూసుకువచ్చే 'ఎర్రటి' చూపులోనూ పంతులుకు వచ్చిన కోపంలాంటిదే చిటపటలాడు తోంది. ఆ క్షణంలో- పేదోడి కోపానికి, పెద్దోడి కోపానికి మధ్యవున్న అద్వైత బాంధవ్యం అంతర్లీనంగా ధ్వనింప సాగింది ఆ దృశ్యంలో.

"దిగమంటే అట్టా సూత్తావేరా!" రెట్టించాడు పంతులు.

"ఎందుకు దిగాల" మామూలుగానే అడిగేడు లచ్చిగాడు.

"ఎందుకు దిగాలా!!" ముక్కుమీద వేలేసుకుంటూ కనుబొమలు వెడల్పు చేస్తూ పిచ్చిరెడ్డివేపు చిత్తరవోతున్నట్లు చూసేడు పంతులు.

"అవునయ్యా ఎందుకు దిగాల! నేను అందర్లాటి మడిసినిగానా! మీ మాదిరి టిక్కట్టు కొన్లేదా! టిక్కట్టు కొని రైలెక్కినోడికి అది యిట్టవొచ్చిన కాడ కూకునే అక్కుంది. అవసరం పడితే యీడంటే ఆడ తొంగునే అక్కూవుంది. ఆ మాత్తరం తెలీవోల్లమనుకున్నావేటి!"

తనకు తెలిసినదాన్ని తెలియనిదానితో కలిపి తెలిసీతెలియనట్లు మాట్లాడిన లచ్చిగాడి మాటల్లో బాలా అపశ్రుతులు పలికేయి.

"అచ్చరం ముక్కెరగని అద్దాసి నా కొడుకులా అక్కుల గురించి మాట్లాడే కాడికొచ్చేరండీ రెడ్డిగారూ. ఇదంతా తమ రిచ్చిన చనువే. ఇంకా అట్టా సూత్తూ కూకున్నారేటి. లెగిసి ఆ గమార్నా కొడుకుని నాలుగు జబుర్లు జబరకా?" పంతులు రెచ్చగొట్టినట్లు మాట్లాడేసరికి, అప్పటికే పట్టలేని కోపంతో వూగి పోతున్న పిచ్చిరెడ్డి పళ్లునూరుతూ దిగ్గున పైకి లేచి లచ్చిగాడివేపు 'పంజా' విసిరేడు,

అప్పటిదాకా అవాక్కయి చూస్తున్న కంపార్ట్‌మెంటులో వాళ్లంతా ఒక్క పారిగా చైతన్యం తెచ్చుకుని పిచ్చిరెడ్డి ఉక్కు బాహుల్లోంచి లచ్చిగాణ్ణి తప్పించి, లచ్చిగాడివేపు అసహ్యంగా ఏవగింపుగా చూస్తూ "ఎవరయ్యా నువ్వు. ఏమిటా మొండితనం. పెద్దాళ్లు చెబుతుంటే విని పించుకో వన్లే?" అంటూ రెడ్డిగారినీ పంతుల్నీ బెర్తుమీదికి పంపించి లచ్చిగాణ్ణి యింతకుముందు వాళ్లు కూర్చున్న పీట్లో కూర్చోబెట్టి పరిస్థితిని చక్కబరిచేరు.

"నా కింద కూకుని నా అడుగులకి మడుగులొత్తాల్సిన దేబిర్నాకొడుకులు పైన మాకోసనుంటే కడుపు కార్చిచ్చుల బానైనాది పంతులూ. అళ్లు అడ్డంతియ్యడం యింకో బెణం అలిసిమైవట్టుయితే యీ పాటికి ఆ నాకొడుకు పేనాలు ఆకాశంలో తేలేవి. రెడ్డిగారంటే ఏమనుకున్నాడో ఏమో" అంటూ గర్వంగా మీసంమీద చెయ్యేసి తిప్పుతూ తన రెండుకాళ్లు సరిగ్గా లచ్చిగాడి నెత్తిమీద వుండేట్లు ఎదురుగావున్న బెర్తుకి ఆనించి, విలా సంగా కదిలించ సాగేడు.... పిచ్చిరెడ్డి.

ఆ చెప్పుల తాళ్లు అలా కదుల్తుంటే రాలిపడే మట్టి లచ్చిగాడి నెత్తిమీద గుట్ట పడుతోంది. అది గమనిస్తూ పకపకా నవ్వుతుంటున్న పిచ్చిరెడ్డి, పంతులు మొహాలకేసి తీక్షణంగా చూసేడు లచ్చి గాడు. ఒక నిముషం తర్వాత వాళ్ల నవ్వుల్లో వున్న అర్థం గ్రహించి మింగే సేట్టు చూస్తూ "నెత్తిమీద మట్టి పడ తాంది." అన్నాడు రెడ్డివేపు చూస్తూ.

"పడితే తీసి కళ్ల కద్దుకుని నోట్లో వేసుక్కో". అన్నాడు పంతులు రెచ్చగొట్టే ధోరణిలో.

ఆ మరుక్షణం టి.టి.ఇ. కంపార్టు మెంట్‌లోకి ప్రవేశించి "టికెట్ ప్లీజ్" అని గనుక అనకుండా వుంటే ఏం జరిగేదో మరి. అప్పటికి ఆ వేడి చల్లబడి పోయింది.

బైట సన్నగా తుంపర!

అర్ధగంట ప్రయాణంలో రెడ్డిగారి తరపున వకాల్తా పుచ్చుకుని పంతులు 'కూసే కారుకూతల్ని' అతికష్టం మీద సహిస్తూ వచ్చేడు— లచ్చిగాడు. తన బల

హీన కోణాలమీద విలబడి 'బంతాట' ఆడుకునే ఆ యిద్దర్నీ చూస్తోంటే ఆవేశం ఆకాశ పర్యంతమౌతూవున్నా ఎక్కణ్ణించో వచ్చి ప్రవాహంలా కమ్మేస్తున్న విస్సహాయత అతన్ని నిరీర్యుణ్ణి చేసేసింది. తవలో తమ ఏడ్చుకోవడం మినహా మరేం చెయ్యలేకపోయాడు. సరిగ్గా అప్పుడే ఆకాశవీధిలో వేగంగా వరుగెడుతున్న కొండలాంటి నల్లమబ్బు ఒకటి తొలి ఉరుము ఉరిమి, తొలిజల్లు కురిపి మిగతా మబ్బులకేసి గుర్లురిమి మెరుపు చూపొకటి చూసింది, నన్ను అనుసరించండి అన్నట్టు.

జోరున వర్షం.

కుళ్లగుంట స్టేషన్లో రైలాగింది. అక్కణ్ణించి ఆ గ్రామానికి వెళ్లాలంటే తూర్పుదిక్కుగా ఒకటిన్నరమైలు వడవాలి. రెడ్డిగారికోసం తయారుగా వున్న గుర్రపుబండిలో రెడ్డి, వంతులు ఎక్కేరు. లచ్చిగాడు పంచె బాగా పైకి ఎగదోపి, చొక్కావిప్పి చుట్టచుట్టి చంకనెట్టి భుజమ్మీద చిల్లుల తువ్వాలు నెత్తికి చుట్టుకుని నడక సాగించేడు.

రెడ్డిగారి బండి అతన్ని అవహేళన చేస్తూ దాటిపోయింది. ఆ బండి తాలూకు గొప్పతనం గుర్రపుడెక్కల చప్పుడులో కలగలసిన వర్షంలో ప్రతిధ్వనిస్తూనే వుండిపోయింది.

ఆదే సమయంలో—

భూనభోంతరాళాలు దద్దరిల్లేట్లు కొండలాంటి ఉరుము: దాని వెనుక కళ్లల్లోంచి కంటిపాపల్ని పుటుక్కున తెంపేసి చంటిపాపల్లా ఏడిపించగల తెలుగు మెరుపు. ఆ మెరుపు వెలుగులోనే తప్పిపోయిన తన దారిని సరిచేసుకుని అసలు దారికి వచ్చేడు లచ్చిగాడు.

చుట్టూ చీకటిగుండంలాంటి రాత్రి: చెంపల్ని, పీపుని చేతికి అందిన ప్రతి అవయాన్ని చెళ్లున చరుస్తూ అడుగడుక్కీ బెదిరించే వాన: అన్నింటిని మించి అతని ఓపికకు పరీక్షపెడుతూ చెప్పులు లేని కాళ్లతో చిక్కుపడిన నిస్సత్తువ. అయినా లచ్చిగాడి నడక ఆగలేదు.

* * *

మూడు రోజులుగా—

సన్నగా దట్టంగా తగ్గుతూ హెచ్చుతూ కురుస్తూ వెలుస్తున్న వర్షం పిచ్చివాడి అర్థంలేని నవ్వులా వుంది. ఆ వర్షాన్ని కుళ్లగుంట గ్రామస్థులు అంతగా పట్టించుకోకపోయినా ఆ వూరికి అరమైలు దూరంలో వున్న గంగచెరువు మాత్రం వర్షజలంతో పీకలదాకా మునిగి విందు చూలాలు మాదిరి నొప్పులు పడుతోంది. మూడురోజులుగా వెలుతురు మొహం చూడకుండా గూటిలో గువ్వల్లా యిళ్లలో ముడుక్కున్న జనానికి యీ సంగతి తెలీదు. ఒకరూ అరా బైటికొచ్చినా ఎవరూ చెరువు దాపులకు వెళ్లలేదు.

వున్నదేదో వండుకు తినటం, ఊపిరి ఉసురు తగ్గేదాక నిద్రపోవడం, మధ్యలో వర్షం రవంత తెరపిస్తే కాలకృత్యాలు ముగించుకోవడం, రేడియో వున్నవాళ్లు వాతావరణ హెచ్చరికలు వినడం. ఆ హెచ్చరికలపట్ల అనాసక్తిలేనివాళ్లు జనరంజని రికార్డులు వినడం—యివి మూడు రోజులుగా ఆ వూళ్ళో మనుషులు పడిపోయిన యాంత్రిక చర్యలు. ఈ చర్యలకు బద్ధులై బయట ప్రకృతిలో జరిగే మార్పుల్ని అంతగా పట్టించుకోలేదెవరూ.

వాచీలు ఉన్నవాళ్లకు తప్ప అప్పుడు సమయం ఒంటిగంటయిందని తెలీదు చాలామందికి.

సరిగ్గా అప్పుడే రేడియోలోంచి తుఫాను హెచ్చరిక వినబడింది. ఆ నోట ఆ నోట పాకి అది వూరంతా పాకిపోయింది. అంత వర్షంలోనూ జనంలో ఒకలాంటి అలజడి. జీవితంపట్ల పేరుకుపోయిన ఆశ వాళ్లని నానా రకాలుగా ఆడించసాగింది.

అన్నం కుండలు గడగడలాడేయి.

దండెం మీద ఆరవేసిన దుప్పట్లు శరీరాలకు అల్లుకుపోయేయి.

పాత పంచెలు, లుంగీలు, తువ్వాళ్ళు తలపాగాలైనయ్.

పొగాకు కాడలు, బీడీలు, సిగరెట్లు, అగ్గిపెట్టెలు శరీరంలో తడి తగలని మూలలకు చేరుకున్నాయి.

వూరికొంపల్లో వుండేవాళ్లంతా పెద్దిరెడ్డిగారి మిద్దింటికి చేరుకున్నారు. రెడ్డిగారికి యీ మధ్య హైదరాబాదు నీళ్ళు తగిలి యింట్లో మొజాయిక్ ఫ్లోరింగ్, పెద్ద పెద్ద వాల్ పేపర్ పెయింటింగులు. జరీ అంచు పరదాలు, ఖరీదైన సోఫాసెట్లు, ఘుమ్మెత్తించే సెంటువాసనలు వెలిసినయ్. వాటిని తనవూరి అలగాజనంతో మలినంచేయడం యిష్టంలేక "గోడల్లో పగుళ్లు చూసేరా....? తుఫాను యింకా చెలరేగితే యిది వుంటుందో, కూలిపోతుందో తెలీదు! అంచేత మీరంతా ఆ బడికొట్టంలోకి వెళ్లండి. హెడ్మాస్టారి నడిగి మీకు తాళాలు యిప్పిస్తాను" అంటూ అందర్నీ బడికొట్టంలోకి నెట్టేసేడు పెద్దిరెడ్డి.

ఆ విషయమేమీ పట్టనట్టు తన చుట్టు గుడిసెలో ఓ మూల్న ఒదిగి కూర్చుని 'మారుబువ్వ' త్రాగుతూ తన పడుచు పెళ్లాంతో సరసాడుతున్నాడు లచ్చిగాడు. 'ఇంకా వారం రోజులకు సరిపడే గింజలున్నాయి. ఈ వాన యింకో వారం కురిసినా ఫర్వాలేదు.' ఇదీ వాడి ధీమా.

ఉట్టిమీద అడుగు ముంతలో దాచిన ఉల్లిపాయ మొగుడికి అందిస్తూ, "ఇదో మడిసీ .... బూదినటం తొరగా కాస్నీ, జనవంతా పెద్దిరెడ్డోరి మిద్దింటికెల్లన్నారూ" అంది మాలచ్చిమి తొందరిస్తున్నట్లు.




"ఎందుకంట?" అందుకున్న ఉల్లి పాయను పరపరలాడిస్తూ అడిగేడు లచ్చిగాడు.

నిర్లక్ష్యంగా అడిగిన మొగుడుకేసి విచిత్రంగా చూసింది మాలచ్చిమి.

"ఎందుకేటీ? ఇయ్యాల గొప్ప తుఫానుందని రేడియోవోళ్లు సెప్పిర్రంట. ఇందాక ఉప్పు పెట్టించుకోటానికొచ్చి అసిరమ్మ సెప్పినాది."

"అందుకని?" లచ్చిగాడు నిర్లక్ష్యంలో మార్పులేదు.

"పెద్దిరెడ్డిగోరి మిద్దింటికి తరెల్లి పోతున్నారు జనం. అల్లెంట మనంకూడా ఎల్దాం, అదీ యిసియం" కోపంగా తార స్థాయిలో ప్రారంభించిన మాట కొసరు నవ్వులాంటి నవ్వుతో ముగించింది మాలచ్చిమి

పెద్దపెట్టున నవ్వేడు లచ్చిగాడు.

కంచం తీసేస్తూండగా మొగుడు నవ్విన నవ్వుకు నాజూగ్గా ఉడుక్కుందామె.

"ఒసే మాలచ్చిమే: తుపానుకి బయపడి అందరం ఆ పెద్దిరెడ్డోరి మిద్దింట్లో సేరినమనుకో. అప్పుడు వున్నట్టుండి ఆ మిద్ది కూరిపోనాదనుకో. అపుడేటి మన గతి?" మాలచ్చిమినే చూస్తూ అన్నాడు లచ్చిగాడు.

"అర్ని జిమ్మడిపోను, నీ నోరు సచ్చుబడిపోను. నోరు తెరిస్తే మంచి మాట ఒకటీ రాదుగా. ఎవురన్నా యింటే ఏటమకుంటారంటా?" అని నేలమీది మెతుకుల్ని వూడుస్తూ, "ఇసుమంటి ఎర్రి మొర్రి ఆలోచన్లుండబట్టే మనం యీ గుడిసెల్లో; ఆ మారాజులు మిద్దిళ్లల్లో" అంది, తన సహజ వేదాంత ధోరణిలో.

"ఓసిసి.... ఎంత నాజూగ్గా సెప్పినావే" అంటూ మాలచ్చిమిని వెనగ్గా

కౌగిలించుకుని ఉక్కిరిబిక్కిరి చేయ సాగేడు లచ్చిగాడు.

"ఇదుగో.... ఏటది.... ఒదులు...." విదిలించుకోబోయిందామె.

"అటు–బైటికి సూడు. వాన ఎంతగా దంచేస్తోందో"

"దానికి దీనికి ఏటి సమ్మందం?"

"వుంది. ఇవరంగా చెబుతా రా" అంటూ కాలితో తడికని మూసేసి మాలచ్చిమిని మంచంమీద దొర్లించి ప్రక్కన చేరేడు లచ్చిగాడు. ఆ తర్వాత చాలాసేపటికి అలసిపోయి ఒకరికేసి ఒకరు చూసుకుంటూ ఒకరి గుండెలమీద స్వేదబిందువుల్ని మరొకరు లెక్క పెట్టు కుంటున్న సమయంలో బైట ఎవరో అనుకుంటూ పోతున్నారు. "పెద్దిరెడ్డోరి మిద్దిల్లు కూలిపోయిందంట. పీచు మిగల్లే దట".

ఆ మాటలు వినిపించి లచ్చిగాడు, మాలచ్చిమి ఒకరి మొహాలొకరు చూసు కున్నారు. మరుక్షణం ఆమె మొగుడి ప్రక్కలోంచి లేచి రవికె తొడు క్కుంటూ "నీ నోరేం నోరు. నీ నోట్లో మట్టిగొట్ట. నువ్వు అన్నావు, ఆ మిద్దిల్లు కూలింది" అంటూ రవికె ముడేసుకుంటూ అంత వానలోనూ వీధిలోకి పరుగు తీసింది, నలుగురితోపాటు. అలా నలు గురితోబాటు పరుగెత్తక ఒకచోట చేరిన కొందరికి ఆ వార్త వీనులవిందుగా వుంది.

"కూలాలి. ఇంకా కూలాలి. ఆ భూలంలో కోతకొచ్చింది సూడూ, ఆ పంటకూడా పీచు మిగలకుండా రాలి పోవాల. అది 'సరవస్తం' ఏ అగ్గికో బుగ్గయిపోవాల"

"ఏట్రా ఆ పాడుమాటలు?"

"లేకపోతే ఏటి? అది మిద్దికి వాళ్లెత్తిం దెవరు. రేయింబగుళ్లు పిట్రపొక్కు లెల్లెట్టుకోవి వన్నేసి అంత అందంగా మిద్ది కట్టిందెవరు? మనం అనుమంటి మనల్ని అది మిద్దిలోకి రానిస్తే ఆరేడ బురదవుద్దోనని మిద్ది కూలిపోయేటట్టుంది అని సాకు సెప్పి అందర్నీ యీ బిడి కొట్టంలోకి తోల్నాడు. దేవుడి దయవల్ల అడు సెప్పిన సాకే నిజమైంది కూకుంది."

ఇలా మాట్లాడుకునేవాళ్ళు మినహా, మిగతా వూరువూరంతా రెడ్డిగారి మిద్దింటి ముందు సమావేశమైంది. ఈదురుగాలికి, కుళ్ళుచిమకులు తోడై చెంపలు పగల గొడుతున్నా ఆ సమావేశం అలానే సాగింది. అయితే అది ఎంతోసేపో కొనసాగలేదు. దూరాన్నుంచి వినిపించిన ఒకానొక వర్తమానం అం చెల్లాచెద రయింది. ఆ వర్తమానం ఏమిటంటే: "గంగ చెరువు కట్ట తెగి 'ఎల్లవ' వూరి మీద పడతాంది.... ఎలిపోండెలిపోండి"

ఆ వార్త విని కొన్ని బెదురుగుండెలు చదునయి పోయేయి. మరి కొందరు స్పృహ కోల్పోయేరు. అప్పుడే స్పృహలో కొచ్చినవాళ్లు కాలికి అందిన బాటన పరుగు లంకించుకున్నారు. కొందరు హావావుడిలో వెల్లువకు ఎదురు పరుగెత్తారు. అయితే

నేం.... ఒక్కర్ని వదలకుండా తన బాహువుల్లో ఎత్తిపట్టుకుంది శివాలెత్తి వట్టున్న వరదకెరటం.

* * *

గంటకి నూరుమైళ్ళ వేగంతో ఈదురు గాలి. గండిపడ్డ గంగచెరువు, గాడి తప్పిన గోదారిపాయ కూడ బలుక్కుని కుళ్ళగుంట గ్రామాన్ని నీళ్ళగుంటగా మార్చేసేయి. ఉధృతి తగ్గని ప్రవాహంలో పశువుల మానవ కళేబరాలు, తాటి దుంగలు, జీవచ్ఛవాలు ఇక్కడ మునిగి అక్కడ తేలుతూ అక్కడ మునిగి యిక్కడ తేలుతూ దారీతెన్నూ లేకుండా ఎటో కొట్టుకుపోతున్నాయి. అంత మహా ప్రవాహంలో తన ఉనికి ఎక్కడో తెలీని ఓ తాటిచెట్టు గుబురుల్లో ప్రాణాలనుగ్గ బట్టుకుని నెత్తురోడుతున్న చేతుల పట్టు వదలనివ్వక చెళ్లు చెళ్లున చెంపలు వాయించే యీదురుగాలికి కోడయిన కుళ్ల చిమకుల కేళీవిలాసాలకు భయంతో గాభరాగా కళ్ళు అర్పుతూ తెరుస్తూ వరద బీభత్సం కేసి చూడలేక చూస్తూ కూర్చు న్నాడు లచ్చిగాడు, అంపశయ్య మీద కూర్చున్నట్టు. ఒంటిమీద ముద్దముద్దయిన చిల్లుల బనీను తప్పించి మరో నూలు పోగులేదు. మూగవాడి గుండెల్ని పగల గొట్టుకుని పొంగిన ప్రతీకారంగా విలయ నృత్యం చేస్తున్న వరదనీటికేసి చూస్తోంటే వాడి ఖుద్ర కొలిమిలో కాల్చి నలగకొడుతున్నట్లు అయిపోయింది.

కనుచూపుమేర ఎటు చూసినా నీళ్లు! నీళ్ళు! నీళ్ళు! సుడులు తిరిగే నీళ్ళు. గర్జించే నీళ్ళు! ఆవేశంలాంటి నీళ్ళు! కోపంలాంటి నీళ్ళు! పాత చరిత్ర కొత్త చరిత్రని ప్రసరించి నీళ్ళు పోసుకున్న ట్టున్న నీళ్ళు! సుడులు తిరుగుతూ, అగమ్యంగా పరుగులు పెడుతూ .... అందినదాన్ని దొరకబుచ్చుకుంటూ, కన్నతల్లిలా కడుపులో దాచుకుంటూ— నీటిమీద గడ్డికురుపుల్లా, పుట్టుమచ్చల్లా రకరకాల శవాలు! రెండు గంటల క్రితం తనతో సరసాలాడి ఉడికించి వీధిలోకి వచ్చిన తన భార్య మాలచ్చిమి యీ శవాల్లో ఒక శవంగా ఈ శిధిలశకలాల్లో ఒక శకలంగా, బ్రతికుంటే ఎక్కడో తనలాగే అనాధలా! పెద్దగా ఏడవాలని పించింది లచ్చిగాడికి. ఏడుపు రాలేదు. నవ్వొచ్చింది.

అవును తనకి కన్నీళ్ళను పొదుపుచేసు కునే అవకాశం ఎక్కడిది. పుట్టి. పురిటి కంపుకొట్టింది మొదలు యిప్పటిదాకా వూహించని జీవితపు మలుపుల్లో ఎదురు చూడని సంఘటనల్లో ఒంటరిగానో సామూహికంగానో ఏడ్చీఏడ్చీ కళ్ళలోంచి జారి యీ వరదనీటిగా మారేయి. అవును జారి యిందాక ఈనీళ్ళలో యీదేటప్పుడు చాలా గుటకల నీళ్ళు లోనికి మింగే డతను. అచ్చం కన్నీళ్ళలాంటి రుచే. అవును తప్పక యివి కన్నీళ్లే. పాపం, కాలం పునాదులు కదిలేట్లు, సృష్టిసర్వం

ప్రకంపించేట్టు, రవంత మానవత్వపు జాడకోసం, పస్తుల్లేని జీవితపు నీడకోసం తనలాగే ఎంతమంది ఏడ్చిన ఏడుపులో యీ నీళ్ళు! అవును. వాళ్ళు కూడా నాలాగే యిలా ఏదోచోట ఒంటరిగా కూర్చుని "ఇన్ని కన్నీళ్ళు నే నెప్పుడు కార్చేను" అనుకుని ఆశ్చర్యపోతుంటారు, తను ఆశ్చర్యపడ్డట్టు.

వచ్చి వచ్చి వూహాల తాలూకు పిచ్చి నవ్వొకటి లచ్చిగాడి పెదవుల మీద!

క్షణ క్షణానికి వరదనీటి మట్టం, ప్రవాహపు ఉధృతి పెరుగుతోంటే నీటి ఉపరితలానికి తను కూర్చున్న చోటుకీ మధ్యదూరం తగ్గిపోతోంటేఏంచెయ్యాలో తోచనట్టు చుట్టుప్రక్కలకి పిచ్చి చూపులు చూడసాగేడు. అంతలోనే ఆతని భృకుటి ముడిపడింది. దూరంగా ఎవరో యీదుకుంటూ వస్తున్నారు.

ఎవరై ఉయ్యుంటారు? ఎవరై తేనేం చెట్టుమీదికి లాగి రక్షిస్తే పోలా? అమ్మో ఆ మనిషిని పైకిలాగబోయి తనూ నీళ్ళలో పడితే? భయపడ్డాడు లచ్చిగాడు.

అంత ప్రవాహవేగంలోనూ రెపరెప లాడే ఆశతో ఎండుటాకులా గడ్డిపోచలా నీళ్ళు త్రాగుతూ చచ్చుపడే చేతుల్ని కాళ్ళని పట్టుదలగా కదిలిస్తూ చావుకళ కబళించిన మొహంతో ఎదురుగా కని పించే తాడిచెట్టుకేసి ఆశగా, భయంగా, కంగారుగా ఏకస్తూ ఆలోచిస్తూ ఈదు కుంటూ మొండి ధైర్యంతో ప్రయాణించే ఆ ఆకారంకేసి చూసిన లచ్చిగాడు కొయ్యబారిపోయేడు.

పిచ్చిరెడ్డి! వూరూర్నే కానీసేగల మారాజుకి ఎంత దుర్గతి. తన అభిజాత్యం తెచ్చిన పైత్యంతో అహంకారంతో అరుస్తూ, అరుపుల వెనుక అధముల ఆర్త నాదాల్ని సమాధిచేస్తూ తన అహంతో అధికారంతో వూరిని యిష్టారాజ్యంగా పాలిస్తున్న యిద్దరు రెడ్లలో ఒకడు.... పిచ్చిరెడ్డికి పాపం ఎంతటి కాని కాలం! అచ్చం తనలాగే ప్రాణభయంతో, జీవితం మీద ఆశతో, ఏడ్చుకుంటూ, తలవరి పడుతూ, కాలాలకు మొక్కుకుంటూ, కన్నీళ్ళను వరదనీళ్ళతో కలిసి త్రాగుతూ, నీళ్ళమీద దోక్కుంటూ:

అంటే, కాలం జరిపే విచారణలో ఎవడి విషయంలోనూ హెచ్చుతగ్గు ల్లేవన్నమాట.

లచ్చిగాడు గుండెల్లో బరితెగించిన అడదానిలాంటి నవ్వు, పైకి నవ్వలేదు. తనువున్న చెట్టువేపే యీదుకుంటూవచ్చి మొండిగా గుడ్డిగా చెట్టును కౌగిలించుకుని తలవాల్చేసిన పిచ్చిరెడ్డినే వింతగా చూడ సాగేడు లచ్చిగాడు.

అతణ్ణి చెట్టుమీదికి లాగితే? ఒద్దొద్దొ ద్దొద్దు! ఏం ఎందుకని?

ఊరవతల చింతచెట్టు ఎక్కి ఆ వేళ్ళకి కూరకి పనికొస్తుందని చింత చిగురు కోసుకుంటుంటే పాలేళ్ళచేత

రాళ్ళువేయించి తనని క్రిందకు పడగొట్టి, గొంతుమీద కాలు నొక్కిపెట్టి వికృతంగా నవ్విన రెడ్డి, యితడే! ఒంట్లో సత్తువలేక ఒకపూట పనిలోకెళ్ళనందుకు నడివీధిలో పదిమందీ చూస్తుండగా కిర్రు చెప్పుల కాళ్ళతో తనని పొర్లించి తన్నిన రెడ్డి ... యితడే!! ఇంతెందుకు మొన్నటికి మొన్న రైల్లో వస్తుంటే 'తన కన్న పైన' కూర్చున్నందుకు జుట్టుపట్టి లాగి పీక నులమబోయిన రెడ్డి యితడే! తను జోరువానలో నడుస్తోంటే గుర్రబగ్గీలో పరిహాసిస్తూ సాగిపోయిన రెడ్డి....ఇతడే! పిచ్చిరెడ్డి!!

అటువంటి రాక్షసుణ్ణి యిప్పుడు తను పైకిలాగి రక్షించాలా? పాపం .. ఈ రెడ్డి అప్పటి 'రెడ్డి' కాదు. అచ్చం తన్లాగే యూడ్చితన్నిన వరదతాపుకు కీళ్ళు విరిగి చావులో లేదా చావుబతుకుల సంధ్యాకాలపు నెత్తుటి నీడల్లో జీవన పోరాటపు సమానత్వ సూత్రాన్ని కళ్లారా చూపిన రెడ్డి! తను చూస్తూ వూరుకుంటే తన కొరిగేదేంటి 'ఆ అయ్యనట్టాగే ఒడిలేత్తే అయనకీ నాకూ తేడాయేటి? వుంటే అదిపాపం అదికే వుంటుంది." అనుకుంటూ మెల్లగా జాగ్రత్తగా తూచితూచి ఒక్కో అంగుళం క్రిందికి జారి సరిగ్గా నెత్తిమీద ఆగి "అయ్యా!" అని పిల్చేడు. ఆ పిలుపుకు భయపడో, అదరిపడో, ఉలిక్కిపడో పట్టుతప్పి నీళ్ళలోకి జారబోయిన పిచ్చిరెడ్డిని బలమంతా ఉపయోగించి పైకి లాగాడు లచ్చిగాడు. తన మొహంలోకి పసిపిల్లాడిలా చూస్తున్న పిచ్చిరెడ్డి కళ్ళలో ఉబికే వెలుతురు కన్నీళ్ళకు చలించిపోతూ 'పర్లేదయ్యా నేనే! లచ్చిగాణ్ణి! తమరు కాసింత ఓపిక చేసుకుంటే సెట్టుమీదకి సేరేత్తాం." అన్నాడు. ఒక చేయి తనకి అందించి మరోచేత్తో చెట్టుపైకి ప్రాకలేక ప్రాకుతున్న లచ్చిగాడివేపు చూస్తోంటే రెడ్డిగారి గుండెల్లో లజ్జ, వినయం, కుమ్మక్కయి పోట్లాడుకోసాగినయ్.

"ఒరే లచ్చిగా!" ఆర్తిగా పిల్చేడు పిచ్చిరెడ్డి.

"ఏందయ్యా!" ప్రాకడం ఆపి క్రిందికి చూస్తూ అడిగేడు లచ్చిగాడు.

"కాస్తంత ఆగరా...."

"ఎందుకయ్యా!"

సరిగ్గా తన నెత్తిమీద వున్న లచ్చిగాడి నెత్తురోడే పాదాన్ని పవిత్రంగా స్పృశించి కళ్ళకద్దుకుంటున్న పిచ్చిరెడ్డివేపు కలవరపడుతూ చూసేడు లచ్చిగాడు.

"అయ్యా .... ఏటయ్యా . ఏటా పిచ్చి కాష్టలు!?"

"పిచ్చి చేష్టలు కాదురా. వరదనీళ్ళలో చిక్కుకోకముందే ఏడుకొండల ఎంకటేసుల్ని, యింకా గుర్తొచ్చిన దేవుళ్ళనందర్నీ మొక్కుకున్నాము. ఏ దేవుడూ నన్ను రచ్చించలేదు. ఇదుగో ఈ దేవుడు మాత్రం రక్షించాలని చూస్తున్నాడు.

కాపాడే లచ్చిగా .... నిన్ను కాళ్లతో తన్నినాను గదరా. ..కొరడాల్తో గొడ్డును బాదినట్టు బాదినాను గదరా .... పిడికెడు మాకలిచ్చినందుకు పుట్టెడు చాకిరీ చేయించుకున్నాను గదరా ... అయ్యాన్ని నీకు గుర్తులేవూ ... గుర్తుంటే నన్ను పైకి లాగవురా. ఇట్నుంచికే నీళ్లలోకి యిసిరేత్తావు." చెట్టు బోదెను కావిలించుకుని పిచ్చాడికిమల్లే ఏడుస్తున్నాడు పిచ్చిరెడ్డి.

ఒక ప్రక్క నరాల్లో జీర్ణించుకుపోయిన అహం: రేపు తను బ్రతికి బట్ట గట్టినా పదిమంది ముందు తనని ఒక అధముడు రక్షించాడని ఒప్పుకోగలడా? ఆ విషయం క్షణం క్షణం గుర్తొస్తోంటే ఆ బాధకు తను తట్టుకోగలడా... ! వరద ఉరవడి హెచ్చి కాళ్ల దగ్గర తారాడుతున్న నీటి ఉపరితలాన్ని భయంగా చూసేడు పిచ్చిరెడ్డి ఆలోచనలకు స్వస్తి చెబుతూ.

"అట్లాగనకండయ్యా. అయినా .... అయ్యాన్ని గేపకం చేసుకుని తిట్టుకుంటూ కూకునే యాల కాదిది..." లచ్చిగాడి మాట పూర్తికాలేదు.

వెనకనుండి, కాటుకోసం పొంచివున్న కరికాలనాగులా పడగెత్తిన పెద్ద కెరటం ఒకటి దూసుకొచ్చి రెడ్డి శరీరాన్ని ఎగరేసుకు పోయింది. అప్పటికే ఆ కెరటం కడుపులో చాలామంది పిచ్చిరెడ్డిలాంటి మరికొందరు పిచ్చిరెడ్లు: కులం కోసం, మతం కోసం, బలహీనులపై అధికారం కోసం, ప్రాంతీయతత్వం రెచ్చగొట్టి పాలించాలని కలలుగన్నవాళ్ళు, నీతికీ అవినీతికీ మధ్య నిత్యం సంఘర్షించే వాళ్లూ యింకా చాలామంది వున్నారు ఇంకా చాలామంది మిగిలిపోయేరు. వాళ్ళందర్నీ పడగొట్టి కడుపులో దాచుకోవాలన్నట్టు మెరుపువేగంతో సాగిపోయింది అచ్చం అగ్నివర్ణంలో వున్న కెరటం.

ఊహించని ఈ హఠాత్పరిణామానికి హతాశుడయ్యాడు లచ్చిగాడు. పిచ్చిరెడ్డి శరీరాన్ని నోట కరుచుకుని పరుగెత్తే కెరటం చటుక్కున ఆగి తను ఎక్కిన చెట్టుదగ్గర ఏదో గుర్తుపెట్టిపోవడం, ఆ గుర్తుదగ్గర పెద్ద సుడి ఏర్పడి సున్నాలు చుట్టడం గమనించిన లచ్చిగాడు పెద్దగా పట్టించుకోలేదు. తన చెట్టుదగ్గర సుడి గుండం చెక్కే 'శిలాక్షరాలు' రేపటి చరిత్రకు శ్రీకారం చుట్టేవని వాడికి తెలీదు. ఆ చరిత్రగతికి వాడే సారథి అన్న రహస్యం అంతకన్నా తెలీదు.



సీరియల్

# సౌందర్యదీపం

ఆర్. సంధ్యారాణి

(గత సంచిక తరువాయి)

63

కృష్ణమోహన్ కోపంతో ఒక నిశ్చయానికి వచ్చేశాడు, ఎన్నాళ్ళు ఇలా!

ఎన్నాళ్ళు అయినా ఈ కోపం ఈ కథ ఇలా సాగుతూనే ఉంటాయి.

ఇందులో మార్పు రాదు.

అందుకే ఏమయితే అయిందని పెళ్ళికి ముహూర్తం పెట్టించేశాడు.

మర్నాటికే ముహూర్తం పెట్టమంటే ఆ మర్నాడు ముహూర్తం కుదరలేదు.

రెండురోజుల తర్వాత ముహూర్తం కుదిరింది. ఎవ్వరికీ తెలియకుండా పెళ్ళి ఏర్పాట్లు చేయించసాగాడు.

అంబికకు ఫోన్‌చేసి చెప్పాడు.

"అంబికా! మా పెళ్ళికి ముహూర్తం రెండురోజుల తర్వాత పెట్టించేను."

"అలాగా! ఇందూ బాగానే ఉందా? ఆమె ఇష్టపడిందా!" అడిగింది

"ఇందూ ఇష్టపడుతుందా! ఆమెలో మార్పా!" అన్నాడు ఆదోలా.

"ఆదేమిటి! ఇందూలో మార్పు వచ్చిందని చెప్పారు!"

"అవును చెప్పాను. నన్ను ఆడిస్తుంది."

ఆమె మాట్లాడలేదు వింటోంది.

"ఇకమీదట నేను ఆడిస్తాను."

"అసలు ఏం జరిగింది! మిమ్మల్ని ఏమన్నా అన్నదా!"

"ఎందుకు అనదు! కళ్ళు నెత్తిమీదకు వెళ్ళిపోతే అనదూ? ఆకలి అయినపుడల్లా పాపిష్ఠిసొమ్ము నమిలి మింగుతుంటే మంచి బుద్ధులు, మంచి మాటలు ఎలా వస్తాయి!" అంటూ ఇందూ తన మనసు ఎంత గాయపరిచిందో, తల్లిని ఏమన్నదో చెప్పాడు.

ఆ మాటలు వింటూనే అంబిక అంది—

"ఇందూ నోరు ఎలా అయినా జారి ఏమాట ఎప్పుడు మాట్లాడాలో తెలీదు.

"తెలీదు కదూ! తెలియచెప్తాను చూడు" అన్నాడు కోపంగా.

"అయితే ఇప్పుడు ఏమిటి ఆలోచించు కున్నారు! ఆమెను బలవంతంగా పెళ్ళి

చేసుకోవాలనే అనుకుంటున్నారా?"

"అంతే మరి. ఆమె వినవప్పుడు ఏంచేస్తాను! బలవంతంగా పెళ్ళిచేసుకుని ఆవిడగార్కి, ఆవిడ తండ్రిగారికి, అన్నకు సమాధానం చెప్తాను" అన్నాడు.

అంబిక మాట్లాడలేదు.

"మళ్ళీ ఫోన్‌చేస్తాను" అంటూ చెప్పి ఫోన్ పెట్టేశాడు.

పెళ్ళిపనులు చురుగ్గా సాగిపోతు న్నాయి.

ఆ ఊరి చివరగా ఉన్న వెంకటేశ్వర స్వామి కోవెలలో పెళ్ళి.

అతను ఆలోచిస్తున్నాడు.

ఈ పెళ్ళికి ఇందూ ససేమిరా ఒప్పు కోలేదు సరికదా ఆ విషయం అందరికీ తెలిపేటట్లుగా ప్రవర్తిస్తుంది.

అలా అయితే గొడవ అవుతుంది కూడా.

తనకి ఎంత డబ్బు ఉన్నా, ఎంత పేరు ఉన్నా ఆ విషయం మరుగునపర్చ లేదు.

ఈ పెళ్ళితో తనకి చెడ్డపేరు వస్తుంది. చెడ్డపేరు రాకుండా ఇందూ ఇష్టంమీదే ఈపెళ్ళి జరిగినట్టుగా అందరికి తెలిసేలా చెయ్యాలి.

కృష్ణమోహన్ ఆలోచనలు ఒక దారికి రావటంలేదు.

ఉపాయంకోసం ఆలోచిస్తున్నాడు.

పెళ్ళిచూస్తే ఎల్లుండి రాత్రి రెండు గంటలకు ముహూర్తం.

ఒక్కరోజు గడిచింది.

ఎలా; ఎలా, ఏమిటి చెయ్యటం! అవి ఆలోచిస్తుండగా అతని గదిలోకి మణి వచ్చి చెప్పింది.

ఇంద్రసేన రాత్రినుండి భోజనం చెయ్యటంలేదు అని.

అతనికి ఒళ్ళు మండిపోయింది.

"నేను వస్తాను ఉండు" అంటూ అతను అక్కడనుండి ఆమె గదిలోకి వెళ్ళాడు.

గదిలోకి అడుగుపెట్టగానే ఇందు అతనివైపు రివ్వున తలతిప్పి చూసింది.

ఆమె చూపులు ఒక శత్రువుని చూసి నట్టుగా అనిపించసాగాయి అతనికి.

కృష్ణమోహన్ మనసు వెంటనే చివుక్కు మంది.

ఏమి ఆశించి తను ఆమెను కోరి భార్యగా తన జీవితంలోకి అహ్వానిస్తు న్నాడు?

ప్రేమా! ఆదరణా! అభిమానమా! అనురాగమా!

భార్యనుండి ప్రతి మగవాడూ ఆశిం చేది ఏమిటి?

అతని గుండెలు ఒక్కసారి బరు వెక్కాయి.

సూటిగా ఆమెవైపు చూస్తూ అడిగాడు.

"రాత్రి భోజనం చేశావా?"

ఆమె మాట్లాడలేదు.

"ఉదయం కాఫీ త్రాగావా?"

అప్పటికీ ఆమె మాట్లాడలేదు.




"మాట్లాడవేం!" కోపంగా గర్జించేడు.

అంతే అతని కేకకు ఆమె చర్రున లేచి నిలబడుతూ కాలితో నేలను బలంగా ఒక్క తన్ను తన్నింది.

"మీరు నన్ను అధికారంతో ప్రశ్నించటం ఏమిటి! మీరు ఎవరు! నేను ఎవరు!" అంది మహా కోపంగా.

"ఇందూ!" గట్టిగా కేక పెట్టాడు.

"మీరు ఎంత అరిచినా నేను ఏం భయపడను. అరవండి ఇంకా గట్టిగా అరవండి" అంది మహాకోపంగా.

"నేను మంచివాళ్ళకి మంచివాడను కాని కోపం వస్తే మాత్రం...." అంటూ ఆగాడు.

"ఏం బెదిరిస్తున్నారా!" సూటిగా ప్రశ్నించింది.

బెదిరిస్తే నువ్వు బెదురుతావు అనే" అంటూ అదోలా నవ్వాడు.

ఆమె మాట్లాడలేదు. నిర్లక్ష్యంగా ముఖం తిప్పుకుంది.

"ముందు నువ్వు కాఫీతాగి టిఫిన్ తిను."

"నేను తినను!"

"తినవా!" సూటిగా ప్రశ్నించాడు.

తల తిప్పింది తినను అన్నట్టు.

"తినకపోతే చచ్చిఊరుకుంటావు!" కోపంగానే అన్నాడు.

"మరీ మంచిది. సగం చచ్చి ఈ యింట్లో ప్రతికేకంటే పూర్తిగా చావటం మేలు" అంది కసిగా.

"నువ్వు అనుకున్నంత సులభంగా నిన్ను చావనివ్వను."

"మాశీ!" అంది కోపంగా.

"ఏం? నీ కేకలకు నేను జడిసిపోతా వనా నీ ఉద్దేశం. అలా జడిసేవాడ్ని అయితే ఇంతదూరం నేను నడిచి ఈ బాటను వచ్చేవాడ్ని కాదు. నా దారి నేను చూసుకునేవాడ్ని. నేను మర్యాదగా చెప్పు

తున్నాను నువ్వు కాఫీ త్రాగుతావా లేదా!"

"నేను త్రాగను!" మొండిగా అంది.

"త్రాగవు" అంటూ ఆమె చెయ్యిపట్టి ఒక్క గుంజు గుంజాడు.

ఆ గుంజటంలో తూలి అతనిపై పడింది.

"ఛీ!" అంటూ అతన్ని వదిలించు కుని దూరంగా వెళ్ళిపోయింది.

అతను ఒదల్లేదు.

మోళీ కళ్ళల్లో కోపం, కసి, కక్ష కగలసాగింది.

"నేను అంత చేతకానివెధవను అను కుంటున్నావేమో! నేను తల్చుకున్నాను అంటే ఏమయినా చేస్తాను. మీ నాన్నకు, మీ అన్నకు ఈ ఊళ్ళోనే కాదు ఈ ప్రపంచంలోనే ఎక్కడా పిల్లపుట్టకుండా చేయగలను.

"అంతేకాదు నీవు నీ అందం చూసు కుని మహా గర్వపడి మురిసిపోతున్నావే ఆ అందాన్ని, నీ వయసునూ, నీ ఒయ్యా రాన్ని, నీ గర్వాన్ని నేను దోచుకుని నిన్ను ప్రాణంలేని కట్టెగా చేసి ఒదిలి పెట్టేవాడ్ని. అప్పుడు నువ్వు!..."అంటూ అదోలా నవ్వాడు.

"అందం, వయసూ దోచుకోబడ్డ స్త్రీకి పుట్టింటకూడా విలువ నీడ లభిం చదు. ప్రాణం ఉన్నా ప్రాణంలేని కట్టె గానే మిగులుతుంది. అప్పుడు ఆ పొగరు ఆ విసురు ఏమవుతాయో ఆలోచించుకో. స్త్రీ స్త్రీయే. "మగవాడితో ఎప్పుడూ సరి కాదూ పోటీకాదూ."

"మగవాడు మగవాడే."

"మగవాడితో పోరాడి గెలిచిన స్త్రీ లేదు."

"హూ" అంటూ విరసనగా చూసింది.

"ఏం ఈ దేశంలో రాజ్యాలు ఏలిన స్త్రీలు లేరా!" అడిగింది కోపంగా.

"ఉన్నారు. రాజ్యాలు ఏలిన స్త్రీలు ఉన్నా ఆ స్త్రీలకు భర్తలు ఉన్నారు. ఆ భర్తలకు తలవంచారు. గౌరవించారు. కాని నీకు ఆ గౌరవం లేదు, ఆ మర్యాద లేదు. అది నీ తప్పు కాదు. నీ తండ్రి తప్పు. నీ తండ్రిబుద్ధులే వచ్చాయి నీకూ."

ఆమె మాట్లాడలేదు.

అతనితో ఆమె వాదించదల్చుకోలేదు.

మోళీతో మాట్లాడాలని అనిపించటం లేదు.

"నేను ఏమయినా చెయ్యగలను కాని చెయ్యలేదు. కారణం ఉత్తములు అయిన తల్లిదండ్రుల కడుపున పుట్టాను. అందుకే నాకు వంశ గౌరవమర్యాదలు ముఖ్యం. అర్థం అయిందా!" సూటిగా ప్రశ్నించాడు.

ఆమె జవాబు ఇవ్వలేదు.

"చెప్పు కాఫీ త్రాగుతావా లేదా!"

"త్రాగను!" చాలా తాపీగా ఏమాత్రం తొణక్కుండా చెప్పింది.

"బలవంతంగా ప్రాణం తీసుకుందాం అనుకుంటున్నావా!"

ఆమె కళ్లువిప్పి చూసింది. అంతే. జవాబు ఇవ్వలేదు.

"సరే!నువ్వు ఎన్నాళ్లు ఇలా ఉంటావో నేనూ చూస్తాను. ఎల్లుండేగా మన పెళ్ళి." నవ్వుతూ చెప్పాడు.

"ఛీ! మీతోనా నా పెళ్ళి" అంటూ ఛీకొట్టింది.

"ఏం! నీ అందచందాలకి దేవలోకం నుంచి దేవేంద్రుడు దిగివస్తాడనుకున్నావా!లేక చంద్రలోకంనుండి చంద్రుడు దిగివస్తాడు అనుకున్నావా! నోరు మూసుకుని కూర్చో. ఎల్లుండి రాత్రి రెండుగంటలకి మన పెళ్ళి జరిగిపోతుంది. ఆ మర్నాడు నువ్వు నేను కలిసి మీ అమ్మానాన్నగారి దగ్గరకు వెళ్ళి ఈ విషయం చెప్పివద్దాం."

"ఎల్లుండి రాత్రి రెండుగంటలకు పెళ్ళా" తనలో తాను అనుకుంటున్నట్లుగా పైకే అంది ఆ మాటలు.

ఆమె కళ్ళల్లో భయం తొంగిచూసింది.

ఈ పెళ్ళి జరక్కుండా ఆపటం ఎలా!

ఈ పెళ్ళి ఎవరూ ఆపలేరా! అన్నట్టు అలా ఉండిపోయింది బొమ్మలా బిగదీసి పోతూ.

ఆమె చెయ్యి వదిలిపెట్టేశాడు.

"నా మాట విని కాఫీ త్రాగు. భోజనం చెయ్యి. లేదా నీ ఇష్టం. ఈ పెళ్ళిమాత్రం జరగటం మానదు" అంటూ చెప్పి అతను అక్కడనుండి వెళ్ళిపోయాడు.

ఇందూలో ఉన్న ధైర్యంకాస్త కరిగి పోయింది. భయం కలిగింది.

తను కృష్ణమోహన్‌కి భార్య కావటమా!
తన పంతం నెరవేరే మార్గం లేదా!
గెలుపు అతనిదే అవుతుందా!

అతని భార్యగా ఇష్టంలేకుండా జీవితమంతా గడిపేయాలా!

ఇందుకి దుఃఖం ముంచుకురాసాగింది.

ఇలా ఒంటరిగా ఏ ఊరు రావలసింది కాదు. అనవసరంగా తను ఇక్కడ చిక్కుకుంది. ఇప్పుడు ఏం చెయ్యాలి? ఎలా తప్పించుకోవాలి? అని ఆలోచిస్తూ కుమిలికుమిలి ఏడ్వసాగింది. ఆమె పంతంపట్టినట్టు పచ్చి మంచినీళ్ళు కూడా త్రాగటం మానేసింది

ఆరోజు, మర్నాడు గడిచిపోయాయి.
ఆమెలో శక్తి తగ్గిపోసాగింది.
నీర్సం మనిషిని ముంచేయసాగింది.
లేచి నడిచే ఓపిక లేదు.
కళ్ళుతెరిచి చూసే శక్తి లేదు

నీర్సంగా మంచంమీద పడుకునే ఉండసాగింది.

అలా అయినా ప్రాణం పోతుందని ఇందూ ఆశ. ఇష్టంలేని పెళ్ళి జరిగేకంటే ప్రాణంపోవటం మేలనుకోసాగింది.

ఈ విషయం కృష్ణమోహన్‌కి తెలిసి అంబికకు వెంటనే ఫోన్ చేశాడు కంగా

రుగా. అతని కంగారుచూసి ఆమె ధైర్యం చెప్పింది.

"మీరు ఏం కంగారుపడకండి. పెళ్ళి జరిగిపోనివ్వండి. ఈ రాత్రికేగా పెళ్ళి" అంది.

అవును అన్నాడు.

"మీరు ఏం కంగారుపడకండి. పెళ్ళి అయిపోయాక బలవంతంగా హార్లిక్స్ ఏదయినా కలిపి ఇవ్వండి!

"మనిషి మొండివలన ఏం తీసుకో వటంలేదు, అంతే!" అంటూ చెప్పి ఫోన్ పెట్టేసింది.

కృష్ణమౌళి రిసీవర్ పెట్టేసి ఆలోచ నల్లో పడ్డారు.

ఇందూలో శక్తి లేదు.

భోజనం చెయ్యని కారణంగా మనిషి తోటకూరకాడలా వాలిపోతోంది.

నిలబడే శక్తి లేదు. ఎలా!

ఈ పెళ్ళి ఎంత త్వరగా జరిగి పోతుందా అని ఉంది అతనికి.

ఈరోజు కోపమేగా ఇన్ని అవస్థలు పడింది. ఇకముందు ఎలా జరుగుతుందో జరగనీ అనుకున్నాడు.

పెళ్ళిటైము దగ్గరపడుతోంది.

కృష్ణమౌళిని ముస్తాబుచెయ్యసాగారు.

అతను పుల్‌సూట్ వేసుకున్నాడు. మెడలో చెల్లాదండలు వేసుకున్నాడు. తలకి గులాబీరంగు పట్టుపాగా చుట్టారు. ఆ పాగాకి అందంగా గొలుసులు వేలాడ దీశారు.

కళ్ళకు కాటుక, ఎడంచెంపకు చుక్క పెట్టారు దిష్టితగలకుండా.

నుదుట కళ్యాణబొట్టు పెట్టారు.

అతని ముస్తాబు పూర్తిఅయింది.

ఇందుకి స్నానంచేయించి పట్టుచీర కట్టి జాకెట్ తొడిగారు.

పూలజడ వేశారు.

కళ్ళకు కాటుక, బుగ్గన చుక్క, నుదుట కళ్యాణబొట్టు దిద్దారు.

ఇందూ వాళ్ళకి ఎదురుచెప్పే శక్తి లేనందువలన అలా ఉండిపోయింది. వాళ్ళు తనని ఎలా ముస్తాబు చేసినా ఏం అనకుండా.

ఇందు ఒక్కమాట మాట్లాడటంలేదు. కళ్ళువిప్పి తీక్షణంగా చూడటం తప్పించి ఏం ఎదురుతిరగలేదు.

ముస్తాబుచెయ్యటం పూర్తి అయింది.

పోర్టికోలో కారు ఆగి ఉంది.

అన్నికార్లు వరసగా ఉన్నాయి.

ఇందుని ఇద్దరు మెల్లగా నడిపించుకు వచ్చి కారులో కూర్చోబెట్టారు.

ఆమె పక్కనే కృష్ణమౌళి కూర్చు న్నాడు.

ఇందుకి శక్తి లేనందువలన అతని భుజంమీద తల వాల్చేసింది.

అతను అపురూపంగా ఆమెను పట్టు న్నాడు. అన్నికార్లు వరసగా గుడిదగ్గరకు బయలుదేరాయి.

కృష్ణమౌళిలో ఆలోచనలు రకరకా లుగా పరుగెడుతున్నాయి.

(సశేషం)



# అనుమానమా! నీకో నమస్కారం!!

తెన్నేటి సుధ

"రేవతీ!"

"ఊఁ"

"దగ్గరగా రా.... కూర్చో. ఊహుఁ ఇక్కడ కాదు ఇక్కడ..." చిలిపిగా చూశాడు మహేంద్ర.

రేవతికి కొత్తగా, భయంగా ఉంది. బెరుకుగానూ ఉంది. చిన్నపిల్ల కాకపోయినా ఏమిటో జరగబోయే అనుభవాన్ని తల్చుకుంటే గుండెల్లో ఏదో దడ.

ఒక్కసారి మహేంద్ర ఆమెను దగ్గరకు తీసుకొని ఊపిరాడనంతగా కౌగలించుకున్నాడు. రేవతి వదలించుకునే ప్రయత్నంలో "ఏమిటండీ" అంది.

కౌగిలి సడలించి ఆమె మొహంలోకి చూస్తూ—

"కాలేజీలో నీకు బాయ్‌ఫ్రెండ్స్ ఉన్నారా?" అన్నాడు.

ఉలిక్కిపడింది రేవతి. పెళ్ళైవారం రోజులయింది.

శోభనంరోజు రాత్రి ఒక భర్త భార్యను అడగవలసిన ప్రశ్న ఇదా? ఇది సమయమా? ఇది సందర్భమా?

"ఏమిటట్లా చూస్తావు?— ఎవరు గుర్తు వచ్చారు?" అతను నవ్వుతూనే అడుగుతున్నా రేవతికి కంపరంగా అనిపించింది.

"ఎవరూ గుర్తురాలేదు. తొలిరేయి గురించి ఎన్నో కథలు చదివాను. సినిమాల్లో చూశాను. కానీ మీలాగా ఏ భర్తా భార్యను ప్రశ్నించడం చదవలేదు, చూడలేదు, వినలేదు." అంది కాస్త నిష్ఠూరంగా.

"ఓ చాలా చమత్కారంగా మాట్లాడుతున్నావే. బి ఏ చదివింది కో ఎడ్యుకేషన్ కాలేజీ కదా — ఈ కాలంలో ఆడపిల్లల

పాతివ్రత్యం గురించి నాకు బాగా తెలుసులే...."

వ్యంగ్యంగా అంటున్న అతని మాటల ధోరణికి దెబ్బతిన్నట్లు చూసింది రేవతి. ఆమె మనసు చిన్నబోయింది.

మహేంద్ర ఏమనుకున్నాడో బిగ్గరగా నవ్వి– "ఏమిటట్లా దూరంగా పోతున్నావు. ఇది దగ్గరకు రావలసిన సమయం...." ఆమెను దగ్గరకు లాక్కున్నాడు.

అతని స్పర్శలో ఏదో లోకంలో తేలిపోతోతున్న రేవతి మళ్ళా ఉలిక్కిపడింది అతని మరో ప్రశ్నకు–

"నీకిది నిజంగా మొదటి అనుభవమేనా?" మనసులో శూలం గుచ్చినట్లయింది. కళ్ళలో చివ్వున నీళ్ల చిమ్మినై.

ఒక్కసారి అతన్ని ఒదిలించుకొని పక్కకు జరిగింది.

"ఏమిటి అలక?" విసుక్కున్నాడు మహేంద్ర.

"మీరు మాట్లాడే విషయాలు నాకు నచ్చలేదు. నిర్మలమైన మనసులతో ఒకటి కావలసిన రోజిది. ఇంతేగాని కుళ్ళు మనసుతో మన సంసారాన్ని ఆరంభించడం నాకిష్టంలేదు...." రోషంగా. ఆవేదనగా అంది రేవతి.

"స్వచ్ఛంగా ఉండాలి కాబట్టే అడుగుతున్నాను. మధు ఎవరు?...."

"నా క్లాస్‌మేట్ ...."

"అతనిదీ, నీదీ ఏ రకమైన సంబంధం?"

"స్నేహం.... అంతే...."

"మీ రిద్దరూ పెళ్ళి చేసుకోవాలనుకో లేదా?...." ఉలికిపడింది రేవతి. అతనిది ఎటువంటి మనసో తేటతెల్లమవుతున్నది. ఇతనితోనా తను సాహచర్యం చెయ్యబోయేది. గుండెలు దడదడలాడుతున్నై.

"ఏం మాట్లాడవేం?" మళ్ళీ గద్దించాడు.

"నాకూ అతనికీ ఏ విధమైన సంబంధం లేదు."

"కానీ అతను నిన్ను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాడు. ఇదంతా అబద్ధమా.."

"అతనికి ఆ అభిప్రాయం ఉండేది. కానీ నే నెప్పుడూ అతడిని ఆ దృష్టితో చూడలేదు– ఆ విషయం అతనికో ఏనాడో స్పష్టంగా చెప్పాను."

"ప్రతివ్రతలా కబుర్లు చెప్పకు– నీ చరిత్రంతా మొన్ననే సేకరించాను...."

ఈ నిందకు రేవతి కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. నోట్లోంచి మాటరాలేదు. కొంచెం నేపాగి మళ్ళా మహేంద్రే అన్నాడు. "పోన్లే ఇప్పుడదంతా ఎందుకు? కాసేపు సరదాగా మాట్లాడావంటే. ఏమిటంత సీరియస్ అయినావ్–రావోయ్..." చెయ్యి పట్టి ఆమెను దగ్గరకు లాగాడు.

యాంత్రికంగా అతని చేష్టలకామె మైనం బొమ్మలా తిరిగింది. కానీ రేవతి మనసు మాత్రం అతనిపట్ల విముఖతతో దూరం దూరం జరిగిపోతుంది.

మధుకూ, తనకూ కేవలం స్నేహమే నంటే నమ్మే సంస్కారం మహేంద్రకు

లేదని స్పష్టమైపోయింది. అతని స్వభావం కూడ తెలిసిపోయింది.

పెళ్ళి లాటరీ—ఎటువంటి వాడితో ఎట్లా జీవితం గడపాలో అడుగుపెట్టేవరకూ తెలియదు. అనుకూలమైన జత దొరికిందా లాటరీలో లక్షరూపాయల విజేతల మయినట్లు తద్వ్యతిరేకమైతే సర్వం కోల్పోయినట్లు.

శోభనం గదిలోకి అడుగు పెట్టక ముందే తాపీ పెళ్ళి అనే లాటరీలో ఘోరంగా పరాజయం పొందినట్లు గుర్తించింది రేవతి. నిట్టూర్పడం మినహా అప్పుడు చేయగలిగిందేముంది? తీయగా కరిగిపోవాల్సిన రేయి బాధగా నిట్టూర్చింది.

* * *

ఉదయం లేచి స్నానంచేసి మహేంద్ర లేచేసరికి కాఫీ తీసుకుని గదిలోకి వచ్చింది రేవతి- రాత్రి అతనితో జరిగిన సంభాషణ అబద్ధమైతే బాగుండునని పిస్తున్నది.

కాఫీ అందుకుంటూ తనను చిలిపిగా కవ్విస్తాడేమోనని ఏమూలో ఉన్న ఆశ అతని ప్రశ్నకు ఆరిపోయింది.

"మధు ఉండేది ఈ ఊళ్ళోనే కదూ!"

కడుపులో దేవేసినట్లుంది అతని ప్రశ్న. 'అనుమానం రోగం— అది చావుతో కాని పోదు.'- అనుకుంది కసిగా.

"ఆ....ఇక్కడే - బ్యాంకులో పన్జే స్తాడు" అంది నిర్లిప్తంగా.

"ఫోన్ నంబరు తెలుసా?"

"అఁ........"

"సాయంత్రం మనింటికి భోజనానికి రమ్మని ఫోన్‌చెయ్యి... " అన్నాడు కాఫీ సిప్ చేస్తూ, రేవతి మొహంలో భావాలను గమనిస్తూ.

"ఇప్పుడు అతనెందుకూ?" మొహం చిట్లించింది రేవతి.

"నీ స్నేహితుడు కదా! నేనూ పరిచయం చేసుకుని స్నేహం పెంచుకుందామని... "

"అతనిప్పుడు మనింటికి రావడం నా కిష్టంలేదు...."

"నేను అతణ్ణి రమ్మని ఫోన్ చెయ్యమన్నాను. నువ్వు చెయ్యాల్సిందే— విన్నావా?" అధికారికంగా అన్నాడు మహేంద్ర.

"నా కిష్టంలేదు - నేను చెయ్యను" అక్కడ్నించి కదలబోయింది రేవతి.

"రేవతీ! మహేంద్ర అంటే ఏమను కున్నావో- ఎప్పుడూ, ఏ విషయం కూడా నా మాటకు ఎదురు ఉండకూడదు- విన్నావా?" గర్జించాడు మహేంద్ర.

ఎంతో అపురూపంగా పెరిగిన రేవతి కళ్ళల్లో నీళ్ళు నిండినై. శ్లేష్మంలో పడ్డ ఈగ చందాన ఉంది పరిస్థితి. ఈ బంధాన్ని తెంచేసుకొని సాధ్యమైనంత దూరం సాధ్యమైనంత తొందరలో పారిపోవాలనుకుంది. దాంపత్య జీవితంలో

అడుగుపెట్టిన మరుసటిరోజే ఈ విధంగా అనుకోవలసి రావడం ఎంత దౌర్భాగ్యం! అందమైన ఈ ముఖం కోడేలు కప్పుకున్న ముసుగులా ఉంది. చేష్టలుడిగి నుంచున్న రేవతి.

"బ్రష్‌మీద పేస్టువేసి- బాత్రూమ్‌లో వేడినీళ్ళు పెట్టు-" అని మళ్ళీ గర్జించాడు.

నిస్సత్తువగా బాత్రూమ్‌వైపు నడిచింది రేవతి.

అతను మొహం కడుక్కుని స్నానం చేసి వచ్చాడు. యాంత్రికంగా ఇడ్లీ ప్లేటు, మంచినీళ్ళు ముందుంచింది.

"నువ్వు తిన్నావా?" అన్నాడు.

లేదన్నట్లు తలూపింది రేవతి.

"నువ్వూ తెచ్చుకో."

"నాకు తినాలని లేదు" అంది.

"అయినా తినాల్సిందే." ఇంత అధికారం ఇంతకుముందు ఎప్పుడూ ఎరగని రేవతి అతని ప్రతి మాటకు ఉలిక్కిపడుతోంది. తప్పనిసరిగా ప్లేటు తెచ్చుకుని కూర్చుంది. అదొక జైలులాగ తానొక ముద్దాయిలాగా, బందీగా— మహేంద్ర యముడిలా అనిపిస్తోందే కానీ కాపురానికి వచ్చిన రెండోరోజు భర్తతో పంచుకోవాల్సిన అనుభూతులేవీ మనసు ఛాయల్లోకి రావడంలేదు. చిన్న ఇడ్లీ ముక్క కూడ గొంతు దిగడంలేదు. మహేంద్ర మాత్రం గబగబా తినేశాడు.

"ఇవిగో ఎల్లుండి ఊటికి వెళ్ళడానికి టికెట్స్ బుక్ చేశాను."

'మన ఆనందానికిప్పుడు ఊటి నే తక్కువైంది-' అనుకున్నది అక్కసుగా రేవతి.

రేవతి వంటచేసింది.

9-30 గం లకు ఆఫీసుకు బయల్దేరేముందు "అన్నం వడ్డించమంటారా?" అన్నది. అసలు అతనితో మాట్లాడాలని ఏకోశానా లేదు.

"క్యారేజీలో పెట్టు" అన్నాడు.

అన్నం క్యారేజీలో పెట్టి తీసుకువచ్చి టేబుల్‌మీద పెట్టింది.

ఫోన్ పక్కన కూర్చుని "మధు ఫోన్ నెంబరు ఎంత?" అన్నాడు మహేంద్ర. అతని ఉద్దేశం ఏమిటో అంతుపట్టడం లేదు.

మాట్లాడకుండా చిన్న స్లిప్ మీద నంబర్ వేసి అతనికిచ్చి వెళ్ళబోతుంటే కూర్చోమన్నట్లు కుర్చీ చూపించాడు.

రేవతి కూర్చుంది.

ఫోన్ డయల్‌చేసి రింగవుతుంటే ఆమె చేతికిచ్చాడు- "మధుని పిలిచి, రాత్రికి మనింటికి భోజనానికి రమ్మను-" అన్నాడు.

ఫోన్ చేతిలోకి తీసుకుంది.

మధు లైన్లోకి వచ్చాడు.

"హలో! నేను రేవతిని మాట్లాడుతున్నాను!" అంది.

"ఓ రేవతీ! బాగున్నారా? పెళ్ళికి రాలేకపోయాను సారీ! ఎట్లాఉంది కొత్త జీవితం! మీవారెట్లాంటివారు?"

"ఆయన చాలా చాలా మంచివారు. చాలా విశాలహృదయులు. నువ్వు నాకు స్నేహితుడవని చెప్తే చాలా సంతోషించారు. ఇద్దరం కలిసి అనుకున్నాం ఈ రోజు నిన్ను భోజనానికి పిలవాలని. ఆయన నా పక్కనే ఉన్నారు. నువ్వు 7 గంటలకు వస్తే బాగుంటుంది...." అన్నది.

"భోజనానికెందుకు—ఊరికే వస్తాను"

"కాదు కాదు. నువ్వు అట్లా అంటే మా వారు చాలా బాధపడ్తారు..." అంటుంటే మహేంద్ర పక్కనుంచి 'నేను మాట్లాడ్తాను' — అని సైగచేశాడు. 'ఫోన్ మావారి కిస్తున్నాను' అంటూ మహేంద్రకందించింది.

"హలో! మధుగారూ! నమస్కారమండీ! మా ఆవిడ, మీరు చాలా క్లోజ్ ఫ్రెండ్సని తెలిసింది. ఆఁ.... కాదు కాదు మీరు భోజనానికి రావల్సిందే...." అంటూ ఇంటిగుర్తులు చెప్పి ఫోన్ పెట్టేశాడు.

క్యారేజీ తీసుకుని ఆఫీసుకు వెళ్ళిపోయాడు.

మధ్యాహ్నం రెండుగంటలకు ఫోన్ రింగయితే తీసింది రేవతి. మహేంద్ర చేశాడు. "గంటసేపట్నుంచి ట్రైచేస్తుంటే ఎంగేజ్ వస్తోంది. మీ ఫ్రెండు మధుతో మాట్లాడుతున్నావనుకున్నా...." అన్నాడు మహేంద్ర ఫోన్ తియ్యగానే.

అసలదేదో రాంగ్‌నెంబరుకి పోయి ఉంటుందీ తనింతవరకూ ఎవరికీ ఫోన్ చెయ్యనూ లేదు. బయటి ఫోనూ రాలేదు.

అయినా కోపం కొద్దీ "అవును" అంది అవతలనుంచి ఓ క్షణం మహేంద్ర మాట్లాడలేదు.

"నేను నాలుగు గంటలకే వచ్చేస్తాను. కూరలు కొనుక్కొస్తా" అని ఫోన్ పెట్టేశాడు.

అతనిది ఎటువంటి స్వభావమో అర్థంకావడం లేదు.

అసలు మధు ఎవరు? తనెవరు? అతని గురించిన వేరే రకమైన ఆలోచనలు ఎప్పుడూ రాలేదు. అయినా కనిపించిన ప్రతి మగాడి గురించీ ఆలోచించడమేనా తన పని

అమ్మా, నాన్న చూసిన సంబంధాలే— మహేంద్రను పెళ్ళిచూపుల్లో చూశాక నచ్చాడన్నది తను — అతని నుండి కూడా తను నచ్చినట్టు సమాచారం వచ్చింది. అంతకుముందు ప్రేమ వ్యవహారాలు తెలియకపోయినా మహేంద్రను చూసినప్పటి నుంచి తెలియకుండానే అతని చుట్టూ ఊహలు అల్లుకుంది. కలలు కన్నది, కానీ భార్యగా అతని ఇంట్లో అడుగుపెట్టిన క్షణమే ఆశలు నీరుకారి పోయినై. ఊహలన్నీ నిరుత్సాహపడినై.

ఆలోచనల్లో పడి కొట్టుకుపోతూనే ఉంది రేవతి. అన్నంకూడా తినలేదు.

చెప్పినట్లుగానే 4గం లకు ఇంటికి వచ్చాడు మహేంద్ర. స్వీట్సు కూరలు తీసుకుని.

మానసికంగా, శారీరకంగా కూడా అలిసిపోయి ఉంది రేవతి. పైగా ఉదయం నుంచి ఏమీ తినలేదు. మహేంద్రకు కాఫీ ఇచ్చి, బలవంతాన వంటకు ఉపక్రమించింది.

కూరలు తరుగుతుంటే అడిగాడు "నువ్వు మధు కలిసి ఎన్ని సినిమాలు చూశారు?" అని. తలెత్తి తీక్షణంగా చూసింది గానీ ఏం మాట్లాడలేదు. అతను ఏమనుకున్నాడో ఊరుకున్నాడు. అంత అభిమానంగల తన్ను అతనంత అవమానిస్తుంటే ఎట్లా భరిస్తున్నదో....

ఏదో వంట అయిందనిపించింది.... అట్లాగే వెళ్ళి మంచంమీద పడుకుంది. టైమ్ అరున్నర అయినట్లుంది.

"రేవతీ!" పిలుస్తూ లోపలికి వచ్చాడు. మహేంద్ర పడుకుని ఉన్న రేవతిని చూసి "ఏమిటి పడుకున్నావు? లేచి మొహం కడుక్కో... ..." అన్నాడు విసుగ్గా. అతనితో వాదన ఇష్టంలేదు-లేచి మొహం కడుక్కుని చీర మార్చుకుంది.

మనసు దిగులుగా ఉంది.

మీ ఫ్రెండు వస్తున్నందుకు సంతోషపడాలిగానీ అట్లా ఉన్నావేం. భయపడుతున్నావా?.... ..."

అతనేం మాట్లాడినా వ్యంగ్యంగా, కర్కశంగా ధ్వనిస్తోంది.

"తప్పుచేసినవాళ్ళు భయపడ్తారు — నాకెందుకండీ భయం-" అన్నది మెల్లగా. ఏడు గంటలవుతుండగా వచ్చాడు మధు. రేవతి నిర్లిప్తంగా ఉండిపోయింది.

"చాలాకాలానికి కలుసుకున్నారు కదా. అంత డల్‌గా ఉంటావేంటోయ్. ముందు మంచి కాఫీ తీసుకురా...." పరిచయాలయ్యాక ఉత్సాహం పరుస్తూ అన్నాడు మహేంద్ర........ అంతా నాటకంలో ఘట్టంలా ఉంది.

మధు నవ్వాడు. "రేవతి కాఫీ చాలా బాగా చేస్తుంది. రేవతి ఇవ్వకపోతే అడిగి కాఫీ పెట్టించుకుని తాగేవాణ్ణి."

రేవతి బలవంతంగా నవ్వింది.

మహేంద్ర కూడా నవ్వేడు— ఆ నవ్వులో ఏముందోగానీ కడుపులో దేవేసినట్లు వికారంగా అనిపించింది.

కాఫీ తీసుకువచ్చేలోపుగా మహేంద్ర మధును ఏవో ప్రశ్నలు వేస్తూనే ఉన్నాడు. అక్కడకు కూడా వినబడుతున్న స్నేహ ధోరణిలో మధు చెప్తున్న జవాబులను మహేంద్ర ఏ విధంగా రిసీవ్ చేసుకుంటున్నాడో ఊహిస్తే వణుకుపుడ్తోంది రేవతికి.

"ఓహో అయితే కాలేజిదేకి ఇద్దరూ కలిసి ఫోటో దిగేరన్నమాట...."

"ఆ, అది రేవతి ఆల్బమ్‌లో పెట్టుకుంది రేవతీ! నీ ఆల్బమ్ చూపించలేదా- తీసుకురా సరదాగా చూద్దాం. ." కాఫీ తీసుకు వచ్చిన రేవతితో అన్నాడు మధు అతి మామూలుగా.

రేవతి గొంతు తడి ఆరిపోయింది. నిష్కల్మషంగా మాట్లాడుతున్న అతని

మాటలను అర్థంచేసుకునే సంస్కారం మహేంద్రకు లేదని అతనికి తెలియదు.

"కాఫీ తీసుకోండి", అంది ట్రే అక్కడ పెడ్తూ. ఆ సంభాషణ ముగిసి అతను వెళ్ళిపోతే బాగుండునని ఉంది రేవతికి.

కానీ మధు మళ్ళీ అన్నాడు "ఆల్బమ్ తీసుకురా" అని. "అది ఇక్కడకు తేలేదు" అంది మెల్లగా.

"పుట్టింట్లో రహస్య స్థావరాల్లో చాలా ఉండి ఉంటాయి - మధూ. మీ కిష్టమైన మీ ఫ్రెండు చేసిన కాఫీ తీసుకోండి-" అన్నాడు వత్తిపలుకుతూ. నుంచునే ఉన్న రేవతిని మధు కూర్చోమని బలవంతం చేశాడు. 8 గంటలు దాటేవరకూ ఎట్లాగో టైమ్ గడిచింది. ఊఁ, ఊఁ అనడం తప్పించి రేవతి సంభాషణలో ఎక్కువగా పాల్గొనలేదు.

"ఏమిటి రేవతీ! అట్లా ఉన్నావేం?" అన్నాడు మధు ఆమె అన్యమనస్కత గుర్తించి.

"ఏమీలేదు. మీరిక లేవండి. భోజనం వడ్డిస్తాను, చల్లారిపోతోంది" అంది లేస్తూ రేవతి.

"కాళ్ళు కడుక్కు రండి - అదిగో బాత్రూమ్"-అని మహేంద్ర లేచి మధుకు బాత్రూమ్ చూపించాడు.

డైనింగ్ టేబిల్ మీద ప్లేట్లు సర్దుతున్న రేవతి 'అమ్మా' అన్న ఆర్తనాదానికి ఉలిక్కిపడి బాత్రూమ్ దగ్గరకు పరుగెత్తింది.

తలపగిలి రక్తం మడుగులో పడిఉన్న మధు, కాలయముడిలా చేతిలో ఇనుప రాడ్‌తో క్రూరంగా నవ్వుతున్న మహేంద్ర.

"నీ ప్రియుణ్ణి చంపేశానే. ఇక జీవితంలో మన మధ్య ఎవ్వరి అడ్డూ లేదు ..." అంటున్నాడు ఎర్రబారిన నేత్రాలతో రౌద్రంగా.

పైశాచికంగా, అనుమాన రాక్షసికి మారుపేరులా చిత్రమైన మనస్తత్వంగల మహేంద్రనొక క్షణం కొయ్యబారిపోయి చూసింది రేవతి. మరుక్షణం చేతిలో ప్లేటు జారవిడిచి కాలి సత్తువకొద్దీ బాణంలా గేటు బయటికి, పోలీస్ స్టేషన్ దిశగా దూసుకుపోయింది.





# పాన్పు కింద పసుళ్ళు

పోట్లూరి సుబ్రహ్మణ్యం

ఎక్స్‌ప్రెస్ రైలు ఒకసారి పెద్దగా అరచి బయలుదేరింది. జారిపోయే త్రాచు పాములా సన్నని పట్టాలమీద ముందుకు నడుస్తూ ఉంది. ప్లాటుఫారంమీద మనుషులు ఒక్కొక్కరే వెనక్కి పోతున్నారు. ప్లాటుఫారం దాటింతరువాత రైలు స్పీడందుకొంది. పచ్చని పొలాలు, అడవులు, కొండలు ఒక్కొక్క దృశ్యం కొద్దిసేపు కనిపించి వెనక్కిపోతున్నాయి.

కిటికీలోంచి చూస్తున్న రామకృష్ణ మనసు మనసులో లేదు. రైలు వేగం కంటే ముందుకు అతని ఆలోచనలు పరుగులు తీస్తున్నాయి. తొమ్మిదేళ్ళ తరువాత చూడబోయే ఒకప్పటి తన స్నేహితురాలు, ప్రియురాలు అపర్ణ గుర్తుకువస్తోంది. తమ ప్రణయం మొగ్గగా పుట్టి, పుష్పించే సమయంలో ఎండి రాలిపోయింది. తను ప్రేమించి, ఆరాధించి, పూజించిన అపర్ణ తనకు దక్కకుండా పోయింది. దాంతో విరక్తిగా మిలటరీలోకి వెళ్ళిపోయాడు.

అలా మిలటరీలోకి వెళ్ళిన రామకృష్ణ తరువాత తల్లిదండ్రుల దగ్గరకు కూడా రాలేదు. వాళ్ళతో తన క్షేమసమాచారాలు, మిగతా అన్ని విషయాలు ఉత్తరాల మూలంగానే తెలియజేసేవాడు. ఎంతమంది ఎన్నిచెప్పినా పెళ్ళి మానుకొని అపర్ణనే జపిస్తూ తూర్పుండిపోయాడు. రామకృష్ణకు తన గతాన్ని తలచుకొన్నప్పుడల్లా ఆ మధుర స్మృతులు గుర్తుకువచ్చి వేద తీరుస్తుంటాయి.

రామకృష్ణ, అపర్ణ ఒకే ఊరివాళ్ళు. చిన్నతనంనుంచి ఒకరికొకరు తెలిసినవాళ్ళే. స్కూలుఫైనలువరకు ఊళ్ళోనే కలిసి చదువుకొన్నారు. కాలేజీ చదువు ఊరికి పదిమైళ్ళ దూరంలోఉన్న టౌనుకు వెళ్ళాల్సివచ్చింది. రామకృష్ణ, అపర్ణ

ఇంటర్మీడియట్‌లో చేరారు. రోజూ బస్సులో వెళ్ళి బస్సులో వచ్చేవారు.

ఒకరోజు కాలేజీలో అపర్ణను కొంత మంది అబ్బాయిలు ఏడిపించడం, అపర్ణ చెప్పుతో కొట్టడం, దాంతో స్టూడెంట్సంతా ఒకసైె ఆమెపై దాడిచేయడం, ఆమెను కాపాడడంలో రామకృష్ణ చావుదెబ్బలు తినడం జరిగింది. స్వతహాగా అందగత్తె అయిన అపర్ణ కాలేజీ బ్యూటీగా పేరు గాంచింది. ఎందరు ఎంత కవ్వించినా, ఆశ చూపినా చలించేది కాదు. పవిత్రంగా ఉండేది. ఆమె గుండెలో స్థిరనివాస మేర్పరచుకొని పూజనీయుడైనవాడు రామకృష్ణ ఒక్కడే.

రామకృష్ణకు కూడా అంతే. పీణతీగెలను సవరించినంత మృదువుగా ఆమెతో మాట్లాడుతాడు. అంతకంటె మృదువుగా ఆమెను స్పర్శిస్తాడు. ఆ ఊరినుంచి కాలేజీకి వెళ్లే పదిమందిలోను వీళ్ళ స్నేహమంటే అంత పవిత్రతగాను గుర్తింపుగానూ ఉండేది. వారి నిష్కల్మషమైన ప్రేమలో ఎటువంటి తప్పొప్పులు కనిపించేవి కావు.

కాలేజీలో ఆరోజు స్టూడెంట్సు గొడవ చేసిన తరువాత అపర్ణను కాలేజి మాన్పించివేసారు. ఆమె తల్లిదండ్రులు. ఆరోజు రామకృష్ణ గుండెలమీద వాలి అనుభవించిన వేదన అంతా ఇంతా కాదు. రామకృష్ణ ఎంత చెప్పినా ఆమె తల్లిదండ్రులు వినలేదు. చివరకు అపర్ణ కాలేజి మాని వేయక తప్పలేదు.

అపర్ణ తనను రామకృష్ణ రోజూ కలుసుకోవాలని మాట తీసుకుంది. రామకృష్ణ రోజూ కాలేజికి వెళ్ళి సాయంత్రం బస్సు దిగగానే నేరుగా అపర్ణ ఇంటికి వెళ్ళి ఆమెతో ఆనాటి కాలేజి విశేషాలు చెప్పి ఇద్దరూ తనివితీరా మాట్లాడుకొన్న తరువాతగాని ఇంటికి వెళ్లేవాడు కాదు. ఇది మొదట్లో సహజంగానే జరిగిపోయింది. కాని కొన్నినెలలు గడిచేసరికి ఇది విషఫలితాలకు దారితీయసాగింది.

రామకృష్ణకు, అపర్ణకు మీద సంబంధాలు అంటగట్టారు ఆపల్లెటూరి ప్రజలు. రామకృష్ణ అపర్ణను ఉంచుకొన్నాడని ఊరంతా దుమారం రేగింది. రామకృష్ణను ఇక తమ ఇంటికి రావద్దని ఖచ్చితంగా చెప్పేసారు ఆమె తల్లిదండ్రులు. రామకృష్ణముందే తల్లిదండ్రులమీద విరుచుకుపడింది అపర్ణ. 'ఊళ్ళోవాళ్ళకు బుద్ధిలేకపోతే మీ తెలివేమయింది. వాళ్ళు గడ్డి తినమంటే మనం తినేదేనా' అంటూ ఏడ్చింది.

రామకృష్ణ ఇక అక్కడ ఉండలేక అపర్ణకు 'సారీ' చెప్పి ఇంటికి తిరిగి వచ్చేసాడు. అతని మనసు వికలమైంది. అంతలోనే ఆలోచనలతో ఒక శక్తిమైన జ్ఞానం వచ్చింది. 'అవును, పెళ్ళికాని ఆడపిల్ల ఇంటికి వెళ్తే అపవాదే గదా. అందుకే నా దేవతను పెళ్ళిచేసుకొని

ఇంటికి తెచ్చుకొని పూజించుకొంటాను' అని నిశ్చయించుకొన్నాడు. ఆ నిశ్చయం తోనే తల్లిదండ్రులతో ఈ విషయం కదిపాడు.

అతని తండ్రి ఈ పెళ్ళికి ఒప్పుకోలేదు. "నీతో సమాన వయసున్న అది దాన్ని ఎలా చేసుకొంటావురా ఆయుః క్షీణం. పెళ్ళాం అనేది నీకంటే నాలు గేళ్ళు చిన్నదిగా ఉండాలి" అంటూ కసిరాడు. అతని తల్లి కూడా "ఒరేయ్ చదువుకొంటున్నావు ఆ పిల్లను చేసుకొని ఏం బావుకొంటావురా నీకు కట్నమూను కాని పాతికవేలు కట్నమిస్తారు" అంటూ కళ్ళనీళ్ళు ఒత్తుకొంది. రామకృష్ణ రెండు రోజులు అన్నం తినకుండా ఉగ్గపట్టేసరికి తల్లిదండ్రులు అతని దారికివచ్చి ఈ పెళ్ళికి ఒప్పుకొన్నారు.

అయితే రామకృష్ణ ఆనందం ఆవిరై పోయింది. అపర్ణ తల్లిదండ్రులు ఈ పెళ్ళికి తాము ఒప్పుకోమన్నారు. పట్నంలో ఉండే తన తమ్ముడికే తన కూతుర్ని ఇవ్వాలని పట్టుపట్టింది అపర్ణ తల్లి. అపర్ణ పనేమిటా తాను రామకృష్ణను తప్ప వేరే వాళ్ళను చేసుకోనని ప్రతిజ్ఞచేయడంతో ఆమె తల్లి గన్నేరుకాయలు నూరుకొని తింది. దాంతో ఆమెకు ప్రాణాంతకమై వారంరోజులు హాస్పటల్లో ఉండాల్సి వచ్చింది. ఆ వారంరోజుల్లో చిక్కి శల్యమైపోయింది అపర్ణ. హాస్పిటల్ ఆవరణలో రామకృష్ణ, అపర్ణ ఒకరినొకరు కౌగలించుకొని ఏడ్చేవాళ్ళు.

మరుసటి నెలలో అపర్ణకు ఆమె మేనమామతో సంబంధం కుదిర్చింది ఆమె తల్లి. తల్లియొక్క పట్టుదల తెలిసిన అపర్ణ తెలిసితెలిసీ తన తల్లిని చంపుకోలేక మౌనంగా ఊరుకొంది. మౌనమే అంగీకారంగా చేసుకొని ముహూర్తాలు పెట్టేశారు. రామకృష్ణ శరీరం కొలిమిలో కాల్చినంత బాధపడింది. మనసు ముక్కలైపోయింది. అపర్ణ మనసు రామకృష్ణకు తెలుసు. అందుకే తనవలన ఎవరికి ఎటువంటి ఇబ్బంది రాకూడదనే ఉద్దేశంతో గాయపడిన మనసుతో ఎటో వెళ్ళిపోయాడు. తరువాత వారానికి ఇరవై రెండేళ్ళ అపర్ణకు, నలభై అయిదేళ్ళ మేనమామతో వివాహం నిరాఘాటంగా జరిగిపోయింది.

ఇది జరిగిన తొమ్మిదేళ్ళ తరువాత మళ్ళీ మొన్ననే తన ఊరికి వెళ్ళాడు రామకృష్ణ. ఈ సమయంలో అతని గుండె రాయి అయింది. ఆ రాయిలో ఓ సున్నితపు పొర ఉంది. ఆ పొరల మాటున దాగిఉంది అపర్ణ ఇప్పటికీ. అతని రాకకు ముసలి తల్లిదండ్రులు ఎంతో సంతోషించారు. ఇంతవరకు తన యోగ క్షేమాలు తెలియజేస్తూ నెలనెలా డబ్బు పంపించేవాడే కాని ఎప్పుడూ ఊరికి రాలేదు.

రామకృష్ణ మెలితిరిగి మీసాల్ని, కరకు తేలిన ముఖాన్ని, నిండైన ఆకారాన్ని'




ఎంతో మెచ్చుకొన్నారు. ఊళ్ళోనివాళ్ళు వినయం ఉట్టిపడేట్లు మాట్లాడారు. మిలటరీ సంగతులు చెప్పమని గుమిగూడారు. అతను తెచ్చిన వింతైన వస్తువుల్ని విచిత్రంగా చూసారు. అతను మిలటరీలోని డిసిప్లెయిను గురించి, అక్కడ సంఘటనలను గురించి కథలు కథలుగా చెబుతూంటే చెవులు రిక్కించుకొని విన్నారు.

సాయంత్రం వరకు ఉగ్గబట్టుకొన్న అతని మనసు ఇక నిలవలేకపోయింది. తల్లి దండ్రులు ఆ విషయం ఎత్తితే తనను చీవాట్లు పెడతారని మెల్లగా అపర్ణ ఇంటివైపు అడుగులు వేసాడు. ఇల్లు దగ్గరయ్యేకొద్దీ అతని అడుగులు తడబడసాగాయి. ఇంటికి తాళం వేసి ఉంది. ఇల్లు శిథిలమయి అక్కడక్కడా గోడలు పడిపోయి ఉన్నాయి ప్రహరీ గోడలు విరిగిపోయి ఉన్నాయి. ఇంటి ముందు పెద్ద వేపచెట్టు, దానిచుట్టూ కట్టిన సిమెంటు అరుగుమీద ఎన్నోసార్లు తాము ఎదురెదురుగా కూర్చొని తీపి కబుర్లు చెప్పుకొనేవారు. ఇప్పుడు ఆ చెట్టుచుట్టూ ఉన్న అరుగు పగిలి చీమలు పుట్టలు పెట్టి ఉన్నాయి.

రామకృష్ణ ఎవరినీ వివరాలు అడగడం ఇష్టంలేక, నేరుగా తన క్లాసుమేటు, అపర్ణ స్నేహితురాలు అయిన జయంతి ఇంటికి నడిచాడు. జయంతి ఆ ఊళ్ళోనే తన బంధువులలో ఒకర్ని వివాహంచేసుకొంది. అతను వ్యవసాయం చేస్తుంటాడు. రామకృష్ణను ఎంతో ఆదరించి ఆహ్వానించింది జయంతి. కుశల ప్రశ్నలయ్యాక అసలు విషయం కదిపాడు రామకృష్ణ.

అపర్ణకు వివాహమైన మరు సంవత్సరంలోనే ఆమె తండ్రి చనిపోయాడని, తరువాత ఆమె భర్త ఆస్తంతా తాగుడుకు ఖర్చుపెడుతూ అపర్ణను బాధపెట్టేవాడని చెప్పింది. అపర్ణ ఆ బాధలు పడలేక

భర్తను వదలి వెళ్ళిపోయిందని, ఎవరి సాయంతోనో సినిమాల్లో చేరి టాపు స్టారుగా పేరు గాంచిందని తెలియజేసింది. మొదట ఆమె అనుభవించిన కష్టాలు విని బాధపడ్డా తరువాత అమె గొప్ప కళా కారిణిగా మారినందుకు కొనియాడాడు.

రామకృష్ణ ఎంతో బలవంతం చేసిన మీదట గాని అపర్ణ అడ్రసు ఇవ్వలేదు జయంతి. అపర్ణ పేరు మార్చుకొంది సినిమాకి అనుగుణంగా. తనకు మొదట్లో ఉత్తరాలు వ్రాసేదని, ప్రతి దాంట్లోనూ రామకృష్ణ పేరే విధిగా ఉండేదని తెలియ జేసింది జయంతి. తనపై అపర్ణకు గల అభిమానానికి ఎంతో ఆనందించాడు.

అపర్ణను చూసి ఓ పదిరోజులుండి పోదామని వచ్చిన రామకృష్ణ అమె పుట్టింట్లోనూ, అత్తవారింటోనూ లేదని తెలిసిన తరువాత సరిగ్గా నాలుగు రోజులు కూడా ఉండలేక పోయాడు. తల్లిదండ్రులను ఎలాగో ఓదార్చి ట్రెయిన్‌లో అపర్ణను కలుసుకోవడానికి బయలుదేరాడు.

* * *

రామకృష్ణ ఆలోచనలు వదలి ఈ లోకంలోకి వచ్చేసరికి రైలు ఒక పెద్ద స్టేషనులో ఆగి ఉంది. జనం కోలా హలంగా అటూ ఇటూ తిరుగుతున్నారు.

రామకృష్ణ సీట్లోంచి లేచివెళ్ళి కొన్ని మాగజైన్సు తెచ్చుకొన్నాడు. పేజీలు తిప్పుతున్నాడుగాని అతని మనసు పుస్తకం మీద లగ్నం కావడంలేదు. 'అపర్ణ టాప్ హీరోయిన్ కదా. ఎంత బిజీగా ఉంటుందో. తను వెళ్ళిన సమయానికి తనకంటే అందమయినవాళ్ళు, ఆస్తి పరులు, ప్రాణమయినా ఇవ్వగలిగినవాళ్ళు ఆమె అభిమానులున్నారు కదా. వాళ్ళ ప్రేమముందు తనను మరచిపోయి ఉండదు కదా, అని అనుమానం.

'ఎట్టి పరిస్థితుల్లోనూ తనను మరచి పోదు. ఆమె మనసు తనకు తెలుసు. లక్షలమధ్య కూరుకుపోయినా, భవంతు ల్లోని మారుమూల గదుల్లో ఉన్నా తన ఉనికి తెలిస్తే చాలు సర్వం వదలుకొని రాగలదు' అనే నమ్మకం అతన్ని కలవర పరస్తూ ఉంది.

మరో నాలుగు గంటలు ప్రయాణం అనంతరం రైలు సెంట్రల్ స్టేషన్‌లో ఆగింది. రామకృష్ణ బ్యాగు హోల్డరు పట్టు కొని స్టేషను బయటకు రాగానే టాక్సీలను బారులు, బారులుగా నిలిపిఉన్న డ్రైవర్లు "టాక్సీసార్, టాక్సీ" అంటూ మెట్లదగ్గర నిలబడి వచ్చే ప్యాసెంజర్ల చెవుల్లో హోరు పెడుతున్నారు.

రామకృష్ణ తన బాగు, హోల్డరును ఒక టాక్సీ డ్రైవరుకు అందించాడు. వాడు డిక్కీలో పెట్టి వచ్చేలోగా వెనకసీట్లో కూర్చున్నాడు. కారు వేగంగా ముందుకు కదిలింది. రామకృష్ణ సూచన ననుసరించి కారును ఒక పెద్ద హోటలు ముందు ఆపాడు. అపర్ణను అప్పుడే కల్సుకోదలచు కోలేదు రామకృష్ణ. మరురోజు ఉద

యాన్నే ఆమెను కలుసుకోవాలనేది అతని ఆలోచన.

అందుకే, ఆరోజు లాడ్జిలోనే విశ్రాంతి తీసుకొని సాయంత్రం బీచ్‌కి వెళ్ళాడు. కొద్దిసేపు సముద్రపు అంచున నిలబడి అలల స్పర్శను అనుభవించాడు. తరువాత కొద్దిదూరం నడిచి ఇసుకలో కూర్చొన్నాడు. అక్కడక్కడా జంటలు జంటలుగా ఆరామగా కలిసి కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు. చిన్నపిల్లలు సముద్రపు అంచునే అలలతో ఆడుకొంటున్నారు. పెద్దవాళ్ళు పర్యవేక్షిస్తున్నారు.

రామకృష్ణ ఆ అందాలు తిలకిస్తూండగానే చీకటిపడి పోయింది. బీచ్‌లో ఒక్కొక్కరే లేచి వెళ్ళిపోతున్నారు. కిరోసిన్ దీపాలు పెట్టుకుని పకోడీలు, చెరుకురసాలు, ఇంకా ఎన్నో రకాలయిన వస్తువులు పెట్టుకొని అమ్ముతున్నారు కొందరు. రామకృష్ణ లేస్తుండగా అతని ప్రక్కనే ఇద్దరు స్త్రీలు నడచి వెళ్ళారు. ఇద్దరూ ఎంతో ఆనందంగా నవనవలాడుతూ ఉన్నారు. వారి దుస్తుల్లోంచి వెలువడిన సువాసనలు రామకృష్ణ నాసికాపుటాలకు మత్తుగా దోచాయి.

రామకృష్ణ బట్టలకు అంటుకొన్న ఇసుక దులుపుకొని పైకి లేచాడు. అతను ముందుకు అడుగువేయబోతుండగా "వణక్కంసార్" అంటూ వచ్చాడొకడు.

"ఏం కావాలి"

రామకృష్ణను తేరిపారజూసి "సార్ మీరు తెలుగు వాళ్ళా. అయితే బాధే లేదు" అన్నాడు.

"ఏమిటి నువ్వు చెప్పేది?"

"సార్! ఇప్పుడు మీ ముందునుంచి వెళ్ళిన వాళ్ళిద్దరూ సినిమాస్టార్స్ సార్. ఒకామె మయూరి. ఇంకొకామె వయారి. మీకు వారిలో ఎవరు కావాలి. మీరు ఊ అంటే టాక్సీ తీసుకొస్తాను. వెళ్దాం"

రామకృష్ణ ఆలోచనలో పడ్డాడు. అతనికి స్త్రీ పొందు కొత్తగాదు. అతను అపర్ణతో సంబంధాలు తెంచుకొన్న తరువాత అక్కడక్కడా అందమైన ఎందరో స్త్రీలపొందు కోరాడు. కాని ఎవరినీ ప్రేమించలేదు. అందుకే ఇంత అందమైన వాళ్ళను వదలడానికి బుద్ధిపుట్టలేదు.

"మీరేం భయపడకండి సార్. రాత్రికి అయిదు వందలౌతె. ఇప్పుడు వదలి మళ్ళీ ఉదయాన్నే మిమ్మల్ని మీ రూంకి చేరుస్తా."

"సరే. ఆ తెల్లచీర మనిషి."

"అయితే జానపద హీరోయిన్ మయూరి అన్నమాట. మీరు రోడ్డెక్కండి. నేను టాక్సీ తీసుకొస్తాను" అంటూ వాడు పరుగెత్తుకుపోయాడు. రామకృష్ణ స్టన్ అయ్యాడు. ఆమె మయూరిగా పేరు మార్చుకొన్న అపర్ణ కాదుగదా. అయినా ఆమెకెందుకంత దుర్గతి పడుతుంది. గొప్ప కోసం కొంతమంది పెద్ద హీరోయిన్ల

పేరు పెట్టుకోవచ్చు, అని సమన్వయించు కొన్నాడు.

రామకృష్ణ రోడ్డుమీదికి వచ్చేసరికి వాడు ఎక్కడనుంచో టాక్సీ తీసుకొచ్చి ప్రక్కనే ఆపేస్తూ ఆపాడు.

టాక్సీ ఒక సన్నని సందులోంచి పోతూ ఉంది. సందుకు అటువైపు ఇటు వైపు దాదాపు ఇళ్ళు ఉన్నాయి. టాక్సీ ఒక దాబా ఇంటిముందు ఆగింది.

డ్రైవరు, రామకృష్ణను వరండాలో కూర్చోబెట్టి కాలింగ్ బెల్ నొక్కాడు. తలుపులు తెరచుకోగానే లోపలికి వెళ్ళి ఏదో మాట్లాడాడు. తరువాత రామకృష్ణను తీసుకువెళ్ళి లోపల కూర్చోబెట్టి ఉద యాన్నే వస్తానంటూ వెళ్ళిపోయాడు.

రామకృష్ణ గదిని పరిశీలనగా చూసాడు. ఆ గది ఐశ్వర్యవంతుల ఇల్లులా తలతూగుతూ ఉంది. గదికి నాలుగు వైపులా ఉన్న ద్వారాలకు రంగుల డోర్ కర్టెన్లు వ్రేలాడు తున్నాయి. గదిలో ఒక వైపుగా డబుల్ కాట్ బెడ్ ఉంది. దానిపైన ఫోమ్ పరు పులు, దిండ్లు ఉన్నాయి. ఆ బెడ్ నాలు గయిదు వేలకు తక్కువ చేయదని అతని అంచనా. ఒకవైపు ఫ్రిజ్ ఉంది. ఇంకో మూల డ్రెసింగ్ టేబులుంది. అక్కడున్న టేబులుమీద ఎన్నో రకాలయిన సెంట్లు, పలురకాలయిన పౌడర్లు ఉన్నాయి. గోడల మీద రాధాకృష్ణుల శృంగారం మొదలు కొని, కళాఖండాలనదగిన చిత్రాలుకూడా ఉన్నాయి. రామకృష్ణ మెత్తని సోఫాలో కూర్చొని చల్లని గాలిని అనుభవిస్తూ గదిలోని ఐశ్వర్యానికి ఆశ్చర్య పోతున్నాడు. మాగజైన్సు తిరగేస్తూ అర్ధ గంట గడిపాడు.

ఇంతలో వెనుకవైపునుంచి డోరు కర్టెను తొలగించుకొని వచ్చింది మయూరి. అప్పుడే స్వర్గంనుంచి దిగివచ్చిన అప్స రసలా ఉంది. ఒళ్ళంతా కనిపించే పలు చని నైట్‌గౌను క్రిందివరకూ వేసుకొని ఉంది. బ్రాసరీ, అండర్‌వేర్ స్పష్టంగా కనిపిస్తూ ఉన్నాయి. టమేటారంగు శరీర చ్ఛాయతో కోమలంగా కనిపిస్తూ స్వర్గం నుంచి దిగివచ్చిన రంభను మరిపిస్తూ ఉంది.

రాగానే ఆమె రామకృష్ణకు కరచా లనం చేసి "ఆయామ్ మయూరి ప్రైవేట్ సెక్రటరీన్" ఇంగ్లీషులో స్టయిల్‌గా అని అతని పక్కనే సోఫాలో ఆనుకొని కూర్చొంది.

రామకృష్ణకు ఆకాశంనుంచి విమానం తన నెత్తిన కూలినట్లయింది. తల గిర్రున తిరిగింది. ఆమె ఎవరో కాదు తన అపర్ణ. మనిషి ఎంతో మారింది. శరీరం లావెక్కింది. అయినా ఆకర్షణ తగ్గలేదు.

అతని మనసు మనసులో లేదు. ఒక నాటి అపర్ణకు, ఇప్పటి మయూరికి ఎక్కడా సంబంధం లేదు. కాలేజికి



వెళ్లేప్పుడు పైట కూడా జారకుండా జాగ్రత్తపడుతూ తన నడవడికలో సంస్కారం ఉట్టిపడుతూ ఎంతో పవిత్రంగా కనిపించే ఆమె ఎక్కడ? శరీరాన్ని బహిర్గతంచేస్తూ అట్టడుగుకు దిగజారిపోయిన ఈ మయూరి ఎక్కడ?? దేవుడు అపర్ణ మనసును ఎందుకు బండరాయిలా చేసాడు అనుకొంటూ మధన పడసాగాడు.

తనను ఆమె ఎట్టి పరిస్థితుల్లోనూ గుర్తుపట్టలేదని రామకృష్ణకు తెలుసు. తన మిలటరీ ట్రెయినింగులో పర్వతారోహణ ఒక భాగం. ఒక సారి తాడుని ఆధారం చేసుకొని ఎక్కుతుండగా ముప్పై అడుగుల ఎత్తునుండి జారిపడ్డాడు. అప్పుడు తలమీద, నుదుటిమీద గాయాలు తగిలి ప్రస్తుతం మచ్చలేర్పడ్డాయి. మీసాలు గుబురుగా, లావుగా ఉన్నాయి.

ముఖంలో కాఠిన్యం వచ్చింది.

"మై నేమ్ ఈజ్ రామకృష్ణ" అనలేక అన్నాడు.

"ఓ.... నైస్ నేమ్. మీ రాకతో మా ఇల్లు పావనమయింది"

"థాంక్స్."

"మరయితే పార్టీ చేసుకుందామా?" అంటూ అపర్ణ లేచి తలుపులు అన్ని వైపులా బంధించింది. తరువాత తాపీగా ఫ్రిజ్ తెరిచి లోపల ఉన్న రకరకాల పదార్థాలను ప్లేటులో సర్దింది. టీపాయ్‌ను సోఫా ముందుకు జరిపింది.

"ఈట్, డ్రింక్ అండ్ ఎంజాయ్. ఇది ఈ మయూరి పాలసీ మిస్టర్" అంటూ బ్రాందీ బాటిల్ ఓపెన్‌చేసి రెండు గ్లాసుల్లో పోసింది అపర్ణ. తరువాత సోడా కలిపింది.

ఆమె ప్రస్తుత స్థితికి రామకృష్ణ ఎంతో బాధపడుతున్నాడు. ఆమె అలాంటి సిద్ధాంతాన్ని ఏర్పరచుకొంటుందని అతను కలలో కూడా అనుకొని ఉండలేదు.

ఆమె బ్రాందిగ్లాసును రామకృష్ణకు అందించి, తను ఒక గ్లాసు తీసుకొని చీర్స్ కొట్టింది. తరువాత ప్లేటులోని చికెన్‌ఫ్రై అతని ముందుకు జరిపింది. రామకృష్ణ, అపర్ణ చికెన్ తింటూ మొదలు పెట్టారు. నాలుగు రౌండ్లనే రామకృష్ణ పనయిపోయింది. ఇక తాగలేక పోతున్నాడు. ఒళ్ళు తేలిపోసాగింది. కాని అపర్ణ ఇంకో రెండు రౌండ్లు తాగింది. మిలటరీలో అలవాటుగా తాగే రామకృష్ణ ఆమె నిగ్రహానికి ఆశ్చర్యపోయాడు.

అపర్ణ తాగిన మత్తులో ఏదేదో అంటూ ఉంది "కమాన్ రామకృష్ణా... కమాన్. ఏన్జాయ్ మి...హో... రామకృష్ణా ! మి.... కిస్...."

రామకృష్ణ ఆమెను చేతుల్లో తీసుకు వెళ్ళి సోఫాబెడ్ మీద పడుకో పెట్టాడు.

"రామకృష్ణ .... ఐ వాంట్ యు" మత్తుగా కలవరిస్తూ అతన్ని వదలిపెట్టలేదు. ఆమెను మెల్లిగా తొలగించుకొని వచ్చి సోఫామీద కూర్చొన్నాడు. ఆమె బెడ్‌మీద అస్తవ్యస్తంగా పడి నిద్రపోయింది.

రామకృష్ణకు ఆ రాత్రి నిద్రరాలేదు. డబ్బు వ్యామోహంలోపడి అపర్ణ ఎందుకింత చెడిపోయింది అనేదే ఆలోచిస్తున్నాడు. పదేపదే ఆమె సిద్ధాంతం అతన్ని కలవరపరుస్తూ ఉంది. తెల్లవారుజామున ఆలోచనల్లో కుర్చీలోపడి నిద్రపోయాడు. ఎప్పటికో మత్తుగా కళ్ళు తెరిచాడు. టైము చూసుకొని ఉలిక్కిపడ్డాడు. ఉదయం తొమ్మిదయింది. ప్రక్క బెడ్‌మీద అపర్ణ లేదు. అతను బద్ధకంగా ఒళ్ళు విరుచుకొని ఒకవైపు కర్టెను తొలగించి చూసాడు. ప్రక్కనే వేరొక ఖరీదైన గది ఉంటుందనుకొన్న అతను అక్కడి దృశ్యంచూసి ప్రమాన్పడిపోయాడు.

సన్నగా పడవలా ఉంది ఆ రూము. అందులో వస్తువులేమీ లేవు. నాలుగు పత్తుగిన్నెలు, ఇంకా ఏవేవో పొత్తరబ్బా లున్నాయి. ఒక మూపలిది ఆటు తిరిగి




అన్నం కలియబెడుతూ ఉంది.

రామకృష్ణ శబ్దం కాకుండా వెనుకకు తిరిగి ఇంకో కర్టెను తొలగించి బాత్‌రూమ్ లోకి వెళ్ళివచ్చాడు. తరువాత అతను మూడవవైపు గది తెరిచి చూసాడు. అది చాలా చిన్నగది. అక్కడ పాత సూట్‌కేసులు ఎత్తుగా ఉన్నాయి. ఒక తీగెమీద పాత చీరెలు, చినిగిన రవికెలు వ్రేలాడుతున్నాయి. ఇంకో తీగెమీద రెండు ఖరీదైన చీరలు వ్రేలాడు తున్నాయి. రామకృష్ణ శబ్దం కాకుండా తలుపుగు దగ్గరకు లాగాడు.

అతని కిప్పుడంతా ఆశ్చర్యంగా ఉంది. మయూరి పేరుతో సినిమా రంగంలో అడుగుపెట్టిన అపర్ణ, గొప్ప కళాకారిణిగా లక్షలు సంపాదించిందను కొన్నాడు. కాని బెడ్‌రూం తప్ప మిగతా అన్నిగదుల్లో దారిద్ర్యం విలయతాండవం చేస్తూ వయుష్పవృత్తిలో జీవిస్తూందని అనుకోలేదు.

రామకృష్ణ వరండాలోకి వచ్చాడు. రాత్రి తనను తీసుకొచ్చిన టాక్సీ డ్రైవరు అక్కడ కూర్చొని ఉన్నాడు. ఇతన్ని చూడగానే వినయంగా లేచినిలబడ్డాడు.

"మయూరి ఎక్కడికి వెళ్ళుంటుంది?"

"ఇంకెక్కడికి సార్, ఎక్స్ట్రా వేషం దొరికుంటుంది వెళ్ళుంటుంది."

"హీరోయినే మయూరి ఎక్స్ట్రానా" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఒకప్పుడు టాప్ స్టారే. కాదనను సార్. ప్రస్తుతం ఆమెకు మార్కెట్ లేదు. సంపాదించిందంతా వ్యసనాలు తినేశాయి ప్రస్తుతం ఆమెకు డబ్బు సంపాదించిపెట్టేది ఆ గదిలో ఉన్న పాన్పే. స్వంత భవనం కూడా ఈ మధ్యనే అమ్మేసింది".

"వెనుక గదిలో ఉన్న ముసలిది ఎవరు?"

"ఆమె తల్లి."

రామకృష్ణ టాక్సీ డ్రైవరుకు కమీషన్ ఇచ్చి పంపేశాడు.

అటువైపు ఏదో పనిమీద వచ్చిన ముసలిదాన్ని దగ్గరకు పిలిచాడు. ఆమె ఎండిపోయి బలహీనంగా ఉంది.

"నీ పేరేమిటి"

"నా పేరు రంగమ్మ నాయనా. మయూరి ఇంట్లో పనిమనిషి, బాబూ! రాత్రికి కూడా అమ్మగారి దగ్గరకు వస్తారా."

ఆ పిలుపెంతో ఆర్తిదే. ఆ ముడుతలు తేరిన ముఖం ఒకప్పుడు రాజసం ఒలికేది. పరువు మర్యాదలకు ప్రాణం పెట్టేది. అటువంటి అత్తే ప్రస్తుతం రాత్రికి వస్తారా బాబూ అని అడుగుతోంది.

విరక్తిగా బయటకు నడిచాడు.

• • •

అపర్ణ కంటికి కడివెడుగా ఏడుస్తోంది. గతరాత్రి జరిగిన దురదృష్ట సంఘటన ఆమె హృదయాన్ని చిన్నాభిన్నం చేసింది. త్రాగి పడిపోయిన అపర్ణ ఎప్పుడో మెలుకువ వచ్చి లేచింది. టీపాయ్ మీదున్న హాండ్‌బాగ్‌ను మెల్లగా తెరిచింది డబ్బుంటుందేమోనని. మొద టగా మీదున్న డైరీ కనిపించింది. అందులో తన ఫోటో. క్రింద నీ ప్రేమ పూజారి రామకృష్ణ అని వ్రాసి ఉంది. ఆమెకు యదార్థం బోధపడడానికి ఎంతో సేపు పట్టలేదు.

రామకృష్ణ లేచినపుడు అతనికి కని పించకుండా పాత సామానుల గదిలో దాక్కుంది. అతను గుమ్మందాటి వెళ్ళిన తరువాతగాని గదిలోకి రాలేదు.

"ఎందుకు రామకృష్ణా కాలరాచిన పువ్వుకోసం ఆరాటపడతావ్. నాది గాడి తప్పిన జీవితం. జీవచ్ఛవంలా బ్రతుకు తున్న నన్ను నీ హృదయంలోంచి తీసి వేసి శాశ్వతసమాధి చేయ్. అల్ దట్ గ్లిట్టర్స్ ఈజ్ నాట్ గోల్డ్. నన్ను బ్రతి కించే ఈ పాన్పు పూలపాన్పు కాదు. ఓటలువారి పగుళ్ళుతీసిన నా జీవితానికిది నిదర్శనం" క్రింద కూర్చొని సోఫామీద తలపెట్టి కారే కన్నీటిని తుడుచుకొంటూ విలపిస్తోంది.

అదే సమయంలో రామకృష్ణ హోటలు గదిలో కూర్చుని ఊబిలో కూరుకుపోయిన గొప్ప కళాకారిణి అపర్ణను ఎలా రక్షించి తనదానిని చేసుకోవాలా అని ప్రణాళికలు వేస్తున్నాడు.



# ప్రయాణం

సంచీ చేతపుచ్చుకుని ఇంట్లోనించి బయటకు రాగానే "ఎక్కడికి ప్రయాణం?" అని ఎవరైనా మిమ్మల్ని అడిగితే మీకెంత కోపంవస్తుంది? కాని, నారాయణకు అసలు కోపం రాదు. కోపంరాదు సరికదా ఎంతో సంతోషపడిపోతాడు.

గర్వంగా అలా అడిగిన వాళ్ళకేసి చూసి తాను ఏ వూరుకు బయల్దేరిందీ, ఆ వూరు చేరటానికి తను ఎన్ని బస్సులు లేక ఎన్ని రైళ్ళు మారవలసి వుండేదీ ఎన్ని గంటలకు ఆవూరు చేరేది అన్నీ వివరంగా చెబుతాడు. చివరకు తను ఎప్పుడు తిరిగివచ్చేదీ కూడా చెబుతాడు నారాయణ.

అందుకే ఆవూళ్ళో నారాయణ ఇంటి పేరును అంతా ఎప్పుడో మరచిపోయారు. ఇప్పుడు అతడిని అంతా ప్రయాణాం నారాయణ అంటారు. తెలియనివాళ్ళయితే 'ప్రయాణాల' అనేది అతని ఇంటిపేరని అనుకుంటారు.

ప్రయాణాల నారాయణ అంటే నారాయణ ఎంత ఆనందపడిపోతాడో! కొంత మంది చిన్నపిల్లలుకూడా ఆయన ఎదురు పడితే 'ప్రయాణాల నారాయణగారూ.... ఎక్కడికి ప్రయాణం?' అని అడుగుతారు. చిన్నపిల్లలు కదా అడిగింది అని నిర్లక్ష్యం చెయ్యడు నారాయణ వాళ్ళకికూడా అన్నీ వివరంగా చెప్పి మరీ వెళతాడు.

ఎందుకో నారాయణకు ప్రయాణం అంటే అంత ఇష్టం .... ఏదయినా ముందుగా తెలిసిన ప్రయాణమైతే దానికి రెండు రోజులు ముందునించే సన్నాహాలు మొదలుపెడతాడు. బట్టలన్నింటినీ తెల్లగా మల్లెపువ్వులా వుతుక్కుంటాడు. వాటిని మడతలుపెట్టి ముందుగానే సంచిలో సర్దుకుంటాడు.

బస్సుకావటానికి రెండు గంటలు ముందుగానే ఇంట్లోనించి బయటకు వస్తాడు.... ఎవరో ఒకరు అతడి ప్రయాణం గురించి అడగనే అడుగుతారు. వాళ్ళందరికీ తన ప్రయాణం గురించి చెప్పుకుంటూ బస్సుదగ్గరకు చేరేసరికి ఆ రెండు గంటలూ పూర్తిగా గడిచిపోతాయి.

ఎవరయినా నారాయణను "ప్రయాణాలంటే నీకెందుకింత ఇష్టం?" అని అడిగితే ఆయన చిద్విలాసంగా నవ్వి "ఒక్కో మనిషికి ఒక్కో రకమైన సరదా వుంటుంది. నాకు ప్రయాణమంటే సరదా ....ప్రయాణం చేస్తుంటే అనుభవాలు చాలా చిత్రంగా వుంటాయి.... ఎప్పుడూ ఇంట్లోపడి కూర్చుంటే ఏముంది జీవితం?" అని ఎదురుప్రశ్న వేస్తాడు....

అప్పుడిమటుకు నారాయణ గొప్ప మేధావిలా కనిపిస్తాడు.... ఒక రకంగా ఆయన ఆలోచన సరయినదేనేమో అని పిస్తుంది....

నారాయణ తన సొంత పనులమీదనే

ప్రతాప రవిశంకర్

ప్రయాణాలు చేస్తూవుంటాడని అనుకుంటే పొరపాటు పడినట్టే లెక్క.... ఆయన ఎవరి పనిమీదయినా ప్రయాణాలు కడుతూవుంటాడు.... ఆ వూళ్లో ఎవరికయినా ఏదయినా పనివుండి ఏ పట్నంనించో ఏదయినా వస్తువు కావలసి వచ్చినప్పుడు వాళ్లు నారాయణను పంపిస్తూవుంటారు. అప్పుడు నారాయణకు ఒంట్లో బావుండకపోయినా, ఓపిక లేకపోయినా లేని శక్తిని తెచ్చుకుని ఆ పనిమీద వూరికి బయల్దేరుతాడు.

ఒక్కోసారయితే కొంతమంది కుర్రాళ్లు ఎప్పుడయినా పట్నానికి బయల్దేరితే కావాలని నారాయణను వెంటపెట్టుకుని వెళుతూవుంటారు. ఆయన్ని వెంట తీసుకువెళితే బాగా కాలక్షేపంగా వుంటుంది. ఏవో కబుర్లు చెబుతూనే వుంటాడు. అంతేకాదు. పట్నంలో ఎంత దూరం తిప్పినా తిరుగుతాడు. ఎవరైనా కొన్ని వరుకులన్నింటినీ ఓపిగ్గా పట్టుకుంటాడు. ఏ దుకాణం దగ్గరయినా కూర్చోపెడితే మళ్లీ ఆ మనుషులు తిరిగొచ్చేవరకూ కదలకుండా అక్కడే కూర్చుంటాడు....

అందుకే ఆ వూళ్లో నారాయణ అందరికీ స్నేహితుడు.

చిన్నతనంనించే నారాయణకు ప్రయాణాలంటే ఈ సరదా వుండేట.... అప్పుడే ఎవరు పిలిస్తే వాళ్ళతోకలసి ఇంట్లో చెప్పకుండానే వెళ్ళిపోయేవాడుట. అతనికోసం వూరంతా వెతుకుతుంటే ఎప్పుడో వూరినించి దిగేవాడట.

తన చిన్ననాటి ప్రయాణాల అనుభవాలగురించి నారాయణే ఎవరయినా అడిగినప్పుడు చెబుతూవుంటాడు.

నిద్రపట్టక సతమతమయ్యే మనుషులకు నారాయణ అవూళ్ళో మంచి కాలక్షేపం. ఆయన్ని పిల్చి కాల్చుకోటానికి సిగరెట్టునో, చుట్టముక్కనో ఇస్తే ఇహ కదలకుండా కూర్చుని అర్ధరాత్రి దాటేవరకూ కబుర్లు చెబుతూనే వుంటాడు....

నారాయణ చిత్రమైన మనిషి. ఆ వూళ్లో ఏదయినా కార్యం జరిగిందంటే నారాయణ అక్కడ వుండితీరుతాడు. ఏక్షణాన ఏ అవసరమొచ్చినా నిముషాల మీద ప్రయాణానికి సిద్ధమయిపోతాడు. ఎవరింటికయినా రావలసిన మైముకు రారేదనుకోండి, అప్పటికప్పుడు వాళ్ళకో చెప్పి వాళ్ళకోసం ప్రయాణం కడతాడు.

ఎవరైనా ఏ చెట్టుమీదనుంచో, ఇంటిమీదనుంచో కిందపడ్డాడనుకోండి..వాడిని అప్పటికప్పుడు ఏ బండిమీదనో, బస్సులోనో వేసుకుని వెళ్ళేమనుషుల్లో నారాయణ తప్పకుండా వుండితీరుతాడు....

ఇలా నారాయణ అవూరి మనుషుల్లో, వాళ్ళ మనసుల్లో ఓ ప్రత్యేకమైనస్థానాన్ని ఆక్రమించుకున్నాడు.

బస్సులోగాని, రైల్లోగాని ఎక్కాడంటే నారాయణ కిటికీప్రక్కగా వుండే సీటునే సంపాదించటానికి ప్రయత్నంచేస్తాడు.

ఇహ కిటికీ ప్రక్కనే కూర్చుని ప్రక్కనే కూర్చున్న మనుషులను పలకరిస్తాడు.

ఏ వూరు మీది? ఎక్కడిదాకా వెళుతున్నారు? ఇంతకుముందు ఎప్పుడయినా అవూరు వెళ్ళారా? ఎన్నిరోజులు అక్కడ వుంటారు?

అన్నీ ఇలాంటివే ప్రశ్నలు.

అవతలి మనిషి ముభావంగా వున్నా తన ప్రశ్నలకు జవాబులు వచ్చేవరకూ వూరుకోడు.... వేధిస్తూనే వుంటాడు....

ప్రశ్నలన్నీ అయిన తర్వాత తన ప్రయాణం గురించిన వివరాలను చెబుతాడు తర్వాత లోకాభిరామాయణమంతా మాట్లాడుతాడు. రాజకీయాల గురించి మాట్లాడుతాడు. పెరుగుతున్న ధరల గురించీ, దొంగతనాల గురించి కూడా ఎక్కువగానే మాట్లాడుతాడు.

ఎప్పుడయినా ప్రయాణం మధ్యలో ఎక్కడో బస్సు చెడిపోయిందంటే ఎవరికైనా ఎంతో విసుగ్గా వుంటుంది. కాని నారాయణకు అసలు విసుగనిపించదు. ఎన్ని గంటలయినా అక్కడే బస్సు బాగు చేస్తుంటే వాళ్ళదగ్గర కూర్చుని అంతా చూస్తూ వుంటాడు. లేకపోతే ఎవరో ఒక ప్రయాణీకుడిని పట్టుకుని కబుర్లలో దించుతాడు.

బస్సు ప్రయాణంకంటే రైలు ప్రయాణమంటే ఆయనకు ఎక్కువ ఇష్టం .... వాళ్ళ వూరికి రైలు లేదు.... ఇంకేదైనా దూరమైన వూరికి ప్రయాణం దొరికితే పట్నానికి వెళ్ళి అక్కడినించి రైల్లో ప్రయాణం చేస్తాడు నారాయణ రైల్లో ప్రయాణం చేసేటప్పుడయితే ఎన్నో స్టేషన్లు వస్తూవుంటాయి. పరుగెత్తుతూ రైలు చేసే చప్పుడు, స్టేషను రావటంతోనే వేగం తగ్గి ఆగిపోవటం... మళ్ళీ స్టేషన్లో గంటలు కొట్టటం -విజిల్ వూదటం.... ఇవన్నీ నారాయణకు ఎంతో హుషారుగా కనిపిస్తాయి. రైల్లో అయితే రకరకాల తినుబండారాలు అమ్మే మనుషులు వస్తూ వుంటారు. వేరుశనగ పాకమంటే నారాయణకు బలే ఇష్టం.... అది గనుక వచ్చిందంటే ఎంతో కొంత కొనుక్కుని తినకపోతే నారాయణకు అరాత్రి నిద్రపట్టదు.

తర్త ప్రయాణాలంటే నారాయణ భార్యకు అసలు గిట్టేది కాదు. పెళ్ళయిన తొలిరోజుల్లో కూడా అతను ఏరాత్రి తొమ్మిదిగంటల సమయంలోనో ఎవరైనా వచ్చి పట్నందాకా వెళ్దాం రమ్మంటే వెంటనే వెళ్ళిపోయేవాడు.... కొన్నిసార్లయితే భార్యతో నారాయణకు ఈ ప్రయాణాల విషయమై గట్టి దెబ్బలాటలే జరిగాయి. చివరకు తన ప్రయాణాలు ఇష్టంలేకపోతే భార్యను ఇంట్లోంచి వెళ్ళిపొమ్మన్నాడు. పాపం.... అప్పటినించీ ఆమె నారాయణ ప్రయాణాల గురించి పల్లెత్తుమాట అనలేదు. అలా అనకుండానే నాలుగేళ్ళక్రితం శాశ్వతంగా ఈ లోకంనించి వెళ్ళిపోయింది.

ఏళ్లు గడిచాయి. నారాయణ ముసలి తనంలో అడుగుపెట్టాడు. అయినా అయనలో ప్రయాణం పట్ల వున్న ఆసక్తి రవంతకూడా తగ్గలేదు ఆ ఉత్సాహం అణుమాత్రంకూడా తరిగిపోలేదు ఈ రోజుకీ అయన ప్రయాణాల నారాయణే..

ఎవరికి ఏ అవసరంవచ్చినా పట్నానికి పరుగుదీసేది నారాయణే—అలాంటి నారాయణకు ఓ పదిరోజులనించీ జ్వరంగా వుంది.

• • •

అరోజుకూడా నారాయణకి జ్వరం పూర్తిగా తగ్గలేదు. కొంచెంగా తగ్గింది. ఐనా బాగానే నీరసంగా వున్నాడు. ఇన్ని రోజులనించీ అ వూళ్ళోవున్న సుదర్శనాచారిగారి దగ్గిరే జ్వరానికి మందు తీసుకుంటున్నాడు.

ఒక గంటక్రితమే నారాయణకోసం ఎవరో వచ్చారు - పట్నానికి వెళుతూ ఆయన్నికూడా తీసుకెళదామని. కాని జ్వరం పూర్తిగా తగ్గలేదని వెళ్ళిపోయారు. అలా వుండికూడా నారాయణ ప్రయాణానికి సిద్ధంకావాలనే అనుకున్నాడు. కాని వాళ్లే ఒప్పుకోలేదు.

చలిగావుంది పాత దుప్పటిని ముసుగు పెట్టి పడుకున్నాడు నారాయణ. ప్రయాణాలు చెయ్యటానికి వీల్లేకుండా చేసిన అ జ్వరాన్ని తిట్టుకుంటున్నాడు.

సరిగ్గా ఆ సమయంలోనే ఆ ఇంట్లోకి పోస్టుజవాను వచ్చాడు. నారాయణను నిద్రలేపి ఓ టెలిగ్రాం వచ్చిందని చెప్పి దాన్ని చదివి వినిపించాడు.

ఆ వార్తను వినగానే నారాయణ కూలిపోయాడు. మొదలు నరికిన చెట్టులా కూలిపోయాడు తర్వాత కుమిలి కుమిలి ఏడ్చాడు.

అక్కడికి వందమైళ్ళ దూరంలోవున్న ఓ ఫ్యాక్టరీలో పనిచేస్తున్న నారాయణకు వున్న ఒకే ఒక్క కొడుకు ప్రమాదం జరిగి చనిపోయాడట. వెంటనే రమ్మని వుంది.

ఇదీ ఆ టెలిగ్రాం సారాంశం.

చాలా పేపటివరకు యేడుస్తూనే వుండిపోయాడు నారాయణ.

తర్వాత సంచిలో గుడ్డలు కుక్కుకుని ఇంట్లోనించి బయటకు వచ్చాడు తాళం పెట్టి.

"ఎక్కడికండీ ప్రయాణాం నారాయణగారూ ప్రయాణం?" అనడిగింది పన్నెండేళ్ళ అమ్మాయి బయటకు రాగానే, ఆయనచేతిలో సంచీ చూసి.

అప్పుడు నారాయణ తన ప్రయాణం గురించి హుషారుగా చెప్పలేదు. పసిపిల్లాడిలా పెద్దగా యేడ్చాడు, అక్కడే కూలిపోయి.

—o—




(గత సంచిక తరువాయి)

రేఖ:

'ఏం లేదు'

'చెప్పు రేఖా! నువ్వు చెప్పి తీరాలి.'

రెండు భుజాలూ పట్టుకుని ఊపుతూ అడిగాడు. వణికిపోతూ అంది రేఖ.

'చెప్తాను మధూ! ఈ విషయం ఇంతకుముందు నే నెవ్వరికీ చెప్పలేదు. నీ దగ్గరా దాచాను. చెప్పగల సాహసం – నీచత్వం – క్రూరత్వం నాకు లేకపోయాయి. చిన్ననాడు బామ్మ మనచేత బొమ్మలపెళ్ళి ఆట ఆడించింది గుర్తుందా? ఆ ఆటలో నువ్వు భర్తవు. నేను భార్యను. ఆటలో మనిద్దర్నీ భార్యాభర్తలను చేసి ఆడించింది బామ్మ ఆనాడు. కాని జీవితం బొమ్మలాట కాగలదా మధూ? ఆ రాత్రి నేను నిద్రపోలేదు. బామ్మ మంచంమీదనే పడుకున్నాం. ఒకప్రక్క పీత-

మరొకప్రక్క నేను. రాకుమారుడి స్వయంవరం గురించి చెబుతున్నది బామ్మ. ఆ కల్పిత గాథలో నన్ను నేను రాకుమారిగా ఊహించుకుని - ఊహలరెక్కలు కట్టుకుని - ఊహాప్రపంచంలో ఎగురుతూ_నీతో సంసారం చేశాను. నీకు వండి పెట్టాను. నీకు తలంటిపోశాను నీకు పిల్లల్ని కన్నాను. నీ పిల్లల్ని పెంచాను. నీకు సేవలు చేస్తూ సుఖశాంతులతో జీవించాను. కాని....!'

'ఎందుకలా బాధపడతావు రేఖా?'

'అది కేవలం బొమ్మలాట.'

'కాదు నిజం. నీవు నా భార్యవి.'

'నీ భార్య సీత! నీకు భార్యగానే పుట్టింది. అదే హోదాలో పెరిగింది. నీవు తన భర్తవనే నమ్మకమైన నిజం - ఆమె నరాల్లో రక్తంలో - రక్తంలోని ప్రతి అణువులో కరిగిప్రవహిస్తూంది. అదే నిజం దావాగ్నిలా మండి_నా శరీరాన్నీ మనస్సునూ ఆత్మనూ దహించి భస్మం చేసింది

'అలా అనకు రేఖా! నువ్వు నాకు కావాలి'.

'పిచ్చిమధూ! నాలోఉన్నది_నీ సీతలో లేనిదీ_ఏముందంటావు? రూపంలో గుణంలో, పదిమందిలో గౌరవంలో, సీత నాకంటె ఉన్నతురాలు. ఆ బ్రహ్మ బంగారంతో బొమ్మను చేశాడు ఆ బొమ్మకు ప్రాణం పోశాడు. పరిమళం అంటించాడు. ఆ పరిమళాల పుత్తడిబొమ్మకు 'సీతమ్మ' అని పేరు పెట్టటమే కాదు, 'మధూపెళ్ళాం' అంటూ మరో మారుపేరు కూడా పెట్టాడు. ఆ మారుపేరుకున్న విలువ అసలు పేరుకు లేదు. ఆ విలువను తూకం వేయగల పదికట్టురాళ్ళ రక్తం ధారపోసినా - ఏ బజారులోనూ దొరికేవి కావు. నన్ను క్షమించు. నీ సీతను ఆదరించు. పిదాన్ని చేసుకో నిన్ను జీవన సర్వస్వంగా భావించి, నీతో భవిష్యత్తును ఊహించుకుంటూ కలలుకంటున్న-ఆ మనస్సు నాకు తెలుసు. మరిచిపో నన్ను- మధూ_ ఏమిటూ పిచ్చి - తప్పు.'

'కాదు రేఖా! లేదు. ఇది తప్పుకాదు. మన జీవితంలో తప్పు లేదు.'

'పాపం మధూ.'

'సరే అనుకో! పాపమే అనుకో? పుణ్యం చేయాలని ఈ ఘోరనరకాన్ని అనుభవించటం కంటే, ఆ పాపంచేసి ఆ ఫలితాన్నే అనుభవిస్తాను.'

'నువ్వు అనుభవిస్తావు! మరి నేను?'

ఇద్దరం అనుభవిద్దాం! అది నరకమైనా స్వర్గమైనా.'

'ఏం చేద్దామంటావ్?'

'పారిపోదాం ఇద్దరం.'

'ఎక్కడికి?'

'ఈ ప్రపంచానికి దూరంగా. తెలిసున్న మనుషులు కనిపించని అడవుల్లోకి.'

కాసేపు మౌనంగా వుంది. తల వంచుకుని కూర్చుంది. బొటనవ్రేలితో నేల మీద రాస్తున్నది సమాధానం పిచ్చిగీతల భాషలో.

'జరగదు మధూ! అసంభవం' అంది మెల్లిగా అతన్ని దగ్గరకు తీసుకుంటూ. మృత్యువును ధిక్కరించగల కౌగిలి. తల తెత్తింది. అతని గడ్డం తగిలింది. తడిమింది. అరచేతో గుచ్చుకుంది. కళ్ళల్లో నీళ్ళు. అతను తుడిచాడు కళ్ళనూ చెంపల్నీ. చిందరవందరైన కురులను సవరించాడు. రేఖ నవ్వింది పలచగా బరువెక్కిన కళ్ళతో. సీత గుర్తుకు వచ్చింది మళ్ళీ. సీత తనకు తెలుసు. మనిషి తెలుసు. మనస్సు తెలుసు. పుట్టినప్పటినుంచీ తెలుసు. తెలియకపోయినా బాగుండేది. కనీసం సీత చెడ్డదైనా—! అలా అయితే మధూను దక్కించుకోగలిగేది. కాని— సీత దేవత. మధూని నమ్మింది. తన్ను నమ్మింది. భగవంతుణ్ని నమ్మింది.

తనకు ఆ శక్తి లేదు. రాదు!

'సీతను నువ్వు మర్చిపోలేవు మధూ.'

'మరిచిపోతాను. నీ సన్నిధిలో—ఈ నీ సమక్షంలో ఎవరూ అవసరంలేదు. ఎవరూ నాకు గుర్తుకు రారు. దగ్గరకు జరుగు. నా మాట మన్నించు.'

'మన్నిస్తాను మధూ! కాని నువ్వూ నన్ను మన్నించాలి.'

ఇద్దరూ ఆ విచిత్ర పరిస్థితిలో దగ్గరై—మరీ దగ్గరై – ఏకం కావలసింది. కాని కాలేదు. శరీరాలు దగ్గరైనకొద్దీ వారి మనస్సులు దూరమైపోతున్నాయి. ఆ దూరాలు ఇంతలై పదింతలై ఆ శూన్యంలో రూపంలేని అగాధాలు నిండుకుపోతున్నాయి. అసెు చెమ్మగిలిన కళ్ళు- వణుకుతున్న పెదవులు—కంది ఎర్రబడిన చెంపలు—సంతోష విషాదాల సాగరమథనంలో ఎగసి ఎగసిపడుతున్న ఆమె గుండెలు—అన్నీ అతని కౌగిట్లోనే— అతనికి దూరమైపోతున్నాయి. ముఖాన్ని— కణతల్ని నిమురుతున్నాడు. కాని – ఆ నిమురుతున్నాననే ధ్యాసలేకుండా—పరధ్యానంగా ఓ ఆటబొమ్మతో ఒకరి ప్రసక్తి లేకుండా ఆడుకుంటున్నట్లు కదులుతున్నది అతని చేయి.

ఆత్మీయుల స్పర్శలో అమృతం వుంటుందేమో. మండువేసవిలో ఎండిపోయి కురిసిన వానచినుకులకు పులకరించిన బీడునేలలా— ఆ స్పర్శ చమటలో తడిసి కదిలింది రేఖ.

తనకు ఎదురు తిరుగుతున్నది తన శరీరం. వేయి పడగలెత్తింది కాం నాగులా. ఆ శరీరానికి ఎదురుతిరుగుతున్నది మనస్సు బ్రతికున్న ప్రతి మనిషికీ మనసుంటుంది. తందరిస్తున్న ప్రతి మనస్సుకూ కోరికలుంటాయి. కోరికను క్రూరవిషసర్పంతో పోల్చారు. బుద్ధుడు కోర్కెను జయించి-శాంతిని సాధించ మన్నాడు. ఆయన సాధించాడట! అందుకే బుద్ధుడయ్యాడట. కోర్కెల విషనాగు కోరల్లో కొట్టుమిట్టాడుతున్న - అల్పమానవునికి - అందుకే ఆదర్శప్రాయుడై, ఆరాధ్యదైవమై నిలిచాడట! ఆ బుద్ధుడు - ఈ దిక్కుమాలిన కోరికలను ఎంత వరకు జయించాడో తనకు తెలియదు. అంతకుమించి- రోగాన్నీ ముసలితనాన్నీ మృత్యువునూ జయించాలని తపస్సు చేశాడట! ఆ తపస్సు ఎంతవరకు ఫలించిందో అదీ తనకు తెలియదు ఆ సాధన రహస్యం తెలిస్తే- తనూ అలా చేయగలిగేది. కాని తనకు తెలియదు. తనకు తెలిసిన మనుష్యుల్లో ఎవరికి ఆ కిటుకు తెలుసో అదీ తెలియదు.

ఆకలితో అలమటిస్తున్న అల్పమానవుని ముందుకు - పంచభక్ష్య పరమాన్నాలు నింపుకున్న పసిడిగిన్నె నడిచివస్తే? కావాలని నే వచ్చా కోరుకుని నీ ముందుకు. ఏం చేసుకుంటావో చేసుకో. తిను. పాయసాన్నే కాదు. నన్నూ జుర్రుకో - అంటూ సవాలు చేస్తే?- ఆ ఆరని అడవిమంటలాటి ఆకలిముందు నిలబడగల ఆత్మశక్తి ఎవరు సాధించగలరు?

'భగవాన్' అనుకుంది రేఖ. మూలుగు అది.

'కాదు కాదు' అనుకుంది. అది మూగవోయిన రోదన.

'మధూ! ఈ వలయంనుంచి బయటపడే శక్తి నాకు లేదు. కాని....నువ్వు లేకుండా-దగ్గరకు రాకుండా-నాకు శాంతిలేదు నేను నిలవలేను. అనాడు....పాపం చేయనీ, శిక్ష అనుభవించి విముక్తిపొందనీ, ఈ మాలిన్యంలో కరిగి నరకాన్ని చూడనీ దేవాలయంలో....ఏమిటి వెర్రి? పిచ్చిదాన్నై పోతున్నాను దీపశిఖపై మోజుపడుతున్న శలభంలా ఎగురుతూంది మనస్సు. నామీద నాకే అంతులేని కోపం. ద్వేషం. పగతీర్చుకోలేను. తీర్చుకోకుండా వుండలేను.!' సీత? పెద్ద ప్రశ్న గుర్తు? తనను ప్రాణానికి ప్రాణంగా చిన్ననాటి నుంచీ ప్రేమించిన సీత - నిలువునా ఒక ప్రశ్నగుర్తుగా తనముందు నిలబడింది. 'వద్దు మధూ! వద్దు! వద్దు! వద్దు! భగవాన్' అరిచింది రేఖ.

'రేఖా!'

'మధూ! ఆమె పుట్టింది ఎన్నడో. ఆ పుట్టింది నీకోపం. పెరిగింది నీ కోపం. ఆశలు పెంచుకుంది నీ కోపం. నిన్ను భర్తగా ఊహించుకుని కలవరి

స్తున్నది. నేను నీ జీవితంలో—ఈ వెర్రి ఆవేశం తోడుచేసుకు ప్రవేశిస్తే ఏమౌతుందో ఆలోచించు. నేను అబలను. నువ్వే చేయాలి సాయం నన్ను పాపినిచేసి శపించకు. ఎన్నటికీ విముక్తిలేని దారుణమైన శిక్ష విధించకు. దేవతలాంటి మనిషి సీత! ఆమె జీవితం ఏమౌతుందో ఆలోచించు. ఊహించి చూడు. దానికి—ఇంతటి కఠినశిక్ష విధించే అర్హత నాకు లేదు మధూ!.'

మధు దగ్గరకు జరిగాడు మరీ.

ఆమెను గుండెలకు హత్తుకున్నాడు యింకా.

'మధూ' అంటూ వెర్రికేక పెట్టింది పెనుగులాడుతూ. గది తలుపు ఓర వాకిలిగా తెరిచివుంది. లోపల జరుగుతున్న రభసకు బయట జనం చేరారు. అరిదైన జనం, తేరర్లు, సర్వర్లు ఆదా—చుగా. సందులోంచి సరదాగా చూస్తున్న ళ్ళు.

'దయుంచి వెళ్లు మధూ! నన్ను క్షమించు ఓపికుంటే కాకపోతే దూషించు. ద్వేషించు. మెడను నుమిలి ఈ పాపిష్ఠి ప్రాణం తియ్యి శరీరమంతా మనస్సా మండిపోతున్నది. ఈ మంటల వెలుగు నీకోసం. నీ క్షేమం కోసం. నా సీత కోసం.'

'ఏమౌతూంది నీకు రేఖా?'

'ప్రాణం పోవడంలేదు. నన్ను కరుణించి దయ చూపించు.'

'ఏం చెయ్యను. చెప్పు.'

'వెళ్ళిపో, నా కళ్ళముందుమంచి వెళ్ళిపో. మళ్ళీ ఎన్నడూ కనిపించకు ఈ నిర్భాగ్యురాలికి'

'ఎక్కడికి వెళ్ళాలి?'

'ఎక్కడికో నీకు తెలుసు'.

* * * *

'ఇన్స్పెక్టరు గారూ! ఇది రేప్ కేస్' అన్నాడు లోకనాథం కంగారుగా.

'లెట్ అజ్ సి.'

'ఎన్నేళ్ళండీ శిక్ష'

'ఆగవయ్యా నువ్వు. అసలు ముందు విన్ను అరెస్టు చెయ్యాలి.'

'ఇన్స్పెక్టరుగారూ! ఇదండీ జరిగిన కథ. అర్థమయింది కదా?!

'షటప్! అందరూ బయటకు వెళ్ళండి.'

'నే కూడానా?'

'ఆమె పరిస్థితి బాగాలేదు. రిపోర్టు రాసుకోవాలి. మీరుకూడా. ప్లీజ్. అందరూ ఇక్కడ వుండగూడదు. బాయ్, రెండు కాఫీ.'

అందరూ వెళ్ళిపోయారు. కాఫీవచ్చింది. బలవంతంగా కాఫీ త్రాగించాడు. మాట్లాడే ఓపిక లేదు రేఖకు.

మధును అరెస్టు చేయించాలని లోకనాథం పోలీసుల్ని పిలిపించాడన్నమాట. చచ్చుపీనుగు!

'చూడు'

'ఏమిటన్నావ్ నీ పేరు?' అన్నాడు తాపీగా ఇన్స్పెక్టర్.

చెప్పింది.

'రేఖ! వండ్రపుల్! పేరు బాగుందమ్మాయ్.'

'ఏం? నేను బాగాలేనా?' అనేది ఉంకో టైంలో అయితే. కాని చావు బ్రతుకులమధ్య కొట్టుమిట్టాడే మనిషికి జోకులువేసే శక్తి వుండదు. ఎదుటివాళ్ళ ఛలోక్తులు అర్థంచేసుకునే శక్తి అసలే వుండదు.

'జరిగిందేదో జరిగింది. ఈ మధ్య ఇలాటి కేసులు రోజూ అరడజను పైచిలుకు చూస్తున్నా రాత్రి ఒక పెద్ద ఆఫీసరు తప్పత్రాగి చివరకు కట్టుకున్న భార్యనే స్వయానా రేప్ చేశాడు' – ఆ జోకుకు అతనే నవ్వుకుని 'ఫైవ్ మినిట్స్! జాగరణ నైటంతా. ముఖం కడుక్కొస్తా.'

బాత్రూంలోకి – అతి చనువుగా నడిచాడు.

తలుపు లోపలవేసి మరీ నడిచాడు.

'పారిపోయాడు గనుక బ్రతికిపోయాడు రాస్కెల్' అన్నాడు టంచన్గా అయిదునిమిషాల తర్వాత గదినుంచి బయటకి వస్తూ ఇన్స్పెక్టర్.

కూర్చున్నాడు ఎదుట సోఫాలో. సిగరెట్ అంటించాడు పొగ వదులుతూ, ఎక్సరే తీస్తున్నట్లు తీక్షణంగా రేఖ కళ్ళల్లోకి చూస్తున్నాడు. శోధిస్తున్నాడు. లోలోని– నేరాన్ని– తల వంచుకుంది రేఖ. కాఫీ త్రాగుతూ తాపీగా–'ఏ వూరు?' అన్నాడు. చెప్పింది. 'ఏంచేస్తాడు మీ నాన్న?' 'వయస్సెంత?' 'వాన కురుస్తూంది బయట.'

ఏవో అడుగుతున్నాడు. ఏదో చెబుతూంది సగం సగం.

'చూడు రేఖా! నీకు ఇలాటి వ్యవహారం కొత్త. మాకు రొటీన్. నువ్వు కోపరేట్ చేయకపోతే ఎవ్వరం ఏం చేయలేం ఆ రాస్కెల్ పోతాడు ఏడేళ్ళకు తక్కువలేకుండా. అసలు అంతకుముందు వాడు తెలుసా నీకు. అహ! తప్పని కాదు. చెప్పాలి అలా తలాయిస్తే చిక్కుల్లో పడ్తావ్. వంట్లో బావున్నట్లు లేదు. మరి కాస్త కాఫీ మరే అలవాట్లూ లేవు గదా? ఆడవాళ్ళకు ఏ అలవాటైనా మరీ జోరుగా వెళ్ళిపోతారు.'

తల వంచుకునే కూర్చుంది రేఖ ప్రతిమలా. బెల్లు మ్రోగింది. ఇన్స్పెక్టర్ లేచి తలుపు తెరిచాడు. ఎవరో తలుపు తెరిచి పిల్లిలా లోపలికి వచ్చారు.

తలెత్తి చూసింది రేఖ.

'హలో! హనీ' అన్నాడు ఇన్స్పెక్టర్.

'ఫోన్ ఫర్ యు' అంది ఆ మెరుపుతీగ.

తల వంచుకుంది మళ్ళీ రేఖ.

'హనీ'_ చిత్రమైన పేరు. ముద్దుపేరు గామల్సి. ఈ హనుల సంగతి అంతకుముందు రేఖకు తెలియదు. ఏ విషయమైనా, ఏ విద్యయినా పుట్టగానే ఎవరికీ తెలియదు. క్రమక్రమంగా అనుభవం చెబుతుంది పాఠాలు. అనుభవమున్న మనిషి ఎదురైంది రేఖకు.

'బేబీ' అంది మెరపుతీగ.

'నా పేరు రేఖ' అంది అంత కోపంలోనూ నవ్వుమంది. 'గిత్తంగుర్రంలా ఎదిగావే. మొగుడొచ్చి ఆ రెండుకొమ్ములూ వంచితేకాని నీ పొగరణగదు' అనేది బామ్మ. 'మాంచి ఖారీ పర్సనాల్టీ' అన్నాడు చలమయ్య వ్రతకుడు ఒకసారి చెరువు నుంచి నీళ్ళుతెస్తుంటే_ తలారా స్నానంచేసి తడిగుడ్డతో బాడీలేని చోళీతో వస్తుంటే_ 'సినిమావాళ్ళకేం తెలుసు సెక్సప్పీలంటే! సగంసగం గుడ్డలతో గెంతు కోయడమా_ సినిమా తీస్తే యమ నేచురల్గా తీస్తాట్ట లోకనాధం'_' వాడి పిండాకూడు. పంతులు మెరకదిబ్బచుట్టూ తిరగడం మానడం, వేదాంతాచార్లు భగవద్గీత ఉపన్యాసాలు మానెయ్యడం_ లోకనాధం సినిమా తీయడం_ ఈ జన్మలో జరిగే పని కాదు. వీళ్ళందరినీ దండకారణ్యానికి తోలుకుపోయి నాగళ్ళకు కట్టి పొలాలు దున్నించాలయ్యా_ ఆడపిల్ల కనిపిస్తే చాలు కంటికి ఎదురుగా సినిమా తీస్తాడొకడు. మెరకదిబ్బకు పరిగెడతాడుంకొకడు. భగవద్గీత చదివి శృంగారపరంగా వ్యాఖ్యానం చెబుతాడుంకొకడు.' 'ఏమైనా పన్నెండేళ్ళ వోణీవయస్సులో మా యింటిది ఇల్లాలై వీళ్ళోసుకుంది. అదే భేషుగ్గా వుంది. అలా ఎదిగిపోయి ఎదురుగా తిరుగుతుంటే ఆడపిల్లలు ఇలా! _ ఈ వయస్సులో నాకే తిమ్మిరెక్కుతూంది.' 'అది సరే! అసలు రాజయ్యకూతురులోనే వుందయ్యా అసలు సిసలు రాజసం.'

ఎన్నడో పుట్టినపుళ్ళో పెద్దలు తమ్మ ఆశీర్వదిస్తూ అన్న మాటలు గుర్తొచ్చి అద్దంలో చూసుకుంది. కళ్ళు వాచిపోయాయి. జుట్టు రేగిపోయింది. తిలకం చెరిగిపోయింది. చీర నలిగిపోయింది.

'అలా కంగారుపడకు బేబీ! కొత్తలో అలాగే వుంటుంది. స్నానం చేసి డ్రస్చేసుకో. గది మార్పిస్తా. ఈ వయసులో ఇలా బియర్సా?'

అనుమానంగా చూసింది ఆమె ముఖంలోకి రేఖ.

ఫోను మ్రోగింది.

'యస్! గ్రేస్ హియర్! కమింగ్! టు మినిట్స్.'

'ధైర్యంగా ఉండాలి బేబీ! అయామ్ యువర్ సిస్టర్. కనిపించిన ప్రతి మనిషినీ అనుమానిస్తే- సాంపిల్‌కుకూడా ఫ్రెండ్ దొరకడు ఈ వరల్డ్ మొత్తంలో. ఏమిటి అలా చూస్తున్నావ్? కష్టాలూ బాధలూ కన్నీరూ- రుచిచూడని మనిషెవరు ఈ భూలోకంలో? ఒకరికి తింటానికి కావలసినంత వుంటుంది. తిండి అరగదు. ఒకరికి పందిరిమంచం, డన్‌లప్ పిల్లో, ఎయిర్‌కండిషన్డు రూం అన్నీ వుంటాయి. 'నిద్దరట్టదు'. మా హోటలు మానేజరు ఎన్నిసార్లు ఉడుకులోనులో జలక్రీడలాడినా జిడ్డుకారుతూనే వుంటాడు. ఏ మనిషికైనా బాధలుంటాయి. దులుపుకు తిరగాలి బేబీ! పట్టించుకుంటే అన్నీ బాధలే. మా ప్రొప్రయిటరు కూతురు - తన పెంపుడు కుక్కపిల్ల కారుక్రిందపడి చచ్చిందని బెంగపెట్టుకుని ఖరీదైన హాస్పిటల్‌లో చేరి - ఖరీదైన టానిక్కులు త్రాగుతూ - కాలక్షేపం అసలు లేక మంచమెక్కి- సినిమాపాటలు పాడుకుంటూ గుమస్తా - హవుస్‌సర్జన్ - ఓ రివటలాటి కుర్రాణ్ణి రహస్యంగా రిజిష్టర్డ్ మారేజి చేసుకుంది. పెట్టుకుంటే అన్నీ బాధలే. అన్నీ బరువులే. అందుకే దులుపుకు తిరగాలంటాను. మనిషికేం కావాలి చెప్పు! కడుపునిండా తినటానికి తిండి- కంటినిండా 'నిద్రోటానికి' 'శుభ్రమైన' పక్కా, కారంకారంగా తియతియగా కాలక్షేపానికి జనం - ఖర్చుపెట్టుకోటానికి డబ్బూ. పద పద, గది మారుస్తా అలా మరీ బుర్ర ఖరాబయేలా ఆలోచించకు. ఈ ఆలోచనలే ఏనుగుల్లాటి మనుషుల్ని పీనుగుల్నిచేసి తినేస్తాయి. పిచ్చిపిచ్చి ఆలోచనలు పెట్టుకోవు గనుకనే- ఆ కొండలూ రాళ్ళూ అలా పదికాలాలపాటు చీకూ చింతా లేకుండా సుఖంగా బ్రతుకుతున్నాయి. ఎలా సుఖపడాలో తెలియనప్పుడు పడేవాళ్ళను చూసి నేర్చుకోవాలి ఈ హోటల్లోనే- రిసెప్షనిస్టును నేను. నీలాటి ఆడకూతుర్నే. పద మరి బేబీ '

మళ్ళీ తలుపు చప్పుడు-

'గ్రేస్' అన్నాడు లోపలికొస్తూ ఇన్‌స్పెక్టర్.

'ఏమిటా కంగారు కేకలు బాసీ?' అంది గ్రేస్.

'ఇది చాలా సీరియస్ కేస్.'

'అంత సీరియస్సేముందబ్బా?'

'నీకు తెలియదు.'

'తెలుసులే.'

'నవ్వులాటకాదు. బాస్‌నుంచి ఫోనొచ్చింది.'

'ఎందుకో?'

'ఒక గాంగ్‌లీడర్‌కోసం గాలిస్తున్నాం. నేపాల్ పోయాడని ఒక రిపోర్టు అమెరికా చేరుకున్నాడనీ – అదే బ్రెజిల్ – దక్షిణ అమెరికా. అక్కడ పేరు మార్చుకు బిజినెస్ చేస్తున్నాడనీ ఇంటర్‌పోల్ రిపోర్టు. చెంబల్ వ్యాలీలో బంది పోటు దొంగల్తో చేతులు కలిపాడని – ఓ సమాచారం. వాడే వీడని ఇంతకుముందే మా బాస్‌కు టెలిఫోన్ మెసేజీ వచ్చింది. వాడు ఈ అమ్మాయిని ఇలా వదిలి పారి పోయాడు. గాలిస్తున్నాం. చూడమ్మాయ్! ఇంక దాచి లాభంలా. నీకు ఇతగాడు– ఈ రాస్కెల్ – ఇంతకుముందు తెలుసా అని అడుగుతున్నాను. నిజం దాచి పుచ్చినా – అబద్ధం చెప్పినా – చిక్కుల్లో పడ్తావ్. అనక నేను కూడా నిన్ను రక్షించలేను. చెప్పు– గ్రేస్! నువ్వు ఇంక వెళ్లు!' అన్నాడు గట్టిగా ఇన్‌స్పెక్టర్.

గ్రేస్ వెళ్ళిపోయింది కోపంగా.

నయానా భయానా రకరకాలుగా హెచ్చరించాడు. ఏం చెప్పాలో తెలియక– ఎలా చెప్పాలో అంతకంటె తెలియక మౌనంగా నిర్జీవంగా, నిస్సహాయంగా ఇన్‌స్పెక్టర్ కళ్ళల్లోకి చూసింది రేఖ. తీక్షణంగా చూస్తున్నాడు. తనలోన– లోలోన– హృదయాంతరాళాల గూడిల్లో దాక్కున్న రహస్యాలను వెతికి చూడా లని యత్నిస్తున్నాడు. తనకోసం మధు ఇబ్బందులపాలై పోతే?– రేపో మాపో అత గాడికి సీతతో పెళ్ళి. అపఖ్యాతిపాలైపోతే? – తనకు వచ్చే ఖ్యాతి లేదు ఇంక. అపఖ్యాతి వచ్చింది ఎలాగూ వచ్చింది. కొన్ని మచ్చలు జీవితంమిద పడగూడదు. పడితే ఆ బ్రతుకు మట్టిలో కలిసిపోయేదాకా అవి పోవు.

'ఇది చివరిసారి నిన్ను అడగటం. లాకప్ చేయాల్సి వస్తుంది. చెప్పు? ఎవరు వాడు?' కఠినంగా గర్జించాడు ఇన్‌స్పెక్టర్.

'అతను నీకు తెలుసా? అని అడుగుతున్నాను చివరిసారి' అన్నాడు మళ్ళీ ఇన్‌స్పెక్టర్ పదింతల కఠినంగా.

పులికోరల్లో చిక్కుకున్న లేడిలా, పిల్లి చేర్చి నమలబోతున్న పిచ్చుకలా– వణికింది రేఖ భయంకరమైన ఒంటరితనం – మింగేస్తున్నది ఆమెను.

'తె....లు....సు' అంది తనలో తాను.

'ఏమిటి అతని పేరు?'

'మధుమూర్తి–' అనబోయింది కాని అనలేక గొణిగింది.

'కోపంవస్తే నే మనిషిని కాదు. చెప్పు. అంతా చెప్పాలి.'

తప్పదని తెలుసుకుంది. తల వంచుకునే చెబుతున్నది. రాసుకుంటున్నాడు ఇన్‌స్పెక్టర్. రేఖ చెప్పిన మాటల సారాంశం.

'అతనిపేరు సత్యం. మావూరే. గన్నవరం తాలూకా కొనుకొలను మా ఊరు. అతనూ నేనూ ప్రేమించుకున్నాం. పెద్దవాళ్లు పెళ్ళికి ఒప్పుకోలా. ఇలా లేచివచ్చేసాం. అతని ఇతర వ్యాసంగాల గురించి నాకు తెలియదు. ఏ గుళ్ళోనో రిజిష్ట్రి ఆఫీసులోనో పెళ్ళిచేసుకుంటాం. మేం ఏం తప్పూ చెయ్యలేదు. మమ్మల్ని వదిలిపెట్టండి. దండం పెడ్తాను.'

ఏడుస్తూ - తడబడుతూ - అప్పటికప్పుడు ఆలోచించుకు చెబుతున్నట్లు తత్తరపాటుతో రేఖ చెప్పిన మాటల సారాంశం ఇది.

'ఏ సినిమాలోది ఈ కథ?'

'ఏ కథ?'

'నువ్వు చెప్పిన కథ?'

'కథ కాదండీ.'

'నిజం కదూ?' అంటూ నోటికొచ్చినట్లు తిట్టాడు భయంకరమైన తిట్లు.

రేఖ చంటిపిల్లలా గుక్కపట్టి ఏడ్చింది. అంతటి దౌర్భాగ్యమైన తిట్లు తాను ఎన్నడూ తిన్నది కాదు. తనమీద జాలి చూపటానికి తన్ను రక్షించటానికి ఎవరూ లేరు. ఆ గదిలోనే కాదు. ఈ ప్రపంచంలో లేరు. ఈ జీవితంలో లేరు. 'గ్రేస్'- ఆ అమ్మాయి ప్రేమగానే మాట్లాడింది. కాని-?

అప్పుడు గదిలో అడుగుపెట్టాడు బుచ్చిబాబు.

ఆ సమయంలో చిట్టిబ్బాయి కొడుకు 'బుజ్జిబు'- అక్కడకు వస్తాడని రేఖ కలగనలేదు. అతగాడికి తనను ఇస్తానంటూ- ఒకనాడు బుజ్జిబు తండ్రి చిట్టిబ్బాయి దగ్గరకు తండ్రి రాయబారం వెళ్ళాడు. అవమానం పొంది తిరిగొచ్చాడు. 'బుజ్జిబు' అంటే తనకు ఎన్నడూ మంచి అభిప్రాయం లేదు. తాగుబోతనీ, తిరుగుబోతనీ జూదగాడనీ- అంత చిన్న వయస్సులో సమస్త విద్యలూ నేర్చుకుని - తండ్రిని మంచివాడనిపిస్తున్నాడనీ- అందరూ చెప్పుకుంటారు.

ఇన్స్పెక్టర్‌ని ప్రక్కకు తీసుకెళ్ళి ఏదో చెప్పాడు.

'సారీ' అంటూ వెళ్ళిపోయాడు ఇన్స్పెక్టర్.

'ఇంక భయపడకు. కాఫీ....? పోనీ - ఇంక ఆ మొహం తీసెయ్. కూల్ డ్రింక్?'

బుజ్జిబు చూపుతున్న దయ అపారంగా వుంది. ఎన్నడూ అతనితో అంత దగ్గరగా వుండటం అనుభవంలేదు రేఖకు. అతగాణ్ణి గురించి ఆడపిల్లలందరూ రకరకాల కథలు చెప్పుకునేవారు. అతను వస్తుంటే తొలగిపోయేవారు - పులిని చూసి ప్రాణాలు అరచేతపట్టుకు పరుగులుతీస్తున్న లేడిపిల్లల్లా.

కాని__

ఏనాడూ తాను ఊహించనిది - ఈనాడు జీవితంలో జరుగుతున్నది. ఏ మనిషి తన్ను తిరస్కరించాడో- ఆ మనిషి సహాయం - ఆ ఊబిలోంచి బయట పడటానికి తనకు అవసరమౌతున్నది!

'రేఖా! నా గురించి నువ్వు మంచిగా అనుకుంటావని- నే అనుకోవటంలేదు.' అన్నాడు బుజ్జిబు కూల్ డ్రింక్ ఇస్తూ.

బుజ్జిల్ని చూసింది రేఖ.

ఏదో పోగొట్టుకుని వెతుక్కుంటున్నవాడిలా కనిపించాడు. తన కళ్ళలో ఏదో అన్వేషిస్తున్నాడు.

'నేనంటే మీకు కోపం కదూ?' అన్నాడు.

'ఎందుకు?' అంది రేఖ. పల్చగా పేలవంగా సమాధానంకోసం అడిగిన ప్రశ్నలా లేదు. ఇంక ఏం మాట్లాడాలో తెలియక - ఏదో మాట్లాడాలి గనక అడిగిన ప్రశ్నలా వుంది.

'ఎందుకో నాకు తెలుసు. కాని అసలు విషయం కూడా నాకు తెలుసు. చెప్పనా? ... వద్దులే. మీకు వినాలని కుతూహలం ఏమీ లేదనుకో.'

'అబ్బే! కాదుకాదు చెప్పు.'

'అయినా- ఈ పరిస్థితిలో - మీ బాధలతోనే - నువ్వు సతమతమైపోతుంటే నా గొడవతో ఇంకా బాధపెట్టటం అనవసరం.'

'బాధలేదు బుచ్చిబాబూ.'

'అబద్ధం ఆడలేవు రేఖా నువ్వు.'

'అంటే?'

'ఆ విషయం నువ్వు మర్చిపోలేవు.'

'ఏ విషయం?'

'నిన్ను నాకిస్తానంటూ మీ నాన్న - ఒకనాడు మా నాన్నదగ్గరకు వచ్చిన విషయం. ఆనాడు మత్తువోగరులో మా నాన్న - మీ నాన్నను అనరాని మాటలు అని చెప్పు చూపించిన విషయం. ఏమిటి అలా తల పట్టుకున్నావు?'

'తలనొప్పి.'

'తలనొప్పా?'

'ఇది వేసుకో. మాత్ర. కాసేపు నిద్రపోతే....'

'ఎందుకిది?'

'కాసేపు నిద్రపడుతుంది. చాలా అలిసిపోయినట్లున్నావు!'

'వద్దు.'

'ఎందుకని? నామీద నమ్మకంలేదు కదూ?'

'..... ..... ..... ..... .....'

'నీకు మత్తుమందు పెట్టి - ఒంటరిగా నిస్సహాయంగా వున్న నిన్ను ఏదో చేసేటంత నీచుణ్ణి కాదు'

'కాదు బుచ్చిబాబూ.'

'కాకపోతే విషం పెట్టి నీ ప్రాణం తీస్తాననుకుంటున్నావా?'

'నా ప్రాణంతీస్తే నీ కేమొస్తుంది బుచ్చిబాబూ! అవక ఏంచేసుకుంటావీ కష్టైమ. కర్చులు కూడా నువ్వే పెట్టుకుని మట్టిచెయ్యాలి.'

చేతిలో మాత్ర గిరవాటు పెట్టాడు.

'ఏమయింది?' అంది రేఖ.

'ఇదిగో! ఈ సీసా చూడు.'

చిన్న సీసా జేబులోంచి తీసింది. 'దీన్నిండా వున్నాయి మాత్రలు. నేను రోజూ గంటగంటకూ వేసుకుంటాను. కాస్త పనిచేస్తాయి' అన్నాడు బుచ్చిబాబు.

'నువ్వెందుకు వేసుకుంటున్నావు మాత్రలు?'

'బాధ భరించలేక- అప్పుడే మరో లోకానికి దండెక్కలేక. ఇదిగో? సీసా తియ్యి. ఊ! చేతిలో వేసుకో కావిల్సి మాత్రలు_'

రేఖ చేతిలో అయిదారు పడ్డాయి. 'రెండు ఇయ్యి' అన్నాడు. రేఖ ఇచ్చింది. వేసుకు మ్రింగి 'నువ్వు ఒకటి వేసుకో' అన్నాడు.

వేసుకుంది. మంచినీళ్లు త్రాగింది.

'రేఖా!'

'ఊ!'

'ఒక చిన్న కోరిక.'

'చెప్పు.'

'ఇద్దరంకలిసి భోంచేద్దా'మన్నాడు ఏదో పెద్ద అడగరానివిషయం అడిగినట్లు.

జాలిగా నవ్వింది రేఖ.

తల తిరుగుతున్నది.

'ఇంకా ఏమిటో అడుగుతావనుకున్నాను.'

సర్వరు రెండు ప్లేట్లు భోజనం తెచ్చి పెట్టాడు. మౌనంగా తింటున్నారిద్దరూ-

బుచ్చిబాబు ముఖంలోకి తదేకంగా చూసింది రేఖ. ఏదో అమాయకత్వం కనిపించింది. అవలింతలు. మగత.

'కళ్ళు తెరుచుకున్నా తెరిపిడి పడటంలేదు బుచ్చిబాబూ.'

'పడుకో.'

మరబొమ్మలా కదిలింది రేఖ. (సశేషం)

---

Printed and Published by A. Chandra Sekar Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor: A SUDHAKARA RAO


మా
అతల
జగతీయ
ఆహార ఖనిధి
అత్యధికంగా
సమర్పించి
'మహామాత'
బిరుదాన్ని గెల్చుకున్న
అతలమహిళల
విగ్రహాల్లో
ఇది
మొదటిది!
? ?
10

